## గురుస్తుతి

క॥ మృచ్ఛకటిక కనువాదము
స్వచ్ఛముగాఁ దెనుగువచన భంగిని వ్రాయన్
నిచ్చలు నను శాసించిన
సచ్చరితుని మేనమామ సంస్మరియింతున్ ॥

## కృతిసమర్పణ

తే॥ గీ॥ శాంతగంభీరమూర్తి సౌజన్యవార్ధి
పరమకారుణికుం డాంగ్లవైద్యవిదుఁడు
అట్టి మత్పతి రామకృష్ణార్యునకును
అంకితమొనర్తు నీకృతి నధికభక్తి॥

# పరిచయము

'కావ్యేషు నాటకం రమ్య' మ్మనియు 'నాటకాంతం సాహిత్య' మ్మనియు మన సాహితీవేత్తలు కనుగొనిన తత్త్వము. కావుననే సంస్కృతభాషయందే గాక యితర భాష లెన్నిటిలో నున్నను నాటకములను స్వభాషలోని కనువదించుట కర్తవ్యము. పరిణతి నొందినట్టియు, భారతీయము నగు భాషితములు నాటకములందు వాడబడును గావుననే సర్వసాహిత్యములందును గల నాటక వాఙ్మయము ననువదించుట స్వభాషాపోషకము.

ఒక్కొక నోటినుండియు, నొక్కొక కలమునుండియు విలక్షణ మగు ధారావాహిని వెలువడి వినూత్నమై భావుకుల నానందరసమున నోలలాడించును. గావునఁ దత్పూర్వ మీనాటక మెవ్వరిచేనైన నను వదింపఁబడెనా లేదా యను జిజ్ఞాసయు ననవసరము. ఏకకవి కృతమైన యనేక గ్రంథములలో నేయొక్కటియో ప్రసిద్ధిబడసిన ట్లనువాదము లొక్క గ్రంథమునకు వేయి యున్నను నందొక్కొక్కటియే పాఠక లోకమునఁ బ్రసిద్ధివడయునుగదా!

మృచ్ఛకటికము సంస్కృతనాటకములలో నెల్ల వన్నెకెక్కి ఖండాంతరవాసులచేఁ గూడ వేవిధములఁ బ్రశంసింపఁబడిన నాటకము. ఏకాలమందైనను సరిపడుచు నుపదేశరూపముగాఁ బనికివచ్చుటయే మన పూర్వసాహిత్యమందు గల ప్రతిభ. అట్టి ప్రతిభఁ గొన్నది మృచ్ఛకటికము. ఇందుఁ గవి చూపఁబూనిన యాదర్శములన్నిటి నిచట నుల్లేఖించుట యప్రస్తుతము. ఐనను నీనాటక మార్య బౌద్ధ జైన సంస్కృతుల నన్నిటిని దనలో గలుపుకొన్నందున సర్వజనసమాదర ణీయమైనది.

ప్రజాస్వామ్యము, సామ్యవాదము మొదలగు రాజకీయ తత్వ ములకుఁ బునాదులు వేసినది మృచ్ఛకటిక నాటకము. ప్రజారాజ్య నాయకత్వమునకుఁ దగిన నాయకుని సృజించిన దీనాటకమే. ఆర్య చారుదత్తుఁ డట్టి ప్రసిద్ధపౌరలక్షణములు గలవాఁడు.

శ్రీమతి విద్వాన్ రావూరి వేంకటసుబ్బమ్మగారు ఆంధ్రస్త్రీలోక మునకును, బండితలోకమునకును బరిచితురాలు. ఆమె రచించిన యీ యనువాదము పండితులకును, సామాన్య విజ్ఞానులకును ఆదరణీయమగు ప్రసన్నరచనతో సాగినది. సంస్కృత నాటకములను, తదితర సంస్కృత వాఙ్మయమును ననువదించుచున్న యితరులవలెఁగాక ఈ కవయిత్రి స్వయముగ సంస్కృతపాకమును బాగుగా రుచిజూచిన విద్వాంసురా లనియు నీమె మృచ్ఛకటిక నాటకమును మొదటినుండి తుదిదాక తనంతఁ దా రచించుట యెఱిగియు నేనీమె రచనను బాఠకుల కెఱింగింపఁ బూనినాను.

ఆంధ్రభాషాయోష కమూల్యాలంకారములైన గయోపాఖ్యా నము మొదలగు స్వతంత్రనాటకములఁ బ్రప్రథమముగ సరసముగను బ్రసన్నముగను మృదులములగు హాస్యములతోడను రచించి నవ్యాంధ్ర సాహితీ పితామహులని కీర్తివడసిన శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహ కవిగారి కీమె మేనగోడలనియు బండితవంశమున నీమె జన్మించిన దనియుఁ జెప్పినచో జాలునని యెంచి యీయామె రచనయందలి వాక్య ములను మచ్చుఁజూపఁ గడంగలేదు.

మృచ్ఛకటికమునకు శ్లోకమునకుఁ బద్యము — వచనమునకు వచ నముగను దిరుపతి వేంకటకవుల యనువాదమున్నను మఱికొందరి వ్యావ హారికానువాదము లున్నను నీమె యనువాదము సులభగ్రాంధికమై వెల యుటచే సర్వజనసమాదరణీయము గాఁగలదు. అనువాదమున తెనుఁగుఁ

దనము చక్కగానుండుట కేవలస్వతంత్రరచనముగా భాసిలుచున్న
వచనానువాదము లవసరమనునట్టి జనాభిప్రాయమును పరికించి నా
మంతటిని వచనానువాదముగా జేయుటయే వీరి యుద్దేశము. కర
మంజరి యను ప్రాకృతభాషానాటకమును, ఉదారపాండవమను న
గ్రంథమును ఈమె మున్ను రచించుట తెనుగు దేశమునకు బరిచిత
సుమా రిరువదియైదు వత్సరములు బాలికల యున్నత పాఠశా
యందును, మద్రపురీ కళాశాలయందును నధ్యాపకురాలై చదువ
మున స్తశాస్త్రముల నారసిన పండితకవయిత్రి యగు నీమె రచనము
నేనింతకన్న మెఱుగుపెట్ట నెంచుట ప్రయాసభూయిష్ఠము.

బహు సంప్రదాయనిబద్ధ మగుటవలన దుర్బోధమగు సంస్కృ
హర్ష చరిత్రము నీమె సంపూర్ణముగ ననువదించినదని చెప్పినచో
సంస్కృతభాషావివేకమును వేఱ నుతింప నవసరము గాదు. సుమా
పదియేండ్లక్రిందటనే యీరచనను ముగించినను నేటికి ముద్రితము గావి
ముద్దుబిడ్డనుబోలె నాంధ్రులకుఁ బరిచయము సేయఁబూనుట యు
వారసుల యదృష్టము.

నేటి విద్యార్థులచే వేయి పౌరవిధులఁ బిక్క వేయించుటకంటె
వేయి సంఘసహాయ కార్యములందు వారికి తర్ఫీదు నిచ్చుటకన్న
ఇట్టి యొక్క నాటకమును పాఠ్యముగాఁ జేసి యానాయకుల స్వభా
ముల విద్యార్థుల హృదయములకుఁ బట్టించుట యెంతయు శ్రేయ
దాయకము.

విద్వాన్ — శిరోమణి
విశ్వనాథ
అప్పలనరసింహశాస్త్రి
సంస్కృతోపాధ్యాయుడు

Government Secondary and
Training School for Women,
Rajahmundry, 12—12—1955.

# కృతజ్ఞత

శూద్రకమహారాజు సంస్కృతభాషలో రచించిన మృచ్ఛకటిక మును వచననాటకముగఁ దెనిఁగింపుమని నాగురువులును, నా మేనమామ గారును నైన శ్రీ॥ శ్రీ॥ చిలకమర్తి లక్ష్మీనరసింహాకవిగారు నాకొకప్పు డానతిచ్చిరి. వారి యాజ్ఞ శిరసావహించి, యిప్పటికి పదేఁడ్లకుఁ బూర్వమే నేనీ నాటకమునకు నాయోపినకొలది తెలుగు వ్రాసితిని. ఎప్పటికప్పుడు పాఠశాలపనుల తొందరలో గ్రంథమును సరిచూచి ముద్రింపించుట కవకాశము లేకపోయినది. ఇటీవల నే నుద్యోగవిరా మము నందినపిదప గ్రంథమునంతేయు సరిచూచుకొని, ముద్రింపఁ దల పెట్టితిని. ఇంతలో నా పూర్వవిద్యార్థినులు నాకు 'షష్టిపూర్తి' యుత్సవము గావించి, యీ సందర్భములో కొంతసొమ్ము విరాళముగ సేకరించిరి. వారా ద్రవ్యముతో నాషష్టిపూర్తియుత్సవమునకు నేదైన శాశ్వత జ్ఞాపికను, నిర్మింపఁ గుతూహలపడిరి. వారి యీయుద్దేశ్యము ననుసరించియే నేడీరీతిని మృచ్ఛకటిక నాటకమునకు వచనానువాదము వెలువడినది.

నాపూర్వవిద్యార్థినులకును నందు ముఖ్యముగా షష్టిపూర్తి నిర్వ హణము నందును, గ్రంథముద్రణమునందును, మిగుల శ్రద్ధవహించి పనిచేసినవారికిని నాహృదయపూర్వక శుభాశీర్వాదములు.

సవిమర్శమగు నుపోద్ఘాతమును వ్రాసి యిచ్చిన నాసోదరోపా ధ్యాయులు శ్రీయుత విశ్వనాథ అప్పలనరసింహశాస్త్రిగారికి నాకృత జ్ఞతఁ దెలుపుచున్నాను.

ఇట్లు,

విబుధజన విధేయురాలు

రావూరి వేంకటసుబ్బమ్మ

# ఇందు వచ్చు పాత్రలు

చారుదత్తుడు — కథానాయకుడు ( బ్రాహ్మణవర్తకుడు )
మైత్రేయుడు — విదూషకుడు ( చారుదత్తుని చెలికాడు )
శర్విలకుడు — బ్రాహ్మణుడు ( చోరుడు )
ఆర్యకుడు — గొల్లపిల్లవాడు ( క్రొత్తరాజు )
శకారుడు — రాజశ్యాలకుడు
రోహసేనుడు — చారుదత్తుని కుమారుడు
సంవాహకుడు — బౌద్ధసన్యాసి ( చారుదత్తుని పూర్వసేవకుడు )
వర్ధమానకుడు — చారుదత్తుని సేవకుడు
స్థావరకుడు — శకారుని సేవకుడు

వీరకుడు, చందనకుడు } రాజభటులు

మాధురుడు, సభికుడు, దర్దురకుడు } జూదరులు

అధికరణికుడు — న్యాయాధికారి
శ్రేష్ఠి — షరాబు
కాయస్థుడు — కరణం
శోధనకుడు — న్యాయస్థానమందలి భటుడు.

( విటుడు, చేటుడు, తలారులు మొదలగువారు

## స్త్రీ పాత్రలు

వసంతసేన — వేశ్య, కథానాయిక
ధూతాంబ — చారుదత్తుని భార్య
రదనిక — చారుదత్తుని సేవకురాలు
మదనిక — వసంతసేన పరిచారిక
వేశ్యమాత — వసంతసేన తల్లి

( చేటికలు మొదలగువారు )

# మృ చ్ఛ క టి క ము

## ప్ర థ మాం క ము

(నాంది)

సీ. వీరాసనమున సంపీతమైన భుజంగ
హారమ్ము జానువులందుఁ బెనఁగ,
అంత ర్నిరుద్ధమై ప్రాణానిలములు జ్ఞా
నేంద్రియ వ్యాపారమే యడంప
తనలోన దనుగాంచు తత్త్వదృష్టికిని స్వీ
యావయవముల కార్యముల నుడుగు,
భవుశూన్య దృగ్లయ బ్రహ్మలగ్న సమాధి
బ్రోచుగావుత మిమ్ము పూజ్యులార

గీ. గౌరి భుజలత యెద్దాస గాంతులీని
మెఱపుఁదీఁగల సౌరును మేలమాడ
నీలమేఘంపు డాలును డీలుపఱచు
నీలకంఠు గళమ్ము మిమ్మేలుగాత.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును.)

సూ: సభాసదుల కుతూహలమునకు భంగము కలిగించు నీయాలస్యమేల? ఆర్యమిశ్రులకు నమస్కరించి నేనిట్లు విన్నవించుకొనుచున్నాను. సుప్రసిద్ధుఁడగు శూద్రక మహారాజు రచించిన మృచ్ఛకటిక మను ప్రకరణమును మేమిప్పుడు ప్రదర్శింపబోవుచున్నాము.

అతఁడు భద్రగజగమనుఁడు, చకోరనేత్రుఁడు, పూర్ణచంద్రాననుఁడు, స్ఫురద్రూపి, ద్విజముఖ్యుఁడు, అగాధ సత్వసంపన్నుఁడు పేరెన్నికఁగన్న కవి.

ఆ రాజేంద్రుఁడు వేదవేదాంగాది విద్యల నేర్చి గణితము నభ్యసించి వైదికవిద్య నలవఱుచుకొని గజశిక్షనెఱిగి యీశ్వరానుగ్రహమున జ్ఞానదృష్టి సంపాదించెను. అతఁడు గొప్ప తపోధనుఁడు. యుద్ధమందు ప్రీతిగలవాఁడు, అప్రమత్తుఁడు, గజయుద్ధమున నారితేరినవాఁడు. ఆమహారాజు తన సుపుత్రుని సింహాసనమందుంచి తా ననేకయశ్వమేధయాగములను చేసి, నూరు సంవత్సరముల పది దినములు జీవించి పిమ్మట అగ్నియందు ప్రవేశించి కాలధర్మము నొందెను.

ఉజ్జయినీనగరమున యువకుఁడును, దరిద్రుఁడును అగు చారుదత్తుఁడను బ్రాహ్మణ వర్తకుఁడు గలఁడు. ఆతనికి వసంతశోభవలె విరాజిల్లు వసంతసేన యను వేశ్య గుణానురక్తయై యుండెను. వీరి శృంగార సన్నివేశములును, నీతి, దుర్జనలక్షణము, దుష్టపరిపాలనము, ఇందలి విషయములు. (నడచి చూచి) ఏమీ, ఓయీ, నా సంగీతశాల శూన్యముగా నున్నదేమి? గాయకులు, నటకులు వెడలిపోయినారా? ఆ! తెలిసినది.

పుత్రులు లేనివాని గృహము శూన్యము. సన్మిత్రులు లేనివాని యిల్లు మిక్కిలి శూన్యము. మూర్ఖుని కెల్లయెడల శూన్యము, దరిద్రునకు సమస్తమును శూన్యము.

నేను సంగీతమును చిరకాలమునుండియు పోషించుటచే గ్రీష్మసమయమున సూర్యుని వేడికిరణముల కెండిపోయిన తామరసింజలవలె ఆకలి బాధచే నా కనుగ్రుడ్లు తిరుగుచున్నవి, నాకండ్లు పచ్చనగుచున్నవి. ఇంటికి వెళ్ళి తినుట కేమైన నున్నదేమో నాభార్య నడిగెదను.

హా! కష్టము, కష్టము. చాలాకాలమునుండి సంగీతము నభ్యసించుచుండుటచే నాయవయవములు ఎండిన తామరతూండ్లవలె వాడిపోయినవి. లోనికి పోయి నా యిల్లాలు చేసిన పదార్థము తినుటకేమైన నున్నదేమో యడిగెదను. ఇదిగో నా గృహము ప్రవేశింతును. (ప్రవేశించు చున్నాడు) ఆశ్చర్యము. ఇదేమి? నా యిల్లు మరియొక యిల్లువలె కాన్పించుచున్నది? దారిలో బియ్యపు కడుగు ప్రవహించుచున్నది. లోహపు మండిగ లీడ్చిన గుర్తులు పడిన భూమి తిలకము ధరించిన యువతిని బోలియున్నది. శాకపాకముల పరిమళమునకు నా నోరూరుచున్నది. నా కాకలిబాధ మిక్కుటముగా నున్నది. పూర్వార్జితమైన ధన మేదైన దొరికినదా యేమి? క్షుధాతురుడనైన నాకీ సకల జీవలోకమును అన్నమయముగ దోచుచున్నది. నాకు తినుటకు చద్దియన్నమైనను మా యింట లేదుకదా! ఆకలి నన్ను మలమలమాడ్చుచున్నది. (నల్దిక్కులు చూచి) ఇదియేమి చెపుమా! నేడంతయు క్రొత్తగా నున్నదే! ఒక యువతి సువాసనద్రవ్యములతో రంగురంగుల పిండి విసరుచున్నది. మఱియొక కాంత పూలదండలు గ్రుచ్చుచున్నది. అయినను నా భార్య నడిగి తెలిసికొందును. (తెరవంక చూచి)

సూ: దేవీ, యెక్కడ నున్నావు?

నటి: ఇక్కడనే యున్నాను.

సూ: దేవీ, నీకు స్వాగతము.

నటి: ఆర్యా, నే జేయవలసిన పని యేమి?

సూ: పూజ్యురాలా మన యింటిలో తినుట కేమేమి పదార్థములు కలవు?

నటి: ఆర్యా! సర్వమును కలవు.

సూ: ఏమేమి పదార్థములు కలవు?

నటి: పరమాన్నము, పెరుగు, నెయ్యి, బియ్యము మొదలగునవి మీరు భుజించుట కర్హమగు వస్తువులు. రసాయనములు కలుగవలయునని మిమ్ము దేవత లాశీర్వదింతురుగాక.

సూ: ఏమీ యింట నన్నియు గలవని నీవు నన్ను పరిహాసము చేయుచున్నావా?

నటి: నేను పరిహాసము చేయలేదు. అవి యన్నియు నంగడియందున్నవి.

సూ: ఓసీ; దుశ్శీలా! నీ యాశలన్నియు నిట్లే వ్యర్థములగునులే. ఏకార్యములును సిద్ధింపవు. ఇప్పుడు నేను నీచేత వడెసెలలో ఱాయివలె దూరముగా విసరివేయబడితిని.

నటి: ఆర్యా; శాంతింపుము. శాంతింపుము. ఇది పరిహాసము కదా?

సూ: నేడు మన యింట నంతయు క్రొత్తగా నున్నదేమి? ఈసన్నాహ మంతయు నేమి? ఒకతె సువాసనద్రవ్యములు సిద్ధము చేయుచున్నది. మఱియొకతె పూలదండలను గ్రుచ్చుచున్నది. పంచవర్ణముల పూవులచే భూమి యలంకరింపబడినది.

నటి: నే డుపవాసము చేయదలచితిని. నే నొక నోము పట్టితిని.

సూ: ఆనోము పేరేమి?

నటి: అభిరూపవతి.

సూ: ఎందునిమిత్త మీ యుపవాసము?

నటి: తగిన పతికొఱకు.

సూ: ఈజన్మమునకా లేక మఱియొక జన్మమునకా?

నటి: ఆర్యా! మఱియొక జన్మమునకే.

సూ: ఆర్యులారా; చూడండి, యీన్యాయము. నేను సంపాదించిన సొమ్ముతో మఱియొక జన్మమున కాఁగల వరు నన్వేషించు చున్నది.

నటి: ఆర్యా; అనుగ్రహింపుము. నాకు రాబోవు జన్మమందును నీవే పతివి కాఁగలవు.

సూ: అయితే యీ యుపవాస వ్రతము నీ కుపదేశించిన వారెవరు?

నటి: మీ ప్రియమిత్రుడు చూర్ణవృద్ధుడు.

సూ: ఓరీ, నీచుడా; చూర్ణవృద్ధా; ఎప్పుడైన పాలకరాజు నీమీద కోపగించి నిన్ను వధించుట నేను కండ్లార చూడకపోదునా?

నటి: ఆర్యా, అనుగ్రహింపుము. నీ సుఖముకే యీ యుపవాసము.

సూ: దేవీ! ఆలస్య మెందుకులెమ్ము; యీనోమునం దెవ్వ రెట్లు చేయవలసియున్నది?

నటి: ఆర్యా, మనము యోగ్యుఁడైన బ్రాహ్మణుని బిలిచి పూజింపవలయును.

సూ: నీవు లోపలికి వెళ్ళి నీపని జూచుకొనుము. నే నూరిలోనికి పోయి తగిన బ్రాహ్మణుని బిలుచుకొని వచ్చెదను.

నటి: చిత్త మట్లే చేసెదను. (నిష్క్రమించును.)

సూ: ఏమి యీ ఆశ్చర్యము?

సుసమృద్ధమైన యీ యుజ్జయినీ నగరమున మాకుఁదగిన బ్రాహ్మణుని వెదకుకొనవలెను. చారుదత్తుని మిత్రుడు మైత్రేయుఁ

డిటే వచ్చుచున్నాఁడు. ఆతనిని బిలిచెదను. (ప్రకాశముగా) మైత్రేయా, నేఁడు మాయింటికి బ్రాహ్మణార్థమునకు వత్తువా?

(తెరలో)

మైత్రేయుడు: అయ్యా; నేడు నాకు కొన్ని తొందరపను లున్నవి. నాకు దీరిక లేదు. కావున నీవు వేరొక బ్రాహ్మణుని బిలుచు కొనుము.

సూ: అయ్యా! పిండివంటలతోడను, మంచి శాకముల తోడను, మంచి భోజనము. అందును నీవొక్కఁడవే. రెండవ బ్రాహ్మణుఁడు లేఁడు. మంచి దక్షిణ కూడ లభించును.

(మరల తెరలో)

మైత్రేయుఁడు: నేను మొదటనే రానంటిని, నన్నిప్పుడే పిలిచితివిగదా; మాటిమాటికిని బలవంత మెందుకు? నన్ను బలవంత పెట్టకుము.

సూ: నిన్ను మొదట పిలిచితిని, కానిమ్ము మరియొక బ్రాహ్మణుని పిలిచెదను.

(ఆముఖము)

(మైత్రేయుఁడు చేతితో నుత్తరీయము పట్టుకొని ప్రవేశించును.)

మైత్రేయుడు: అయ్యా; వేరొకబ్రాహ్మణుని బిలుచుకొనుఁడు. నాకు నేడు తొందర పను లున్నవి. నాకు తీరిక లేదు.

ఆహా; నాయవస్థ! పూజ్యుఁడగు చారుదత్తుని ప్రియ మిత్రుఁడనగు నాకు బ్రాహ్మణార్థములకు బిలిపించుకొనునట్టి దురవస్థ

చారు: ఓయీ; రేయింబవళ్ళు డబాయని మిత్రుఁడవు మైత్రేయుఁడవా; కూర్చుండుము. నీకు స్వాగతము.

విదూ: అయ్యా; నీ ప్రియమిత్రుఁడు చూర్ణవృద్ధుఁడు జాజిపూవుల తావులు వెదజల్లు నీయుత్తరీయమును మీకు బంపినాఁడు. దేవకార్యము దీర్చిన పిమ్మట మీ కందజేయమని చెప్పినాడు. (అయుత్తరీయము నిచ్చుచున్నాఁడు.)

చారు: (పుచ్చుకొని యేదియో ఆలోచించుచున్నాఁడు)

విదూ: ఆర్యా, ఏమి యాలోచించుచుంటిరి.

చారు: మిత్రమా; దుఃఖము తరువాత వచ్చు సుఖము, సౌఖ్యదాయకము. గాఢాంధకారమున దీపపు వెలుతురట్లది సుఖమునిచ్చును. ఏమనుజుఁడు ముందు సుఖము పిదప దుఃఖము ననుభవించునో యాతఁడు జీవచ్ఛవమువలె ప్రాణముమాత్రము మేన ధరించియుండును.

విదూ: ఆర్యా; దారిద్ర్యము మంచిదా? మరణము మంచిదా?

చారు: లేమికంటె మరణమే యుత్తమ మని నాయభిప్రాయము, మరణము కొలది కాలము మాత్రమే మానవుని బాధించును. కాని దారిద్ర్యము యావజ్జీవమును పీడించును.

విదూ: ఆర్యా; మీరట్లు చింతింప దగదు. తమ ధనమును బంధుమిత్రులకై వినియోగించి విభవమును గోల్పోయిన మీరు అమృతమును దేవతలకొసగిన శుక్లపక్ష పాడ్యమినాటి చంద్రకళ చందమున ద్రవ్యవిహీనులయ్యు కడు రమణీయముగ నున్నారు.

చారు: పోయినధనమునకై నేను విచారించుట లేదు. ధనహీనుడ నైనందుకుకూడ చింతింపనుకాని యెండిన మదరేఖలుగల

నేనుగు చెక్కిళ్ళను తుమ్మెదలు విడిచినట్లే అతిథులు ధనవిహీనమైన నా యిల్లు త్రొక్కుట మానివేసిరి. ఇది యొక్కటి మాత్రమే న్ను మిక్కిలి బాధించుచున్నది.

విదూ: చలిముద్ద కాళించు నానిర్భాగ్యులగు నతిథులు, చిఱుత గులకు తోడేళ్ళకు జడిసి, గొల్ల పిల్లవాండ్రు తమ మందలను వేరొ నుడవి మార్గమున గొంపోవునట్లు ధనవిహీనుల యిండ్లవంక నైన నాడక దూరముగ తొలగిపోవుదురు.

చారు: మిత్రమా! యథార్థముగా నాకు ధనము పోయినద నను విచార మావంతయు లేదు. అది దైవాయత్తము. సంపద దృష్ట వశమున వచ్చుచు, బోవుచునుండును. కాని నామంద భాగ్య ముచే నాప్రాణమిత్రులు సైతము నన్ను విడిచిపోయిరి. అదియే నాకు విచారకారణము.

మఱియు, దారిద్ర్యము వలన సిగ్గుపోవును. లజ్జా విహీనుడు తన తేజస్సును గోల్పోవును. తేజోవిహీనుని జనులు పరిభవింతురు. పరిభవమువలన మానము నశించును. నిర్వేదమునొందిన మానవుడు దుఃఖించును. శోకముచే బుద్ధి నశించిపోవును. బుద్ధి నశించినవాడు కృశించిపోవును. కావున దారిద్ర్యము సర్వాపదలకు స్థానము.

విదూ: వయస్యా, నీవంటివాడు నీనిని లెక్కచేయరాదు.

చారు: మిత్రమా; మనుజునకు దారిద్ర్యమెట్టిదో వివరించెద వినుము. చింతకు నివాసస్థలము. శత్రుపరాభవమునకు సహకారి. బంధుజనులకు విద్వేషహేతువు, మిత్రులకు హేయకరము, భార్యకు జులకదనము కలిగించునది. కావున నొంటరిగా నే యడవిలో నైన నుండవలయునని దోచును. నాహృదయమందున్న శోకాగ్ని నన్ను

కాల్చివేయక, బాధించుచున్నది. కావుననో మిత్రమా ; నేను గృహ దేవతలకు బలిపూజలు గావించితిని. నీవును, యింటిముంగిట గృహ దేవతలకు బలులను వేయుము.

విదూ : నేను వెళ్ళను.

చారు : ఎందు నిమిత్తము ?

విదూ : నీవిట్లు యథావిధిగా పూజించు చున్నను, గృహా దేవతలు నీకుఁ గొంచెమేని మేలు చేయకున్నారు.

చారు : వయస్య ; నీవిట్లనగూడదు గృహస్థాశ్రమమున నున్న వారందఱు బలికర్మల ననుష్టించి తీరవలయును. త్రికరణ శుద్ధిగా చేయు బలికర్మలవలన దేవతలు సంతృప్తి నొందుదురు. తక్కినవిషయములు మనము చింతింపరాదు. కావున నీవు వెళ్ళి అమ్మవార్లకు బలిపెట్టుము.

విదూ : నేను వెళ్ళను. ఆపనికి నీవు మఱెవరినైనను నియోగింపుము. అద్దములోని నీడవలె యెడమకుడిగను, కుడియెడమగను నా యదృష్టము వ్యత్యస్తమైనది. మఱియు నీసంధ్యాకాలమున రాజమార్గమున గణికలు విటులు, చేటులు, రాజవల్లభులు తిరుగుచుందురు. కప్పలవెదకు పామునక్కు యెలుక యెదురైనట్లు నేను వారియెదుట పడుదును. వారు నన్ను బాధింతురు. ఇక్కడ నీవు కూరుచుండి చేయునదేమి ?

చారు : సరే నీవిక్కడనే యుండుము. నేను బలికర్మలను జరపి వచ్చెదను.

(తెరలో) నిలు వసంతసేనా నిలు.

(అప్పుడు విట, చేట, శకారాదులచే ననుసరింపఁబడిన
వసంతసేన ప్రవేశించును.)

విటుడు: వసంతసేనా ఉండు ముందుము.

బోయవానిచే దరుమబడిన యాడులేడివలె నీవు నాట్యప్రయోగ కౌశలములైన నీ యడుగుల నవ్యసముగా చేయుచు భయముచే కలత నొందుచు విలాసముగా బరుగెత్తుచున్నావా ?

శకా: వసంతసేనా; నిలు, నిలు, అయ్యో వెళ్ళిపోవుచున్నావా? పరుగెత్తుచున్నావా? తప్పించుకొని పోవుచున్నావా? నిప్పులో పడిన మాంసపు ముక్కవలె నా హృదయమును కాముఁడు దహించుచున్నాఁడు.

చేటుడు: ఓసీ, ఉండుము. నిండు రెక్కలు గలిగిన గ్రీష్మమయూరివలె భయముతో నా సమీపమునుండి బరుగెత్తుచున్నావు. మా ప్రభువైన యీ శకారుఁడు అడవిని బడిన కోడిపిల్లవలె నిన్ను వెంబడించుచున్నాఁడు.

విటు: వసంతసేనా; వసంతసేనా; ఆగు మాగుము. నీ కాక చీర చెంగు గాలి కెగురుచుండ లేత యరటిచెట్టువలె నట్లు వణుకుచుంటి వేల? సుత్తె దెబ్బలచే సూర్యకాంతపు సౌధము బగులగొట్ట నెగురు నిప్పుకణములవలె యెఱ్ఱకలువ మొగ్గలను చిమ్ముకొనుచు నేగుచున్నావు.

శకా: వసంతసేనా; నిలు, నిలు. నన్ను నీవు మరులుగొలిపి రేల నిద్రకు నన్ను దూరముచేసి ఇప్పుడు నాకు భయపడి పారిపోవుచున్నావా? ఇదిగో నాకు నీవు రావణునకు కుంతివలె చేజిక్కితివి. గరుడునకు జడిసిన నాగాంగనవలె నడుగులు నాకంటె వేగముగా

వేయుచుంటివేమి! నేను వాయువేగము నతిక్రమించి నడువగల సుందరాంగీ, అయినను నీ యనుమతి లేనిది నే నట్లు చేయదలచియుం లేదు. బావా; బావా; ఈబోగపుపిల్ల యెదుటివారి కన్నులలో దుమ్ము గొట్టి ధనము లాగుటలో నెరజాణ. ఇది శివలింగములోనున్న టంకమును దొంగిలించునట్టిది. చేపలను, జెల్లలను బాగుగా భక్షిం గలదు. ఇది వంగియున్న ముక్కులేనిది, కులమును మలినము చేసినది కాముని చేతిపెట్టె. బోగపు వీధిలో నుండునది. వెలయాలు, వా కాంత. నే నిన్ని పేర్లతో ముద్దుగా బిలుచుచున్నను, దీనికి నాపై రవ్వంతయైన యనురాగము లేకున్నది.

విటు: కర్ణభూషణములు చలించుచు, చెక్కిళ్ళ కొక వింత కాంతి గలిగింప భయవిహ్వలితయై విటజనులచే గదల్పబడిన వీణవలెను మేఘధ్వని వినిన బెగ్గురుపక్షివలెను, యేల నీవిలీల పరుగెత్తుచున్నావు

శకా: ఆభరణములు మృదుమధురధ్వనులు చేయ రాముని వలన భయముచే బరుగెత్తు ద్రౌపదివలె నేల పలాయన మగుచుంటివి హనుమంతుడు విశ్వావసుని చెల్లెలు సుభద్ర నెత్తుకొనిపోయినట్లు నేన నిన్ను తప్పక నపహరించెదను చూడుము.

చేటు: ఓసీ; రాజవల్లభుని చేరుము. దాన నీ యిచ్చకు వచ్చిన మాంసభోజనము లభించును. ఇట్టి మాంసమున కాశపడియే కదా కుక్కలు శవములను బీకుకొని తినుచుండును.

~~విటు: ఓసీ;~~ వసంతసేనా; నక్షత్రకాంతిని పోలుచున్న యొడ్డాణము నెత్తి పట్టుకొనుచు నోట రక్తధాతువులు గ్రమ్మిన వన దేవతవలె నేల పరుగిడుచున్నావు?

శకా: ఓసీ; వసంతసేనా; మాచే తఱుమబడుచు నీవు వేట కుక్కలచే దఱుమబడిన యాడునక్కవలె పరుగెత్తుచు నా హృదయ

కుసుమమును తొడిమతోసయితముగ పెకల్చి యపహరించుకొని పోవు చున్నావు.

వసంత : పల్లవకా, పల్లవకా, పరభృతికా ; పరభృతికా ;

శకా : ( భయముతో ) బావా ; బావా ; మనుష్యులు వచ్చుచున్నారు. మనుష్యులు వచ్చుచున్నారు.

విటు : భయము లేదు, భయము లేదు.

వసంత : మాధవికా, మాధవికా.

విటు : ( నవ్వి ) మూర్ఖుడా ; దాని పరిజనులను బిలుచుచున్నది.

శకా : బావా ! బావా ! ఆడువారినా పిలుచుచున్నది ?

విటు : మరేమి ?

శకా : నేను గొప్ప శూరుడను, నూరుమంది స్త్రీల నొక్కమారుగా చంపెదను.

వసంత : ( తన పరిజన మెవ్వరును తోడుపడమి చూచి ) అయ్యో, అయ్యో, నాపరిజన మెవ్వరును కానబడకుండి రేమి చెప్పుమా ; ఇపుడు నేనేమి చేయుదును. నన్ను నేనే రక్షించుకోవలసిన సమయము వచ్చినది.

విటు : వెదకుము, వెదకుము.

శకా : విలపింపుము, విలపింపుము. పరభృతికను పిలువుము. పల్లవకుని బిలుచుకొనుము. వసంతఋతు చిహ్నముల నన్నింటిని బిల్చి యేడువుము. నీ వెంత యేడ్చినను నావంటివాడు వెన్నాడినప్పుడు నిన్నెవ్వరు కాపాడజాలరు. భీమసేనుడుగాని, పరశురాముడుగాని, ధనంజయుడుగాని, రావణుడుగాని, నన్నెవ్వ రేమియు చేయజాలరు. దుశ్శాసనునివలె కొప్పు పట్టి యీడ్చెదను. నా చేతిలోని కత్తి మిగుల

వాడిగా నున్నది. నీ తల మంచి యొదుపుగ నున్నది. తల పగు గొట్టుదునా? కత్తిరింతునా? పారిపోకుము. నిలువుము, నిలువుము నాభారి తలగితివేని చచ్చినట్లే యెంచుము.

వసంత: అయ్యా, నేను అబలనుగదా?

విటు: అందుచేతనే నిన్నొకరు భరింపవలెను.

శకా: కాబట్టియే నిన్నుఁ జంప నాకు చేతులు రాకున్నవి

వసంత: (తనలో) ఏమిది యీతని లాలనము నాకు భయము గలిగించుచున్నది. (శకారునితో) అయ్యా, నావల్ల, నీకేమి యుపకారము కావలెను?

విటు: ఊరకుండుము. ఓసీ; వసంతసేనా; ఉద్యానవనమందలి తీగెవలన పుష్పములు గాక మరేమి కోరును. అలంకారముతో బనియేమి?

వసంత: అయితే యిప్పుడు నావలన మీరు కోరునది యేమి!

శకా: నేను దేవపురుషుడను, మనుష్యుడను, వాసుదేవుడను, నన్ను నీవు వరింపుము. శాంతింపుము, శాంతింపుము.

వసంత: (క్రోధముతో) నీ యసంబద్ధ ప్రలాపము లింతటితో గట్టి పెట్టుము, పొమ్ము.

శకా: (చప్పట్లు గొట్టి నవ్వుచు) బావా! బావా! ఇటు చూడుము. ఈబోగపు పిల్లకు మనస్సులో నాపయి ప్రేమ మున్నది సుమా. శాంతింపుమని నన్ను ఓదార్చు చున్నది. ఓసీ; వసంతసేనా; నే నేయూరును, యేపట్టణమును వెళ్ళలేదే. బావ నెత్తిమీద నాకాళ్ళను బెట్టి యొట్టు బెట్టుకొందును; వెనువెంటనే తిరిగి, తిరిగి యలసి పోయితిని, వాడిపోయితిని.

విటు : (తనలో) ఆహా ! ఈవసంతసేనను శాంతింపు మనగా యీమూర్ఖుడు శాంతి పొందితినన్నదని యపార్థము చేసికొన్నాడు. (వసంతసేనతో) వారకాంతలకు విరుద్ధమైన మాట జెప్పెదవేల ? చూడుము. తరుణ వయస్కుల సత్కరించుటయే మీకుల వృత్తి. చక్కగా నాలోచించుకొమ్ము. నీవు వెలయాలవుగావా ? వేశ్య, మార్గమందలి తీగె వంటిది. నీశరీరము ధనవంతుల సొమ్ము. నిన్ను కోరిన వారినందఱను కాదనక అంగీకరింప వలయును. ప్రియునైనను, అప్రియునైనను సమాన ప్రతిపత్తితో చూడవలయును. చదువుకొన్న సద్బ్రాహ్మణుడును, కడజాతి మాలవాడును నొకే బావియందు స్నానము చేయుటలేదా ? అన్నిజాతులవారును సమానముగా నావలపై నదులదాటుటలేదా ; చెట్టుకొమ్మలపై నెక్కి కాకియు నెమలియుగూడ వంచుచుండుట లేదా ? అట్లే నీవును నావవలె, తరుశాఖవలె యిందఱ ప్రాపకమును బొంది జీవింపవలయును.

వసంత : సుగుణముల వలన రాగము పుట్టునుకాని బలాత్కారమువలన నెన్నటికిని జనింపదు.

శకా : బావా ; బావా ; ఈగర్భదాసి నాడు కామదేవాలయమున జూచినప్పటినుండియు దరిద్రుఁడైన చారుదత్తుని కామించి యున్నది. నాయందు కొంచెమైనను దీని కనురాగము లేదు. ఆతని యిల్లీ యెడమవైపున నున్నది. ఇది పారిపోగలదు సుమా. మన మిరువురము గలసి పట్టుకొందమురా.

విటు : (తనలో) ఆహా ; వీడు పరమ మూర్ఖుఁడుగదా ! దీనికి తెలియగూడని దానినే జ్ఞప్తికి దెచ్చినాఁడు ఏమీ ! యీ వసంతసేన చారుదత్తుని మోహించినదా ! మేలు. రత్నము రత్నముతో గూడుకొనదా ; పోనిమ్ము, ఇప్పు డీ తెలివిమాలినవాఁ డేమి చేయునో

చూతము. (ప్రకాశముగా) ఓరీ, తులువా ; ఆబ్రాహ్మణ వర్తకుని యిల్లీ యెడమవైపు దేనా?

శకా : అవు నీ యెడమ వైపుదే.

వసంత : (తనలో) అహో ; యేమీ ఆశ్చర్యము. నా కపకారము చేయగోరిన దుర్మార్గుడైనను చారుదత్తుని యిల్లీ యెడమవైపున నున్నదని సత్యముచెప్పి, నా కుపకారము గావించినాడు. ఇప్పుడు నా ప్రియుని గలసి కొనగలను.

శకా : బావా ; బావా ! చీకటి మిక్కిలి దట్టముగా నున్నది. మినుముల రాసిలో కాటుక గుళికవలె వసంతసేన యీ గాఢాంధకారమున నదృశ్యమయ్యెను. తప్పించుకొని పారిపోయెనేమో !

విటు : నాదృష్టి యెంతయు విశాలమైన దైనను యీ చీకటిలో ప్రవేశించినంతనే నాకన్నులు తెరచినను, మూసిన విధముగనే యున్నవి. ఈచీకటి యవయవములకు బూతపూసినట్లున్నది. ఆకాశము కాటుకను వర్షించు చున్నట్లున్నది. దుర్జనునకు చేసిన సేవవలె నాదృష్టి నిష్ఫల మగుచున్నది.

శకా : బావా ; బావా ; వసంతసేనను వెదకెదను.

విటు : ఓరీ ! కొంచెము జాడ కనబడుచున్నట్లున్నది.

శకా : బావా ; బావా ? అది యెట్టిది ?

విటు : నగల చప్పుడువలననైన సుగంధముల పరిమళముల వలననైన దెలిసికొనుము. అంధకారమువలన ముక్కులు దిబ్బళ్ళు వేసినను పూలతావులు వినవచ్చు చున్నవి. భూషణధ్వనులు మాత్రము కనబడుటలేదు. వసంతసేనా రెండుమేఘముల మధ్య లీనమైన మెఱుపు తీగెవలె యీకటిక చీకటిలో నీవు కనబడకున్నను నీ నెమ్మేని తావులు

నీకాలి యందెల మువ్వల ధ్వనులు నీజాడ నెఱింగించు చున్నవి. వసంతసేనా వింటివా?

వసంత: (తనలో) విన్నాను. మీమాటల యందలి భావము గ్రహించితిని (అని కాలి యందెలు తీసి, మెడలోని పూలదండలుతీసి పాఱవైచి కొన్ని యడుగులు నడచిచూచి) ఆహా! ఇదియేమి? ఇక్కడ గోడ తడుముటచే రెక్కల తలుపులు కనబడినవి. కాని మూయుబడి యున్నవి. తాకిచూడగా ఏదో యింటి తలుపు కావచ్చును.

(చారుదత్తుఁడు ప్రవేశము)

చారు: మిత్రమా; జపము పూర్తియైనది. నీవిక పితృదేవతలకు బలులు వేసిరమ్ము

విదూ: అబ్బా! నేను వెళ్ళలేనయ్యా!

చారు: ఆహా నాకెట్టిదశ ప్రాప్తించినది. పేదఱికము సంభవించిన మనుజుని మాటలు బంధుజనము సైతము చెవిని బెట్టరు. ప్రాణమిత్రులు సైతము పెడమొగము పెట్టుదురు. ఆపదలు మెండుగా నుండును. క్రమక్రమముగా నాతని మేనిసత్వముకూడ క్షీణించును. శీలము మరిగిపోవును. తేజస్సు మాసిపోవును. ఇతరు లొనరించు నేరముసైతమాతని నెత్తిపైఁబడును. సంఘీయు లట్టి మనుజునియొద్ద కెవరును జేరరు. ఆపదలలో బల్కరింపరు. ఉత్సవసమయమున ధనికుల యిండ్లకుఁబోవ చులకనగా జూతురు. పదిమందిలోనికి బోవ వస్త్రహీనతచే లజ్జించును. కావున లేవడియనగా నాఱవమహాపాతకమని చెప్పవచ్చును. ఓదారిద్ర్యమా నాశరీరము నాశ్రయించుకొని, ప్రాణమిత్రుని వలె నుండిన నీవు నాయనంతర మెవ్వరి నాశ్రయింతువని చింతించు చున్నాను.

విదూ: చెలికాడా; అట్లే పోయెదను. రదనికను తోడ పంపుము.

చారు: రదనికా; మైత్రేయుని వెంటబొమ్ము.

రదనిక: అయ్యా; చిత్తము.

విదూ: రదనికా; బలిని, దీపమును గొని రమ్ము. రెక్కలతలుపులను తెఱచెదను.

వసంత: నాకొఱకే ద్వారము తెరువబడినట్లున్నది. కాని నిందు ప్రవేశించెదను.

(అని చీరచెంగుతో దీపమార్పి లోన ప్రవేశించును.)

చారుదత్తుడు: మైత్రేయా ఇది యేమి?

విదూషకుడు: అయ్యా, ద్వారము తెరవగానే దీప మ పోయినది. రదనికా నీవు పొమ్ము. నేను లోపలి మండువాలో బోయి దీపము వెలిగించుకొని వచ్చెదను. (అని నిష్క్రమించును.

శకా: బావా, బావా, వసంతసేనను వెదకెదను.

విటు: వెదకుము, వెదకుము.

శకా: (అట్లుచేసి) బావా! దొరకినది, పట్టువడినది, దొరకిన

విటు: ఓయీ; మూర్ఖుడా; నేను, నేను.

శకా: బావా; నీవీవైపున ఇక్కడనే నిలువుము. (వె చేటుని చేయి బట్టుకొని) బావా; బావా; దొరకినది, దొరకినది.

చేటుడు: స్వామీ; నేను చేటుడనండీ!

శకా: ఇక్కడ బావ, అక్కడ చేటుడు. బావే చేటుడ చేటుడే బావ. మీరిద్దరొకప్రక్కగా నిలువుడు. ఇదిగో యిప్పు నిజముగా వసంతసేన దొరకినది. నే పట్టుకొంటిని. ఈ కటిక చీకటిలో

న్నూ కనబడకపోయినను దీని మెడలోని పూలదండల పరిమళముచే
నిపెట్టి చాణక్యుడు ద్రౌపదినివలె జుట్టు దొరకపుచ్చుకొన్నాను.

విటు: వసంతసేనా; నీవు పడుచుదనపు గరువముచేతను, చారు
త్తునిమీది వలపుచేతను, కడు గర్వించియున్నావు. ఇప్పుడు నీ జుట్టు
చేత జిక్కినది. నీ వింకెందు బోగలవు.

శకా: ఓసీ; వసంతసేనా; ఇదిగో నేను నీజుట్టు పట్టుకొని
లాగుచున్నాను. గొంతెత్తి యేడ్వుము. శంభునో, శివశంకరేశ్వరు
నో వేడుకొమ్ము.

రదనిక: స్వామీ: ఏమిటీపని?

విటు: ఓయీ; మూర్ఖా, ఇది మఱియొక కంఠధ్వనివలె
న్నది.

శకారుడు: బావా; బావా; చిక్కని మజ్జిగ త్రాగిన పిల్లి
ాన గొంతువలె యీ దాసి స్వరము మార్చినది.

విటు: ఏమీ స్వరము మార్చినదా; చిత్రము. అవునులే
ందు చిత్ర మేమున్నది. ఇది భోగముది కనుక సభలో గజ్జె కట్టి
కలలో నారి తేరి వంచనా పాండిత్యముచే నైపుణ్యము నాశ్రయించినది.

విదూషకుడు: (ప్రవేశించి) ఆహా? యేమి ఆశ్చర్యము.
ఈ ప్రదోష సమయపు మందమారుతముచే ఈదీపము యూపస్తంభము
కు గొంపోబడు మేకపిల్ల హృదయమువలె తటతట గొట్టుకొను
న్నదే. (వీథిలోని రదనికను జూచి) ఓ రదనికా.

శకా: బావా; బావా; మనుష్యులు, మనుష్యులు.

విదూ: ఇది యయుక్తము, అనుచితము. అక్కటా; ఆర్య
రుదత్తునకు పేదఱికము రాగా పరపురుషు లిట్లు వారి గృహమున
వేశించుచున్నారు.

రదనిక : అయ్యో ; మైత్రేయా ; చూచితివా ; నాపరిభవము!

విదూ : అమ్మో ; ఏమి టీపరాభవము. నీ పరాభవము కాదేగదా ?

రదనిక : అవును. ఇది మీకును పరాభవమే.

విదూ : ఏమీ ! బలాత్కారమా !

రదనిక : మరేమి ?

విదూ : నిజముగానా ?

రదనిక : నిజముగానే.

విదూ : (కోపముతో దుడ్డుకఱ్ఱ చేత బట్టుకొని) ఉండుండుము. భయములేదు. ఎవడురా అక్కడ ? స్వగృహమునందు కుక్కకైనను స్థానబలముచే నెక్కడ లేని బలము వచ్చునుగదా ; అట్టిచో నాయట్టి బ్రాహ్మణుని సంగతి చెప్పనేల ? మా యదృష్టమువలెనే కుటిలమైన యీ దుడ్డుకఱ్ఱతో ఎందువెదురుబద్దవలెనున్న నీతల పగులగొట్టెదను.

విటుడు : ఓయీ ; మహాబ్రాహ్మణా శాంతింపుము, శాంతింపుము.

విదూష : (విటుని జూచి) ఇందు వీని తప్పులేదు. (శకారుని జూచి) వాడే యపరాధి. ఓరోరీ ; రాజుగారి యుంపుడుకత్తె తమ్ముడా; సంస్థానక దుర్మార్గుడా ; పాతకీ, నీకిట్టిదురాగతము చెల్లునా ? దైవవశమున నిప్పుడు చారుదత్తునకు లేమి సంభవించినను నాతని సుగుణములు ఉజ్జయినీనగరమున కలంకారములు కావా ? నీవాయన యిల్లు జూచి యిట్టి దుండగ మెనర్ప నెట్లు సాహసించితివిరా ? పేదబ్రాహ్మణుడుగదాయని యెంచి యీకటికచీకటిలో వచ్చి యీవిప్రోత్తముని పరిభవింపదలచితివా ; యమునియెదుట ఇతడు పేద, యితడు ధనికుడు ననుట లేదు. శీలము లేని ధనికుడె యచట శిక్షార్హుడు.

విటు: (విలక్షణముగా చూచి) ఓయీ; మహాబ్రాహ్మణా; శాంతింపుము, శాంతింపుము. అన్యజనభ్రాంతిచే నిట్లు జరిగినది కాని దర్పముచే చేసినది కాదు. ఒక కాముకురాలిని వెదకుచున్నాము.

విదూష: ఏవ తెను? ఈమెనా?

విటు: పాపము శమించుగాక. ఒకానొక యువతిని మేము వెదకుచుండగా మాబారిఁ దప్పించుకొని యెటకో బోయినది. అందుచే పొరబాటున యీమెనే యామెగా భావించి శీలము వంచించుకొంటిమి. ఇదిగో మాకుగల సర్వస్వము యీఖడ్గమే. దీనిని గైకొనుము. (అని కత్తి క్రిందబెట్టి చేతులు మోడ్చి కాళ్ళమీఁద బడుచున్నాడు.)

విదూ: ఓయీ; సజ్జనుడా; లెమ్ము, లెమ్ము. నే నెఱుఁగక నిన్ను దూరితిని. నన్ను నీ విప్పుడు మన్నింపవలయును.

విటు: అయ్యో నీవు గాదు. నేనే బ్రతిమాలుకొనవలయును. నే నిదే మీయాజ్ఞప్రకారము చేయుచున్నాము.

విదూ: అదెట్లు చెప్పుమా?

విటు: ఈవృత్తాంత మావంతయేని ఆర్యుడగు చారుదత్తున కెఱింగింపవలదని బ్రతిమాలుకొనుచున్నాను.

విదూ: నేను చెప్పనులే.

విటు: నీ సౌజన్య మట్టిదే; నేను నీ ప్రణయమును శిరసా వహించెదను. గొప్ప శస్త్రములను కలిగిన మమ్ము నీ గుణశస్త్రములచే జయించితివి.

శకా: (అసూయతో) బావా; నీవేల యీ దుష్ట వటువున కంజలి యొనర్చి వీని కాళ్ళమీఁద పడుచున్నావు.

విటు: నేను భయపడుచుంటిని.

శకా : నీ వెవరకు భయపడుచుంటివి ?

విటు : ఆ చారుదత్తుని సుగుణములకు.

శకా : చారుదత్తునకు సుగుణము లెక్కడ ? వాని యింట తినుట కన్నమైనను లేదుకద ?

విటు : అట్లు కాదు, వినుము. మాబోటి మిత్రుల బలువుర బోషించి పేదవడి యున్నవాఁడు. అతని సిరి యెన్నటికిని విడువదు. తటాకము వేసవి ననేకుల దప్పిని మాన్చి తాను క్రృశించునుగదా ?

శకా : ఈ గర్భదరిద్రు డెవరోయీ ! మహా శూరుడైన యర్జునుడా ! శ్వేత కేతువా ! రాధపుత్రుడైన కర్ణుడా ! ఇంద్రదత్తుడా ! కుంతికి రావణునివలన బుట్టిన యశ్వత్థామా ! ధర్మపుత్రుడా ! జటాయువా ?

విటు : ఓరీ మూర్ఖుడా ! విను చారుదత్తు డనగా, సుగుణము లను పండ్లబరువుచే వంగిన దీనకల్పద్రుమము. సజ్జనకుటుంబకుడు. శిక్షితుల కాదర్శ మనదగినవాడు. సత్ప్రవర్తనమునకు గీటురాయి. శీలమునకుఁ జెలియలికట్ట. సత్కర్మనిష్ఠుడు, పరుల నిందింపనివాడు. పురుషగుణనిధి సమర్థుడు, ఉదార సత్వుడు, అతడు పేదవడియు, జనసుతుడై యనన్య సదృశముగ జీవించు చున్నఁవాడు. ఇతర మనుజులెల్ల నామమాత్రమునకె జీవించుచున్నారు. అయితే మన మిటుపోవుదము పద.

శకా : వసంతసేనను పట్టుకొనకయేనా ?

విటు : వసంతసేన యెక్కడికో పారిపోయినది.

శకా : ఎట్లు పోయినది ?

విటు: అంధునకు దృష్టివలెను, రోగాతురునకుఁ బుష్టివలెను, అలసునకుఁ గార్యసిద్ధివలెను, స్వల్పబుద్ధికి జరవిద్యవలెను, ఆమె రతివలె నీకు చేజిక్కియు నీశత్రువుల పాలైనది.

శకా: వసంతసేనను బట్టుకొనకుండ నేను వెళ్ళను.

విటు: లోకములో యేనుగులను గుదియలకుఁ గట్టి ముకు త్రాటితో బిగించి బంధింతురు. ఇక నారీజనమును హృదయములచే బంధింతురు. నీవది యెఱుగవే.

శకా: నీవు వెళ్ళిన వెళ్ళుము, నేను రాను.

విటు: నేనటు పోయెదను. (నిష్క్రమించును)

శకా: బావ వెళ్ళిపోయినాడు. (విదూషకునితో) ఓయీ కాకియడుగులవలె పోచలజుట్టుగల దుష్ట బ్రహ్మచారీ! వంగుము, వంగుము.

విదూ: మేము వంగియే యున్నాముగదా?

శకా: ఎవరి వలన?

విదూ: మా దురదృష్టము వలన.

శకా: లే లెమ్ము!

విదూ: లేచెదనులే.

శకా: ఎప్పుడు?

విదూ: దైవ మనుకూలించినప్పుడు.

శకా: ఓరీ, యేడువుమురా?

విదూ: ఏడ్చుచునే యున్నాము.

శకా: దేనిచేత?

విదూ: దారిద్ర్యముచేత.

శకా: ఓరీ, నవ్వుమురా?

విదూ: నవ్వెదములే.

శకా: ఎప్పుడు?

విదూ: చారుదత్తునకు మంచిదినములు వచ్చినప్పుడు.

శకా: ఓయీ; దుష్టబ్రహ్మచారీ; దరిద్ర చారుదత్తునితో నామాటలుగ నిట్లుచెప్పుము. క్రొత్తనాటకము చూపవచ్చిన నటివలె సువర్ణ హిరణ్యములుగల వసంతసేనయను పేరుగల పణ్యాంగన కామదేవాలయోద్యానమునాడు మొదలు నీయందు వలపు నిలిపి యున్నది. ఇపు డామె మాచే బలాత్కరింపఁబడి నీయింట దూరినది. కావున నీవు స్వయముగా నామెను తోడ్తెచ్చి మాకు సమర్పింపఁ గొంటివా సరి. వ్యవహారము ముదరకుండగనే నీవట్లుచేసినచో మాకు నీయందు ప్రీతి కలుగగలదు. అట్లుగాక, నామెను నీవేదక్కించుకో దలచితివేని, నీకును, మాకును యావజ్జీవము వైర ముండితీరును. ఇంకొకటి వినుము. తొడిమెకు పేడతొడిగిన గుమ్మడిపండును, ఎండిన మాంసమును, శీతకాలమున చల్దియన్నమును, హేమంతఋతువునందలి వెన్నెలయును, వేళమించిన చెడిపోవును. మాకు మేలగునట్లు చెప్పుము. సంగ్రహముగ చెప్పుము. మాసౌధముయొక్క బాలాగ్ర కపోతపుమీఁది చౌకములోనికి వచ్చి చెప్పుము. విందుము. నీవట్లు చెప్పవేని తలుపులో నిడికొనిన వెలగపండువలె నీశిరస్సును భళ్ళున బద్దలుకొట్టి భక్షించెదను.

విదూ: అట్లే చెప్పుదునులెండి;

శకా: చేటుడా; బావ వెళ్ళినది నిజమేనా?

చేటు: మరేమి;

శకా: అయితే మనము త్వరితముగ బోవుదము నడువుము.

చేటు: అట్లైన మీరీ కత్తిని బుచ్చుకొనుడు.

శకా: అది నీచేతియందే యుండనిమ్ము.

చేటు: ఈఖడ్గ మాయుధరాజము. మీరు రాజవల్లభులు. మీరే దీనిని ధరింపదగినవారు.

శకా: (కత్తిని తలక్రిందుగా బట్టుకొని) త్రిప్పలేకుండ ముల్లంగిగడ్డవలె తెల్లనైన దీనిని పిడివైపున గూటిలో నిద్రపుచ్చెదను. ఆడుకుక్కలు మగకుక్కలు కలిసి భౌ అని యరువ నక్కజారియలలో దూరినట్లు నాదారిని నేను బోవుదును.

(అని యిద్దరు నిష్క్రమింతురు)

విదూ: ఓసీ; రదనికా; ఆర్య చారుదత్తున కీవిషయము దెలియనీయకుము. దుర్దశలోనున్న యాయన కిది మరింత బాధను కలుగజేయును.

రదనిక: ఆర్య మైత్రేయ; నేను జెప్పను.

విదూ: సరే.

చారు: (లోనికి వచ్చి నిలబడి వసంతసేనను జూచి) ఓసీ; రదనికా; గాలికొఱకు బయటనున్న రోహసేనుడు చలిగాలికి బాధ పడుచుండును. కావున నీయుత్తరీయమును గప్పుము. (అని పైయుత్తరీయము నిచ్చును.)

వసంత: (తనలో) ఏమీ; నన్నీయన తన పరిజనమని భావించినారు. (ఉత్తరీయము నందుకొని వాసన జూచి) ఏమిది; ఈయుత్తరీయము జాజిపూవుల కమ్మని వాసనల గుమ్మరించుచున్నది! ఈతని

4

జవ్వనము భాగ్యవస్తువులపై నాసగొల్పుచు కడు విరాజిల్లుచున్నది. (అని తన్ను దాను మఱుగుపఱుచుకొనుచున్నది.)

చారు: ఓసీ; రదనికా; రోహసేనుని లోనికిఁ దోడ్కొనిరమ్ము.

వసంత: నాయట్టి మందభాగ్యురాలి కంతటి భాగ్యమా;

చారు: ఓసీ; రదనికా; బదులు చెప్పవేమీ? ఆహా; ఎంత కష్టము. మనుజులకు దశ దొలగి సిరి పోయినపుడు మిత్రులు శత్రులగుదురు. చిరకాల మైత్రియు నశించిపోవును.

(రదనికయు విదూషకుడును దగ్గరకు వత్తురు)

విదూ: (చారుదత్తునితో) ఓయీ; ఇదే రదనిక.

చారు: ఈమె రదనికయా? మఱి యీమె యెవరు? అయ్యో; నేనెఱుగక యుత్తరీయ మిచ్చి యవమానించితినిగదా?

వసంత: లేదు, లేదు. మన్నింపబడితిని.

చారు: శరత్కాలపు మబ్బులోన దోచు చంద్రరేఖవలె గాన్పించుచున్నదే. కాని, పరస్త్రీని కన్నెత్తి చూడరాదుగదా;

విదూ: ఓయీ; అన్యకాంత దర్శన శంక విడుము. ఈమె వసంతసేన. కామదేవాలయోద్యానము నాటినుండి నీపై వలపు నిలిపియున్నది.

చారు: ఓయీ; ఈమె వసంతసేనయా! (తనలో) నావిభవము పోవుటచే నీమెకు నాయందు గలిగిన వలపు చేతకానివాని కోపమువలె స్వశరీరమందె జీర్ణించును.

విదూ: ఓయీ; సఖుడా; రాజశ్యాలకుడు మీతో కొన్ని మాటలు చెప్పుమనినాడు.

చారు: ఏమని?

విదూ: మేలైన బంగరు సొమ్ములు మేన ధరించి క్రొత్తనాటకము చూపవచ్చిన నటివలె వసంతసేన యనుపేరుగల భోగపు బడుచు కామదేవాలయోద్యానమునాడు మొదలు నీపై వలపు నిలిపియున్నది. ఇప్పుడామె మాచే బలాత్కరింపఁబడి నీయింట దూరినది.

వసంత: (తనలో) బలాత్కరింపఁబడితి ననుమాట నిజమే. కాని యీమాటలు నాకు మెఱుగుపెట్టుచున్నవి.

విటుడు: కావున నీవామెను స్వయముగా దోడ్తెచ్చి మాకు సమర్పించుకొంటివేని వ్యవహారము ముదరకుండగనే నీయందు మాకు ప్రీతి కలుగగలదు. అట్లుగాక యామెను నీవే దక్కించుకోదలచితివేని నీకును, మాకును యావజ్జీవము వైర ముండితీరును.

చారు: (సావజ్ఞముగ) వాఁడు మూర్ఖుడుకదా; (తనలో) ఆహా; యీ యువతి దేవతాస్తుతి స్థానమునకు యోగ్యురాలు. కావుననే యట్టిసమయమున వారలచే బలాత్కరింపఁబడినను మన ప్రకృత దశ దలంపక మన యింట ప్రవేశించినది. పురుష పరిచయముచేత గాఢముగ నతిప్రసంగము చేయలేదు. (ప్రకాశముగ) పూజ్యురాలా; వసంతసేనా; నేను నిన్ను మా పరిజనముగ భావించి పనిచెప్పి నీయెడ నపరాధి నైతిని. కావున తలయొగ్గి ప్రతిమాలుకొనుచున్నాను. (అట్లు చేయుచున్నాడు.)

వసంత: నా కర్హతలేని మీ పుణ్యగృహమును మీ యాజ్ఞ లేకయే ప్రవేశించి, మీయెడ నపరాధము గావించితిని. కావున ప్రసన్నులు కమ్మని నేనిదే ప్రణామపూర్వకముగ వేడుకొనుచున్నాను. (తల యొగ్గి ప్రణామము చేయుచున్నది.)

విదూ: ఓహో; మీ రిరువురు పొలములో వరిపోచలు ఒక దానివైపు మఱియొకటి వ్రాలిన ట్లొకరిదిక్కునకు మఱియొకరు వంగి సుఖముగా రెండుతలల నొక్కచో జేర్చుచున్నారు. నేనును యేనుగు మోకాటిచిప్పవలెనున్న నాతలను వంచి మీ యిరువురను ప్రబసన్నులను జేసికొనుచున్నాను. (అని లేచుచున్నాడు.)

చారు: అవునులే. ప్రణయముమాట యటుండనిమ్ము.

వసంత: ఆహా, ఈయన సంభాషణ మెంతచతురముగను, మధురముగను నున్నది. ఇప్పటి స్థితిలో నే నిందు నిలువ దగదు. అయిన నిట్లు చెప్పెదను. (ప్రకాశముగా) అయ్యా; మీరు నాయందు దయదలచితి రేని, యీ యలంకారమును మీయింట భద్రముగ నుంపుమని నా కోరిక. ఇది నాయొద్ద నుండిన,యెడల పాపాత్ములు నన్ను వెంబడింతురు.

చారు: మా యిల్లు న్యాస రక్షణమున కర్హముగ లేదు.

వసంత: దాని కేమిలెండు, సొమ్ము పురుషుల రక్షణక్రింద నుండవలసినదికాని, యిల్లు ముఖ్యముగాదు.

చారు: మైత్రేయా; ఆ సొమ్మును పుచ్చుకొనుము.

వసంత: అనుగ్రహింపబడితిని. (అని నగ నిచ్చుచున్నది.)

మైత్రే: (సొమ్ము పుచ్చుకొని) నీవు సుఖముగ వర్ధిల్లుము.

చారు: ఛీ! మూర్ఖుడా; ఇది దాచుకొనిన సొమ్ము.

మైత్రే: (జనాంతికముగ) అయిన చోరులు దీని నపహరింతురుగదా;

చారుదత్తు: అచిర కాలముననే.

మైత్రే: ఈన్యాసము మాదియే.

చారు: నీసొమ్ము మరల నీకీయబడును.

వసంత: అయ్యా ఈయనను నావెంట పంపుమని కోరుచున్నాను. అట్లయిన నేను సుఖముగా నింటికి బోగలను.

చారు: మైత్రేయ; నీవీ మెవెంట బోయిరమ్ము.

మైత్రే: నీవీ కలహంసగామిని ననుసరించినచో రాజహంసవలె శోభింతువు. నేను బ్రాహ్మణుడను. చతుష్పథమునందు కుక్కలు బల్యన్నము దినునట్లు యెక్కడనో పొట్టపోసికొని యెట్టెటో దినములు గడుపుకొందునులే.

చారు: అట్లే కానిమ్ము. ఈయమ వెంట నేనే బోయెదను. రాజమార్గమున బోవుట మంచిది. దీపములు వెలిగింపుము.

మైత్రే: వర్ధమానక; పెద్ద దీపములు వెలిగింపుము.

చేటి: (రహస్యముగ) బలే చమురు లేకున్నను పెద్ద దివ్వె ఎంత బాగుగా వెలుగుచున్నది!

విదూ: (జనాంతికముగ) ఓహో, అవి మా దీపములే! అవమానపడిన ధనహీనులగు కాముకులను గోరుకొన్న గణికలవలె యీదీపములు స్నేహశూన్యము లైనవి.

చారు: మైత్రేయ యీ దీపములతో బనియేమీ? కామినీ జనకపోలములవలె తెల్లనై చంద్రుడు గ్రహగణముతో నుదయించుచు, రాజమార్గమున దీపమై యుండెను. చీకటిని బోకార్చి, వెదజల్లుచు నెండిన బురదమీది పాలధారలవలె చంద్రకిరణములు స్వచ్ఛములై పడుచున్నవి. (సానురాగముతో) వసంతసేనా! ఇదే మీగృహము. నీవు లోపలికి బొమ్ము.

వసంత: (అనురాగముతో జూచుచు నిష్క్రమించును)

చారు: వసంతసేన లోనికి బోయినది. మనమిక బోదము రమ్ము. అంగడివీధి సద్దుమణిగినది. రాజభటులు తిరుగుచున్నారు. రాత్రివేళ బహుదోషములు వచ్చును. గాన మన మెవరివలన నపాయము నొందక పోదముపద. (వెనుకకు దిరిగి) సువర్ణభాండము రక్షింపవలెను సుమీ; రాత్రివేళ నీవును, పగటివేళ వర్ధమానకుడును, దీనిని గాపాడవలయును సుమా.

విదూ: చిత్తము. తమ సెలవుప్రకార మట్లే చేసెదను.

(అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు)

అలంకారన్యాసము అను ప్రథమాంకము,

సమాప్తము

# మృ చ్ఛ క టి క ము

## ద్వి తీ యా ం క ము

(చేటిక ప్రవేశించుచున్నది.)

చేటి : అమ్మగారు నాచేత పంపిన వర్తమానమును పూజ్యురాలైన వసంతసేనకు వినిపింపవలసియున్నది. (కొంచెము నడచి చూచి) అదిగో ఆమె మనమున నేదియో యోచించుచున్నట్లున్నది. సమీపించెదను.

(అంతట పరధ్యానముతో వసంతసేన పీఠమున గూరుచుండును. మదనిక ప్రక్కగా నుండును.)

వసంత : మదనికా; తఱువాత, తఱువాత.

మదనిక : అమ్మా; ఇదియేమి; మీరు నాతో నేమియు మాటలాడకయే "తఱువాత; తఱువాత" ననెద రేల?

వసంత : నే నేమంటిని?

మదనిక : "తఱువాత, తఱువాత" అని యంటిరి.

వసంత : (కనుబొమలు విచ్చి) అవును సరే.

చేటి : (ప్రవేశించి) అమ్మా, మీయమ్మగారు స్నానముచేసి దేవతలను పూజింపుమని మీతో జెప్పమనిరి.

వసంత : ఓసీ; నేనిప్పుడు స్నానము చేయను, కనుక బ్రాహ్మ ణునిచేతనే పూజ చేయింపుమని మాయమ్మగారితో మనవి చేయుము

చేటి : చిత్తము. తమ సెలవుప్రకారమ మల్లే చేసెదను.

( అని వెళ్ళుచున్నది. )

మదనిక : అమ్మా, స్నేహాముచే నడుగుచుంటినిగాని, తప్పు లెంచుటకుగాదు సుమా, ఇదియేమి ?

వసంత : మదనికా! నేనెట్లు కనబడుచున్నదాననే.

మదనిక : అమ్మా నీ మన సెక్కడకో బోయినట్లున్నది నీవెవరినో మనస్సున గోరినట్లున్నావు.

వసంత : మదనికా; నీవు చక్కగా దెలిసికొంటివి. నీవు పర హృదయమును గ్రహింపగలిగిన పండితురాలవుగదా!

మదనిక : అమ్మా; ఇది నాకు చాల సంతోషకరమైనది. పూజ్యుఁడు, కామదేవుఁ డదృష్టవంతుఁడు. పడుచువాండ్ర కివి పండుగ దినములు. అమ్మా; నీవు నాతో జెప్పుము. నీవు సేవింపదలచు నాతడు రాజా! రాజవల్లభుడా!

వసంత : మదనికా; నేను సేవింపదలచుటలేదు. మనసార గోరినవానితో సుఖింప గోరితిని.

మదనిక : అమ్మా; విద్వాంసుఁడైన బ్రాహ్మణయువకు నెవని నైన గోరితివా ?

వసంత : భూసురులు నాకు బూజనీయులు.

మదనిక : నానాదేశములు దిరిగి ధనమార్జించిన వణిక్పుత్రు నెవనినైన వలచితివా ?

వసంత : ఎంతటి ప్రణయముగల వాడైనను వర్తకము నిమిత్తము దేశసంచారము చేయు వర్తకుల వియోగము సహింపరానిది గదా ?

మదనిక : అమ్మా; అయితే, రాజుగాక, రాజవల్లభుడుగాక, బ్రాహ్మణుడుగాక, వణిజుడుగాక, మఱి నీకు వాంఛనీయు డెవరమ్మా?

వసంత : మదనికా; నీ వానాడు కామదేవాలయమునకు నాతోగూడ వచ్చితివిగదా ?

మదనిక : అవును, వచ్చితిని.

వసంత : అయితే, నీ వెఱుగనట్లు నన్నడుగుచుంటి వేమి ?

మదనిక : ఆ తెలిసినది. నీకు శరణమిచ్చిన యాతడా అతడు ?

వసంత : ఆతని పేరేమో ;

మదనిక : ఆతడు వర్తకుల వీధిలో కాపుర మున్నాడు.

వసంత : ఓసీ, నే నతని పే రడిగితినే ?

మదనిక : అమ్మా ! అతడు సుప్రసిద్ధుడైన చారుదత్తుడుగాదా;

వసంత : ( సంతోషముతో ) అవునవును. అతడే ; నీవు చక్కగా గ్రహించితివి.

మదనిక : ( తనలో ) అది యట్లో. ( పైకి ) అమ్మా ! అతడు నిరుపేదవాడని విన్నాము.

వసంత : కావుననే యాతని కామించితిని. వేశ్యలు దరిద్రుల బ్రేమించినపుడే వెలయాలను నపకీర్తిని బాపుకొందురు.

మదనిక : అమ్మా; తియ్యమామిడిచెట్టయినను, పూవులు లేనిచో నాడుతుమ్మెదలు జేరవుగదా ?

వసంత : అవి మధుకరులుగనుక మకరందము లేనప్పుడు పోవు.

5

మదనిక : అమ్మా; అట్లయిన నీవేల యీాయనను వెంబడింపవు?

వసంత : మదనికా; నేనట్లు తొందరపడి యాతని వెంటఁ బడితినేని, ప్రత్యుపకారము చేయలేకపోయితినని తలచి, యాతడు నాకంటికే కనబడడేమో ?

మదనిక : అమ్మా; అందువల్లనా సువర్ణభాండ మతనికడ దాచితివి ?

వసంత : మదనికా; నీవు చక్కగా నూహించితివి.

( తెరలో )

ఓరీ, భట్టారకా; పదివరహాలు పందెముపెట్టి యోడి యీాజూదరి పారిపోవుచున్నాడు. పారిపోవుచున్నాడు. పట్టుకొనుము. పట్టుకొనుము, ఓరీ ; నిలువుము, నిలువుము, దూరమున గనబడు చున్నావు.

( తెరతీయకనే )

( పిదప సంవాహకుడు తొట్రుపడుచు ప్రవేశించుచున్నాడు )

( తెర యెత్తుకొని ) జూదరి తనమెంత నింద్యమైనది. అమ్మయ్యా, క్రొత్తగా కట్లు త్రెంచుకొన్న యాడుగాడిదవలె యీాగ్రుడ్డి గవ్వచేత దెబ్బలుతింటిని. పూర్వము కర్ణునిచేతి శక్తి ఘటోత్కచుని చంపినట్లే యీాయాట శక్తిచేత నేను ఘాతమును తిని జూదపు బద్దులువ్రాయు సభికుని బారినుండి తప్పించుకొని బయట పడిననాకు వాడే యిపుడెదురుపడినాడు. అక్కటా; ఇప్పుడు నన్ను రక్షించువారెవరు ? అయితే యీాసభికుడును, యీా జూదగాడును, నన్ను వెదకుచు నిటే వచ్చుచున్నారు. అయితే నేను వంకర

టింకరగా నడుగులు వెనుకకువైచుచు నీయెదుటనున్న పాడు దేవాలయ ములో ప్రవేశించి దేవివలె పీఠముపై నాసీనుడ నయ్యెదను.

( అని దేవాలయములోని కేగి దేవిపీఠముపై గూరుచుండును )

( అంతట మాధురుడు, జూదగాడు ప్రవేశింతురు )

మాధురుడు : ఓరీ, భట్టారకా ; పదివరాలు ఋణపడి యీజూదరి పారిపోవుచున్నాడు, పట్టుకో, పట్టుకో, ఓరీ ; నిలు, నిలు, నిలు. దూరమున గనబడు చున్నావులే.

ద్యూతకరుడు: నీవు భయపడి పాతాళమునకుఁ బోయినను, స్వర్గమున కేగినను, దేవేంద్రుని శరణు వేడినను. నిను రక్షింపజాలిన వీరుడు లేడు. రక్షించిన యీసభికుడే రక్షింపవలయుకాని, నిన్ను రుద్రుడైనను రక్షింపలేడు.

మాధురు : ఓరీ ; జూదరికులమున కప్రతిష్ఠ దెచ్చి నీవు భయముచే కాళ్ళు తొట్రువడ శరీరమువడక, సభికుని మోసపుచ్చి యెందు బోయితివిరా జూదరి ; ( అడుగులు చూచి ) ఇట్లు పరుగెత్తి నాడు ( చూచి ) అయ్యో ; యిక్కడనుండి యడుగులజాడ కాన రాలేదేమి ?

మాధురు : ( చూచి సవితర్కముగా ) ఓరీ ; అడుగు లిచ్చట వెనుక మడమలుగా నున్నవి. ఈదేవాలయమున విగ్రహాము లేదు. అడుగులు వంకరగా నడచుచు నీపాడు దేవాలయమును బ్రవేశించి యుండును.

జూదగాడు : మనముకూడ వాని ననుసరింతము.

మాధురు : సరే ; కానిమ్ము.

( ఇద్దరు దేవాలయముజొచ్చి ప్రతిమను నిరూపించి, సంజ్ఞచేసి కొనుచుండిరి )

జూద: ఏమీ; యీ విగ్రహము కొయ్యతో చేయ బడినదా?

మాధురు: కాదు, కాదు, రాతిబొమ్మ. ( అని పలుమారు దానివిషయమై సైగచేసికొని ప్రకాశముగా ) ఏదియైన గానిమ్ము, రమ్ము, కూర్చుండుము. మనము జూదమాడుకొందము. ( అని బలు విధములుగ పాచికలాడుచుందురు )

సంవాహకుడు: ( జూదమాడు కోరిక లోన నడంచుకొని, తనలో ) రాజ్యభ్రష్టుడైన మహీపతి మనస్సు భేరీధ్వని విని కంపించును. అట్లే జూదమందు ధనముగోల్పోయిన వానికి పాచికలచప్పుడు చెవిని బడినంతనె గుండెలవియును. జూదము మేరుపర్వతము నెక్కింపగలదు. అందుండి క్రిందికి గూలద్రోయగలదు. జూద మికమీద నెన్నడు నాడగూడదని ప్రతినపట్టిన మనుజునకు సైతము కోకిల నినాదమువంటి పాచికలరొద మరల నాసపుట్టించును.

జూద: పందెమునాది, పందెమునాది.

మాధురు: నీదికాదు, నాది పందెము. నాది పందెము.

( సంవాహకుడు వేరొక ప్రక్కనుండి హఠాత్తుగా దుమికి )

మీయిరువుర పందెముకాదు, నాది ఈపందెము.

జూద: దొంగ దొరికినాడు, దొంగదొరికినాడు.

మాధురు: ( సంవాహకుని పట్టుకొని ) ఓరీ; పందెమీయక పారిపోయితివే, మాపదివరాలు మాకిమ్ము.

సంవాహకు: ఇప్పుడే యిచ్చెదను.

మాధురు: ఈ తక్షణమే యిమ్ము.

సంవా: అయ్యా; ఇచ్చెదను, అనుగ్రహింపుము.

మాధురు: ఓరీ, మా కిప్పుడే యిచ్చివేయుము.

సంవా: అయ్యో; నాతల తిరుగుచున్నది. (అని భూమిపై బడుచున్నాడు)

(మాధురుడును జూదరియును వానిం గొట్టుచున్నారు)

మాధురు: ఓరీ; నీవిప్పుడు జూదగాండ్రచే బంధింపఁబడితివి.

సంవా: (లేచి విచారముతో) అయ్యో; నే జూదగాండ్రచే బంధింపఁబడితినా? ఎంతకష్టము. ఈ సమయము జూదగాండ్ర కవిలంఘనీయము గదా; అయిన నేనిప్పు డెక్కడనుండి తెచ్చి యీయ గలను?

మాధురు: ఓరీ; మరెవ్వనిచేనైన నొప్పింపుము.

సంవా: సరే; అట్లేచేసెదను. (అని జూదగాని జూచి) నీకు సగమిచ్చెదను. తక్కిన సగము నీవు తీసివేయవలెను.

మాధురు: అట్లే కానిమ్ము.

సంవా: (సభికునితో) అయ్యా; సగము సొమ్ము మీరు వదలి వేయవలెను.

మాధురు: అందు తప్పేమి, అట్లే కానిమ్ము.

సంవా: (జూదగానితో) అయ్యా; నీవు సగము వదలుకొంటివి గదా?

మాధు: అవును సగము వదలుకొంటిని.

సంవా: (జూదగానితో) నీవొకసగము తీసివేసినావు గదా?

జూద: అవును తీసివేసినాను.

సంవా: అయితే నే నిప్పుడు వెడలిపోయెదను.

మాధురు: నీవెక్కడకు బోవుదుము. మా పది సువర్ణము లక్కడబెట్టి కదులుము.

సంవా: అయ్యా; పెద్దలందరు చిత్తగింపుడు. వీరిప్పుడు సగము వదలివేయుదమనిచెప్పి మిగిలిన సొమ్మెప్పుడొ మ్మని చెప్పిరి. మరల సొమ్మిప్పుడే తెమ్మనుచున్నారు.

మాధురు: ఓరీ; ధూర్తా; నేను మాధురుడను. నిపుణుడ నైన నన్ను మోసగించలేవు. ఇప్పుడే నాసొమ్మంతయు నాకిచ్చి వేయుము. నేను సొమ్మేమియు తగ్గింపను.

సంవా: నేనెక్కడనుండి తెచ్చి ఈయగలను.

మాధురు: నీతండ్రిని తెగనమ్మి తెచ్చి యిమ్ము.

సంవా: నాతండ్రి యెక్కడ?

మాధురు: నీతండ్రి లేనిచో నీతల్లినే తెగనమ్మి మాకు సొమ్మి నిచ్చివేయుము.

సంవా: నాకుఁ దల్లియునులేదు.

మాధురు: అట్లయిన నీవే యమ్ముడుబోయి యిమ్ము.

సంవా: అయ్యా; మీరు నాయందనుగ్రహించి నన్ను రాజ వీధికి గొనిపొండు.

మాధురు: కానిమ్ము. పద, పద.

సంవా: (సరే అని నడుచుచున్నాఁడు) ఓహో! ఆర్యులారా! పౌరులారా; మీరెవరైన నన్ను, గొని యీసభికునకుఁ బదివరాల

సామ్మిచ్చెదరా ; (ఆకాశమువంక జూచి) ఏమనుచున్నారు. "నీవేమి పనులు చేయుదు" వనియా మీ యింటి యందుగల పనులన్నియు జేయగలను. అయ్యో, నామాటకు బదులు చెప్పకయే మాయమై పోయినాఁడే. ఇంకొకని నడిగెద. (అట్లుచేసి) అయ్యో ; ఇతడుగూడ నామాటకు సమాధాన మీయక పోయెను. ఆహా! మందభాగ్యుడైన చారుదత్తుని విభవము పోవుటచేకదా, నా కిట్టి దురవస్థ కలిగెను.

మాధురు : ఓయీ! మాసొమ్ము మాకిచ్చి వేయుము.

సంవా : ఎక్కడనుండి తెచ్చి యిత్తును ? (అని నేలపై బడుచున్నాఁడు)

(మాధురుడు లాగుచున్నాడు)

(అంతట దర్దురకుడు ప్రవేశించుచున్నాఁడు)

దర్దురకుడు : ఆహా ; జూదమనగా బురుషునకు సింహాసనము లేని రాజ్యముగదా ? జూదరి పరాభవము లెక్కసేయడు. ధనము నితరుల కిచ్చును. తా నితరులవలన గ్రహించును. మాయలు చేయుచుండును. భూపతివలెనే ధనవంతులచేఁ బరివేష్టింపఁబడి యుండును. మఱియు జూదము వలననే ద్రవ్యము లభించును. జూదము వల్లనే భార్యయు మిత్రులును లభింతురు. జూదము వల్లనే తా ననుభవింపగలడు; ఇతరుల కీయగలడు. జూదము వల్లనే దారిద్ర్యము కూడ సంభవించును. త్రేతయను నాట నాసర్వస్వము నపహరించినది. పావరమనునాట నామేను శుష్కింపఁజేసినది. నర్దితము నాకింటికి దారి జూపినది. కటము నాకొంపతీసి, నన్ను నలుగురితో తలవంచుకొనజేసినది. (ముందువైపు చూచి) మాపూర్వ సభికుడైన

మాథురుడిటే వచ్చుచున్నాఁడు, కానిమ్ము నేనిపుడు తప్పించుకొని పోవుటకు శక్యముగాదు. కావున నేనిప్పుడు ముసుగు వైచుకొనెదను. (అనియుత్తరీయమును తీసిచూచి) అయ్యో; యీ యుత్తరీయమున నూలుపోగులులేవు. దీనినిండ నూరు చిరుగులున్నవి. దీని నెటుల గప్పుకొందును. ఇప్పుడిది మడతవిప్పిన యున్నగోడును జెడును. ఇది కప్పుకొనుటకు పనికిరాదు. పోనిమ్ము ఈచవట నన్నిపుడేమి చేయ గలడు? నేనేమి చేతగానివాడనా, నేనొక్కకా లాకసంబున బెట్టి వేరొకకాలు నేలమీదనాన్చి, పగటిపూట యంతయు నట్లె నిలిచి యుందును. అప్పుడు వీడు నన్నేమిచేయునో చూతము.

మాథురు: ఇమ్ము, మాసొమ్ము నిమ్ము.

సంవా: నేనెక్కడనుండి తెత్తును.

(మాథురుడు లాగుచున్నాఁడు)

దర్దుర: ఓయీ; ఆ ముందువైపున నేమి జరుగుచున్నది? (బయ లాలకించుచు) రమ్మనుచున్నారు? ఓడిపోయిన సొమ్మును దెచ్చి యిమ్మని యీజూదరిని సభికుడుకొట్టి చంపుచున్నాఁడు. వీనిని విడిపించు వారెవ్వరును లేరనియా? ఈదర్దురకుడు వానిని విడిపింప గలడు. (సమీపించి) తొలగుడు, తొలగుడు. నన్నుపోనిండు. (చూచి) అయ్యో; వీఁడు ధూర్తుడైన మాథురుడా! వాడు దీనుడైన సంవాహకుడా!

అయ్యో యీదీనుడు చెట్టుకొమ్మలలో నొదిగి, నాల్గుజాములు నిచట వ్రేలాడబడి యుండగల్గునా! సభికుడుపట్టి రాళ్ళమీద యీడ్వగా వీపు గాయములు పడిన నోర్చుకొన జాలునే! కుక్కలు పిక్కలు పట్టుకొని పీకుచుండ నావేదన సహింపగల్గునే. అయ్యో, యిట్టి కడుసుకుమార శరీరునకీ ద్యూతాభిలాష యేల పొడమెనో

గదా; కానిమ్ము నేనిప్పుడే మాథురుని బ్రతిమాలు కొందును. (మాథురుని సమీపించి) మాథురా దండములు.

(మాథురుడు మరల నమస్కరించుచున్నాడు).

దర్దుర: అయ్యో, ఏమిటిది?

మాథు: ఇతడు పది వరాలోడిపోయి మాకప్పు వడినాడు.

దర్దుర: ఇంతేకదా! ఇది యెంతపాటిది. చల్దిముద్దపాటి సేయనిది?

మాథు: (దర్దురునిమీదనున్న బట్టమడతలాగి) అయ్యలారా! మీరందఱు చూచినారా! యీచిరుగులబట్ట కప్పుకొనిన ఈభాగ్య వంతునకు పదివరాల సొమ్ము. చల్దిముద్దపాటి చేయదట.

దర్దుర: ఓరీ; మూర్ఖుడా; రేపు నేనొక్కపందెము గెల్చి, నీ పది వరహాలు నిచ్చి వేయగలను. అయితే సొమ్మున్నవారు మాత్రము ధనము ప్రోగుచేసుకొని, యందఱకు చూపింతురా! పది వరాల సొమ్ముకొఱకు నైదింద్రియములు గలిగిన నీసాటి మనుష్యుని నిండుప్రాణిని నీవిట్లు బాధపెట్టి చంపి భ్రష్టుడవైతివి. నీవు బాధపడు చుంటివి.

మాథు: అయ్యో; నీకు పదివరహాలనగా నంత చులకనగా దోచుచున్నది. నాకా పదివరాలే పదివేలు, నాకదే మహదైశ్వర్య ముగా నున్నది.

దర్దుర: అట్లయిన నేనొకటి చెప్పెదను వినుము. నీవు వీని కింకొక పదివరాల సొమ్మిమ్ము. మరల నీతడునీతో జూద మాడగలడు.

మాథు: అందువల్ల నేమి ప్రయోజనము?

దర్దుర: అప్పు డతడు గెల్చిన నీపదివరాలు నీకిచ్చి వేయును.

మాధు: గెలువక పోయినచో,

దుర్దుర: అప్పు డీయనే యీాయడు.

మాధు: ఇట్టిమాటలు నాకడ చెప్పకుము. ఇన్ని యెటిగిన వాడవు నీవే యివ్వరాదా! నేను పరమ ధూర్తుడను, నా పేరు మాధురుడు. జూదములో నెందఱనో మాయజేసితిని. నే నొకరికి జడి యుదునా? ఓరీ; తులువా, నీ శీల మెంత చెడిపోయినది.

దర్దుర: ఓరీ; ఎవరురా, తుంటరి? ఎవని శీలము పాడైనది.

మాధు: నీవు తుంటరివి.

దర్దుర: నీవు తుంటరివి. నీతండ్రి తుంటరి. (అని సంవాహకుని పారిపొమ్మని సైగ చేయుచున్నాడు.)

మా: ఓరీ; తులువా; నీ వీలాగుననే జూదమాడితివా?

దర్దుర: అవును, నేనిట్లే జూదమాడితిని.

మా: ఓరీ; సంవాహకా, నా పది వరహాలు నా కిమ్ము.

సంవా: ఇచ్చెదను. ఇప్పుడే ఇచ్చెదను.

(మాధురుడు సంవాహకుని లాగును.)

దర్దు: ఓరీ; మూర్ఖా, నాముందే వీనిని బాధింతువా?

(మాధురుడు సంవాహకుని ముక్కుమీాద గ్రుద్దును. సంవాహకుడు ముక్కునుండి నెత్తురు గారుచుండ మూర్ఛిల్లును. దర్దురకుడు అడ్డుకొనును. దర్దురకుడు, మాధురుడు నొండొరులఁ దన్నుకొందురు.)

మా: ఓరీ; తులువా; నీవు దీనికి దగిన ఫల మనుభవింతువులే.

దర్దుర: ఓరీ; మూర్ఖుడా; నన్ను త్రోవలో పట్టుకొని యిట్లు కొట్టగలిగితివి. కాని రేపు రాజుగారి దేవిడీలో నన్నేమి చేయగలవో చూడు.

మాధు: ఇదిగో; నేనే చూాతును.

దర్దుర: ఎట్లు చూాచెదవు?

మాధు: (గ్రుడ్లు పెద్దవిచేసి ముందుకు వచ్చి) ఇదిగో యిట్లు చూాచెదను.

(అంతట దర్దురకుడు మాధురుని కన్నులలో దుమ్ముగొట్టి పారి పోవును. సంవాహకుని పారిపొమ్మని సంజ్ఞ చేయును, మాధురుడు కన్నులు నులుముకొనుచు, నేలపై బడును.)

దర్దుర: (తనలో) జూదగాండ్రలో పెద్దవాడైన మాధురునితో విరోధము పెట్టుకొంటిని. నేనిక్కడ నుండుట మంచిదిగాదు. ఆర్యకుం డను గోపాలకుడు ముందు రాజు కాగలడని యొక సిద్ధుడు వచించె ననియు, అందుచే మావంటివారందఱు గోపాలుని నాశ్రయించిరనియు, నామిత్రుడు శర్విలకుడు చెప్పినాడు. నేనును పోయి వానినే యాశ్ర యించి యుండెదను. (అని నిష్క్రమించును.)

సంవాహ: (భయముతో బరువెత్తుచు నెదుట చూచి) ఎవ దో యీ యిల్లు రెక్కల తలుపు తెరచియున్నది. ఇందు ప్రవేశిం చెను. (అని యట్లుచేసి, వసంతసేనను జూచి) అమ్మా శరణాగతుడను.

వసంత: శరణాగతుడవైన నీకు నే నభయ మొసగితిని. చేటీ; తలుపు మూాయుము.

(చేటి యట్లు చేయును.)

వసంత: ఓయీ; నీ కెవరివలన భయము?

సంవా: అప్పులవారి వలన.

వసంత: చేటీ; తలుపు గట్టిగా మూాయుము.

సంవా: ఏమీ ; నావలెనే యీమెకును ధనికులన్న భయముగు చున్నదే. ఇది లోకమున నున్నదేగదా ; తన బలమున కనురూపముగు బరువు మోచువానికి, గహనమందైనను నడక సాగునుగదా ! ఇందుకు నేనే నిదర్శనము.

మాథు: (కన్నులు నులుముకొనుచు జూదగానితో) ఓరీ ; నా పదివరాల సొమ్ము నా కిమ్ము.

జూద: అయ్యా ; మనము దర్దురకునితో గలహించుచుండగా నాసందడిలో నాతడు తప్పించుకొని పారిపోయినాడు.

మాథు: వాని ముక్కు చితుకబొడిచితినిగదా ; అది నెత్తురు కారుచున్నది. ఆనెత్తురుబొట్లజాడనే బోయి వానిం బట్టుకొందము. (అని వెనుకకు నడచిరి.)

జూద: అయ్యా ; ఈతఁడు వసంతసేన యింటిలో ప్రవేశించి నాఁడు.

మాథు: అట్లయిన మన సొమ్ము పోయినట్లే.

జూద: రాజకులములో నివేదింతము.

మాథు: ఇంతలో నీధూర్తుఁ డెంచేని పోగలఁడు. కావున నిందే మనము పోవుచుండి వీనిం బట్టుకొందుము.

(వసంతసేన మదనికకు సైగ చేయుచున్నది.)

మదనిక: అయ్యా ; తమ రెవరు ? ఎవరివారు ? ఎందుండి యిటకు వచ్చితిరి. మీరే వృత్తివలన జీవించుచున్నారు. భయమునకు గారణ మేమి ?

సంవా: అయ్యా, వినుఁడు. పాటలీపుత్రము మా జన్మస్థానము. నే నొక సంసారి బిడ్డను. సంవాహకవృత్తిచే జీవించుచున్నాను.

మద : సుకుమారమైన విద్య నేర్చుకొంటిరే.

సంవా : అమ్మా; నేను కళగదాయని నేర్చుకొంటిని. అదియే యిప్పుడు నాకు జీవనోపాధి యైనది.

మద : ఏమయ్యా; మీరు మిగుల దీనముగా నుత్తరము చెప్పుచున్నారు, అనంతర మేమి జరిగినది?

సంవా : అమ్మా, తరువాత మాయింటికి వచ్చుచున్న భిక్షుకుల వలన విని యపూర్వమగు నీ దేశమును దర్శింపగోరి యిచ్చటకు వచ్చితిని. ఈ యుజ్జయినీనగరమున బ్రవేశించిన తరువాత యందొక మహాభాగుని సేవించితిని. అతడు ప్రియదర్శనుడు. ప్రియవాది, తన యీవిని చేర్కొనడు. పరులు తనకు చేసిన యపకారము మరచువాడు. వేయేల అతడు దాక్షిణ్యముచే దన శరీరమును, సంపదను సయిత మితరులకు వినియోగించును. శరణాగతవత్సలుఁడు.

మద : అమ్మా; ఇన్ని సుగుణములఁ దోచుకొని, యీయుజ్జయినీనగరమున కలంకారముగ నిందు కాపుర మున్నవాఁడు నీ మనోరథముకంటె వేరెవ రున్నారమ్మా?

వసంత : చెలీ; లెస్సగా జెప్పితివే, నేనును నట్లే తలంచుచున్నాను.

చేటి : అయ్యా; అటుతరువాత నేమిజరిగినది?

సంవా : అమ్మా; తన ధన మర్థుల కిచ్చుటచే నాత డిప్పుడు;

వసంత : ఏమీ! విభవము గోల్పోయెనా?

సంవా : అమ్మా; నేజెప్పకయే మీరు గ్రహించితిరే?

వసంత : ఇందు తెలిసికొనుట కేమున్నది. సుగుణసంపదయు, విభవ సంపదయు నొక్కచో నుండు టరుదుగదా? జలము పాన యోగ్యము కానప్పుడుగదా తటాకములో నీరు మిగులుట!

మద : అయ్యా; ఆయన పేరెవరు ?

సంవా: అమ్మా, భూతల మృగాంకుడైన యీతని పేరెవ రెరుగరమ్మా! అతడు సెట్టి కూడలిలో నివసించుచున్నాఁడు. ఆర్య చారుదత్తుఁడు. కొనియాడదగిన పేరుగలవాఁడు.

వసంత : (సంతోషముతో పీఠమునుండిలేచి) అయ్యా, యీ యిల్లు తమదిగా భావింపవచ్చును. చేటీ యీయనకొకయాసనమిమ్ము. వింజామర పుచ్చుకొనుము. ఆర్యుఁడు మిక్కిలి యలసియున్నాఁడు.

సంవా: (తనలో) ఏమీ; ఆర్య చారుదత్తుడుగారి పేరు చెప్పినంతమాత్రముచేత నాకింత యాదరము జరుగుచున్నదే సెబాస్, చారుదత్తా సెబాస్. ప్రపంచములో నీవొక్కఁడవే జీవించి యున్నాడవు. బ్రదుకనగా నీవే బ్రదుకవలెనుగాని, తక్కినవారూపిరిపీల్చుటకు మాత్రమే బ్రతికియున్నారు. (అని యామె కాళ్ళపైబడి) అమ్మా; నాకీయాదరము చాలును. మీరు పీఠముపై గూరుచుండుడు.

(పీఠముపై గూరుచుండి)

వసంత : అయ్యా; ఆ ధనికుఁ డెక్కడ ?

సంవా: అమ్మా; సజ్జనులకు సత్కారమే ధనము. ధనము చంచలమైనదిగదా! ఒరులను బూజింప నేర్చినవాఁడే తాను మన్నన లందగలఁడు. సత్కారమే యెఱుగనివాడు సత్కార విశేషమును గుర్తింపజాలఁడు.

వసంత : తఱువాత తఱువాత.

సంవా: అమ్మా; నేనా మహాపురుషుని సేవించుచుంటిని. ఆయన విభవమును గోలుపోయిన పిదప నేనీ జూదమునందు బ్రవేశించితిని. నా మందభాగ్యముచే నేడు పది సువర్ణము లప్పు వడితిని.

మాధు : నన్ను మోసముచేసి, పాఱిపోతివి గదరా?

సంవా : అమ్మా; ఆ సభికుడును, జూదగాడును, నన్ను వెద కుచు నిటే వచ్చుచున్నారు. వారిమాటలు వినుడు. తమదే భారము.

వసంత : ఓసీ; మదనికా, తాము గూండ్లు కట్టుకొని కాపుర మున్న చెట్లు పడిపోగా, నాల్గునై ఫులకు చెదరిపోయిన పక్షుల విధమున నున్నది. ఆసభిక జూదరుల కీహస్తాభరణము నీతఁ డిచ్చెనని యిచ్చి మ్మ్మ. (అని కంకణము తీసి యిచ్చును.)

మద : (పుచ్చుకొని) అమ్మా; చిత్తమట్లే చేసెదను.

మాధు : మమ్ము వంచించి పారిపోయితివిగదరా ;

మద : (పై కి చూచుచు, నిట్టూర్పులుపుచ్చుచు, వాకిలి వంకజూచి తనలో) వీరే జూదరులు గాబోలును (అని తలుపుతీసి ప్రకా శముగా) అయ్యా; వందనము.

మాధు : సుఖమగుగాక :

మద : సభికుఁ డెవరు?

జూదరి : కెంపువంటి యధరముతో ; క్రేగంటిచూపులతో, విలాసముగానున్న నీవెవ్వరిదానవు. ఇట్లేల వచ్చితివి. మేము ధనవం తులముగాము. వేరొకచోటి కరుగుము.

మద : మీ మాటలతీరు చూడగా జూదరులవలె గన్పిం చుటలేదు. మీ కెవ్వరైన నప్పుపడి యున్నారా?

జూదరులు : అవును. మా కొకడు పది వరహాలసొమ్ము బాకీ యున్నాఁడు. వానితో నీకేమిపని?

మదనిక : అతని నిమిత్తము మాయమ్మగారీ సువర్ణకంకణ మిచ్చిరి. కాదు, కాదు. అతఁడే మాకు పంపియున్నాఁడు.

జూదరి : (సంతోషముతో బుచ్చుకొని) సరే ; వాని యప్పు తీరినదని చెప్పుము. ఓరీ ; రమ్ము. మరల జూద మాడుకొందము.

(నిష్క్రమింతురు)

మద : అమ్మా ; ఆ సభికుఁడును, జూదరియు సంతోషించి వెడలిపోయిరి.

వసం : అయ్యా ; మీరిప్పుడే మీ బంధువులను సమాశ్వాసింపఁజనుడు.

సంవా : అమ్మా ; ఈ సేవకుడు, నేర్చినవిద్య, నీకడ జూపవలదా ?

వసం : అయ్యా ; నీ వెవరికొఱకీ విద్య నేర్చితివో, ఏ మహాపురుషుని సేవించితివో, యిప్పుడును నాతనినే సేవించి నీవిద్యను సార్థకము చేసికొనుము.

సంవా : ( తనలో ) పూజ్యురాలైన వసంతసేన నామాట నెంత నేర్పుతో నిరాకరించినది. ఈమెకు నేనెట్లు ప్రత్యుపకారమొనర్పగలను. (ప్రకాశముగా) అమ్మా ; నేనీ జూదగాండ్రవలన పొందిన యవమానముచే బౌద్ధసన్యాసి నయ్యెదను. ఆ సంవాహకుడే జూదరియై, శాక్య శ్రమణుడయ్యె ననుమాటమాత్రము మరువకుడు.

వసం : అయ్యా ; ఇంత సాహసము వలదు.

సంవా : అమ్మా; నేను కృతనిశ్చయుడనై తిని. నేనిక మానను. (నాలుగడుగులు నడచి) ఇంతదనుక జూదమాడుచు నలుగురిలో దలవంపులగు దొంగవలె సందుల గొందుల దిరిగితిరి. ఇకమీద బౌద్ధసన్యాసినై రాజమార్గమున దలయెత్తుకొని విహరింపగలను,

(తెరలో గలకలము)

సంవా: ( విని ) అరే, ఏమిది; ( బయటచెవియొగ్గి ) ఏమను చున్నారు. ఇదిగో ఖుంటమోటకము వసంతసేన దుష్టగజము విడివడి తిరుగుచున్నదని యా నేను బోయి యా గంధగజమును జూచివత్తునా; పోనిమ్ము. నాకు దానితో నేమిపని. నాపని నేజూచుకొనియెదగాక

(అని నిష్క్రమించును)

కర్ణపూరకుడు: పూజ్యురా లెక్కడ? యెక్కడ?

మద: ఓరీ; దుర్మార్గుడా; యీ యుపద్రవమునకు గారణమేమి? అదిగో; నీయెదుటనే సుఖాసీనయైయున్న యామెనే జూడలేదా?

కర్ణ: అమ్మా; వందనము.

వసం: కర్ణపూరక, ఏమీ; నీ మొగమున సంతోషము తాండవమాడుచున్నదే కారణమేమి?

కర్ణ: అమ్మా? నీవు నా పరాక్రమమును జూడలేదా?

వసం: కర్ణపూరక; అదియేమి?

కర్ణ: అమ్మా; చెప్పెదను వినుము. ఖుంట మోటక మను మదగజము కట్టుకంబము నూడబెరికికొని, మావటీనిజంపి, మహా సంక్షోభముతో రాజమార్గమునంబడినది. "దుష్టగజము వీధినిబడినది. పిల్లలను దొలగింపుడు. పెద్దలందఱు వృక్షముల నారోహింపుడు. కాలియందె లూడిపోవ, మణిఖచిత మేఖలనుండి మణులు రాల రత్న మయముల జారిపోవ, దంతి యంగడివీధిని పరుగెత్తుచున్నది" అని జను లందరు యెలుగెత్తి యరచిరి. అనంతర మా దంతి విరియబూసిన తామరపూవువలె నున్న మన యుజ్జయినీ నగరమును బ్రవేశించి,

చిందరవందర జేయుచుండ నంత నొక పరివ్రాజకుం డెదురు పడియె. ఆగజము వాని దండకమండలువుల భగ్నముకావించి, శీకరము లెగ జిమ్ముచు వానిని దంతముల సందున నిరికించుకొని పైకెత్తగా నందున్న జనులందరు. "సన్యాసి చచ్చె. సన్యాసి చచ్చె" నని పెద్ద పెట్టున నఱచిరి.

వసం: అయ్యో, ఎంత ప్రమాదము, ఎంత ప్రమాదము.

కర్ణ: అమ్మా; తొందరపడకుడు, భయములేదు చెప్పెదను. సావధానముగ వినుడు. అంత నా మదపు టేనుగు కాలి గొలుసులు తెగి జీరాడుచుండ రెండుదంతముల మధ్య పరివ్రాజకుని నిరికించుకొని పోవుచుండెను. అంతట నీకర్ణపూరకుడు కాదు, కాదు. నీ యన్నము దిని బలిసిన నీ దాసుడు తన యెడమ కాలితో, సవ్యసించిన జూదరి నావలకు దీసి, చేరువలోనున్న యొక దుడ్డుకఱ్ఱను దెచ్చి, యా మద గజమును మోదెను.

వసంత: తఱువాత, తఱువాత.

క: అమ్మా; ఈ నీసేవకుడు వింధ్యశైల శిఖరముంబోలె విడి వడి రాజవీధిని బడిన మదశుండాలమును మరల్చి, దాని దంతములలో జిక్కుకొనిన పరివ్రాజకుని ప్రాణములను రక్షించెనుగదా;

వసం: మంచిపని చేసితివి, తఱువాత, తఱువాత.

కర్ణ: అమ్మా; అంతట ఉజ్జయినీపురమండలి ప్రజలందరు బరు వంతయు నొకప్రక్క కొరిగిన పెద్దపడవవలె రాజవీధిలో గుమిగూడి, "కర్ణపూరక, మంచిపని చేసితివి సెబాస" అని నన్ను మెచ్చుకొన జొచ్చిరి. వారిలో నొకమహానుభావుడు దన మేనెల్ల దడవికొని యాభ రణ శూన్యమై యుంట కాబోలు, నొక్క నిట్టూర్పు విడిచి, తనపై నున్న యుత్తరీయమును నా మేనం గప్పెను.

వసం: కర్ణపూరకా; ఆయన యెవరో యెఱుంగుదువా? ఆ యుత్తరీయము జాజిపూవులవాసనల గ్రుమ్మరించుచున్నదా లేదా?

కర్ణ: అమ్మా; మదగజగంధముచే నేనా సౌరభమును దెలిసికొనజాలకున్నాను.

వసం: దానిపై పేరు లిఖించి యున్నదేమో చూడుము.

కర్ణ: ఇదిగోనమ్మా; నీవే చదువుకొనుము.

వసం: (చదివి) పూజ్యులు చారుదత్తుగారిదే. (మురియుచు పైన గప్పుకొనుచున్నది.)

మద: కర్ణపూరకా; యీ యుత్తరీయము యీమె మేని కెంతశోభ గూర్చినది.

కర్ణ: ఔను. మిక్కిలి శోభించుచున్నది.

వసం: కర్ణపూరకా; ఇదిగో నీకు పారితోషికము. (అని యొక నగ నిచ్చును.)

కర్ణ: (శిరసావహించి చైకొని నమస్కరించి) అమ్మా; ఇప్పుడు మీకీ యుత్తరీయము మఱింత సొగసు గూర్చుచున్నది.

వసం: కర్ణపూరకా; చారుదత్తుడుగారీసమయమున నెక్కడ నుందురు?

కర్ణ: ఇప్పుడీ త్రోవనే యింటికి వెళ్ళుచున్నారు.

వసం: మదనికా; మేడమీద వసారాలోనుండి చారుదత్తుడుగారిని చూతము రా.

జూదకర సంవాహకమను ద్వితీయాంకము

సమాప్తము

# మృచ్ఛకటికము

## తృతీయాంకము

( అంతట చేటుడు ప్రవేశించుచున్నాడు. )

( తనలో ) యజమానుడు పరిజనులయెడ దయగలవాడైన పక్షమున నాతడు బేదవడియును, సుజనుడని బొగడొందును. లోభి విభవము గలవాడయ్యును నిష్కరుణుడగుటచే గర్విష్ఠుడగును. మఱియు నట్టివానిని సేవించుట దుష్కరము.

దొంగమేత మేయు నాబోతును, పరస్త్రీల వెంటాడు పురుషులను, జూదమం దనురక్తిగలిగిన నరులను వారింప నేరికిని శక్యము కాదు. సహజ దోషముల నెవ్వరును మానుపజాలరుగదా !

చారుదత్తుడుగారు సంగీతము వినుటకై పోయి యెంతసేపైనది. ఇప్పుడు నిశీథ మతిక్రమించినది. ఇంకను రాలేదు. ఆయన వచ్చువరకు వీధి నడవలో కొంచెముసేపు పరుండెదను.

( అంతట చారుదత్తుడు, విదూషకుడు ప్రవేశింతురు. )

చారు : ఓహో ! రేభిలుని సంగీత మెంతమధురముగ నున్నది. వీణ యనగా సాగరంబున జనియింపని రత్నమేగదా ! వీణ విరహులపాలిటి ప్రియవయస్య. ఏకాంతమున వినోదము గలుగజేయు నెచ్చెలి. కాముకుల స్వస్థత గలిగించు ప్రియతమ. గృహస్థుల కనురక్తిని పెంపొందించు దివ్యౌషధము.

విదూ : ఇంక నావిషయమును గట్టిపెట్టి యింటికి బోవుదము రమ్ము.

చారు : మిత్రుడా ; రేభిలుడు నేడెంత సొగసుగా పాట పాడినాడు. నీకు సంతృప్తిగ లేదూ ?

విదూ : ఆడుది సంస్కృతము చదివినను, మగవాడు సంగీతము పాడినను, నాకు పట్టరాని నవ్వు వచ్చును. ఆడుది సంస్కృతము చదివిన ముక్కుకు క్రొత్తగా తాడుపోసిన యొంటి యీత ఆవుపెయ్యవలె సూ, సూ, యనుచు పురుషుడు కాతలీగీతము పాడిన వాడిన పూలదండలు వేసికొని వృద్ధ పురోహితుడు మంత్రములు చదివినట్లుండును. ఈ రెండును రుచింపవు.

చారు : వయస్యా ! నేటి రేభిలుని పాట చక్కగా నున్నదే. నీకు నచ్చలేదా ? మధురమై, సువ్యక్తమై భావాన్వితమై, లలితమై, మనోహరమై, పాట రక్తికట్టినది. సాహిత్యముగూడ చక్కగ నున్నది. ఆతనిం జూడకున్నచో స్త్రీ చాటుననుండి పాడుచున్నదా యని మదికి దోచుచున్నది. ఆతని కంఠస్వర మాతంత్రీ స్వనముతో మేళగించినది. స్వరప్రచారములు, వర్ణనలు, మూర్ఛనలు, మంద్ర, మధ్యమ, తారలదశలను దెల్పి, రాగము లవలీలగ రుచికరముగ మధ్యమధ్య రెట్టించి కడుశ్రావ్యముగ పాడుచు, మదికి మిగులహాయిని గూర్చినాడు. పాట ముగిసినను యిప్పటికిని వీనుల బడుచున్నట్లే యుండెను.

విదూ : మిత్రమా ; అంగడివీధుల యందును, బాటల యందును, కుక్కలుగూడ సుఖముగ నిద్రించుచున్నవి. కావున నిక యింటికి బోవుదము. ( ముందు చూచి ) వయస్యా ; అదెచూడుము ;

భగవానుడు శీతమయూఖుడు, అంధకారమునకు గూడ తావీయ దలచిన ట్లాకాశ హర్మ్యమునుండి క్రిందకు దిగుచున్నాడు.

చారు: మిత్రమా? నీవు లెస్సగాచెప్పితివోయీ; చీకటికి దావొసంగదలచి యున్నతరేఖయై పడమట గ్రుంకుచుండ నీటమునిగిన వనగజ దంతమోయన నొప్పుచుండెను.

విదూ: ఇదే మన యిల్లు (తలపు కొట్టి) వర్ధమానక, వర్ధమానక, తలుపు తెరువుము.

చేటుడు: మైత్రేయుడుగారి కంఠస్వరమువలె వినబడుచున్నది. చారుదత్తుడుగారుకూడ వచ్చియుందురు. తలుపు తీసెదను (అట్లుచేసి) అయ్యా; నమస్కారములు. మైత్రేయుడుగారికి దండములు. ఇక్కడ నాసనము పరచియున్నది. మీ రుభయులు గూరుచుండుడు.

(ఇద్దఱు గూర్చుందురు)

మైత్రే: వర్ధమానక; రదనికను బిలువుము. పాదములు కడుగ వలయును.

చారు: (దయతో) వలదు. నిదురించువారి నేల లేపవలెను?

వర్ధ: మైత్రేయుడుగారూ, నేను నీళ్ళు తెచ్చెదను. మీరు కాళ్ళు కడుగుడు.

మైత్రే: (కోపముతో) మిత్రమా; చూచితివా, యీ మూర్ఖుడు నీళ్ళు తెచ్చి పోయునట బ్రాహ్మణుడనైన నేను కాళ్ళు కడుగవలయునట.

చారు: ఓయీ; నీవే యుదకము తెమ్ము. వర్ధమానకుడు కాళ్ళు కడుగును.

వర్ధ : మైత్రేయుడుగారూ, ఇదిగో జలము

(మైత్రేయుడు నీళ్ళుపోయగా వర్ధమానకుడు కాళ్ళు కడుగును)

చారు : వర్ధమానకా ; యీ బ్రాహ్మణునకుగూడ పాదోదక మిమ్ము.

మైత్రే : నాకు బాదోదక మేల ? దెబ్బలుదిన్న గాడిదవలె మరల నేలపై బొర్లాడవలసినదే గదా ?

వర్ధ : అయ్యా ; మైత్రేయుడుగారూ మీరు మాత్రము బ్రాహ్మణులు గారా ?

మైత్రే : పాములలో బురదపామున్నది. బ్రాహ్మణులలో నేనున్నాను.

వర్ధ : మైత్రేయుడుగారూ ; ఎట్లయిన నేను మీపాదములను గడుగుదును. (అట్లుచేసి) ఏమండీ, యీసువర్ణ భాండమును గాపాడుట పగలు నావంతు, రాత్రి మీవంతుగదా ; ఇదిగో పుచ్చుకొనుడు.

మైత్రే : (సువర్ణ భాండమునుదీసికొని) అబ్బా ! యీపాడు సువర్ణభాండ మింకను నన్ను విడువకున్నది. నానిద్రను బాడుచేయు నీనగను హరింపగలచోరుడీ యుజ్జయినీనగరమున కరువయ్యెనా ; ఓవయస్యా ; దీని నీనాలు గిండ్ల భవంతిలో నుంచెదను.

చారు : ఓయీ ; వలదు. నాలుగిండ్ల భవంతియం దుంచవలదు. ఇది వేశ్య నగ గనుక దీనిని మరల నామె కిచ్చువరకు మనము కడు జాగరూకతతో గాపాడవలసి యున్నది. కాబట్టి దీనిని నీయొద్దనే యుండనిమ్ము. (అని రేభిలుని పాటసంగతినే మరల తలంచుచుండెను)

విదూ : మిత్రుడా నీకు నిద్రవచ్చుచున్నదాయేమి ?

చారు : మరేమి? కన్నులకుఁ గానరాకయే చంచలమైన వార్ధక్యము మనుజుని సత్త్వము నపహరించి, లోబరచుకొని వృద్ధిబొందు నట్లే నిద్ర నా నుదిటినుండి కన్నులకుదిగి నాశరీరము నలుముకొను చున్నది.

మైత్రే : అట్లయిన నిద్రింతమురా ( అనిలోనికిఁ బోయి నిద్రింతురు ).

( అంతట శర్విలకుడు ప్రవేశించును )

శర్విలకుడు : ఆహా, నాశరీర బలముచేతను, శిక్షాబలముచేతను, నాకాయము సుఖముగా బ్రవేశించుటకుఁ దగినంత విశాలమైన కన్నము త్రవ్వితిని. కుబుస మూడ్చిన నాగుపామువలె నిందు బ్రవేశింతును.

( ఆకాశము వైపు చూచి సంతోషముతో )

ఆహా! నాయందనుగ్రహించిన వాడు వోలె చంద్రభగవానుడు గూడ నస్తమించుచున్నాడుగదా ; కావుననే రాజపురుషులకే భీతి గొలుపునట్లు సంచరించి పరుల యిండ్లు దోచుకొనుటలో పేరెన్నిక గన్న నన్ను కటికచీకటిరేయి కన్నతల్లివలె కాపాడుచున్నది. చెట్ల గుంపునకు దగ్గరగా కన్నము వేసి దొడ్డిలో బ్రవేశించితినిగదా ; ఇక నాలుగిండ్ల భవంతికి కన్నము త్రవ్వి లోన బ్రవేశింతును. అహా! ఈ కన్నపు దొంగతనము నీచవృత్తి యనియు, బ్రజలు గాఢముగా నిద్ర జెందుచో వారి ధనములు బ్రాణములు నపహరించుట కడు దోష మనియు లోకు లనుచుందురు. కాని పరులగొల్చి బ్రదుకుటకన్న నీ చౌర్యమే మంచిదని నాయభిప్రాయము. తొల్లి యశ్వత్థామ నిశీథమునసే గదా శత్రునాశన మొనర్చినాడు.

కావున నేనిప్పుడు కన్నము వేయుటకుఁ దగినచోటు వెదకెదను. తడిసినచోటునుత్రవ్వినపుడు శబ్దముకానిచోటును, పరుల కెరుక పడని

చోటును,కన్నము ద్రవ్వుటకుసులభమైన చోటు,చౌడులురాలుచోటు, ఇటుకలు రాలుచోటు, నాకుఁబ్రశస్తమైనవి. అందును స్త్రీజనము గనుపింపని చోటున నాకు జయముగల్గును. (చేతితోగోడతడవిచూచి) నిరంతరము యెండకెండి వానకుఁ దడియుచుండుటచేత గాబోలు నిక్కడ చౌడు రాలుచున్నది. ఇక్కడ యెలుకలు దొలుచుచున్నట్లున్నది. సెబాస్ నాకార్యము సిద్ధించినది. పూజ్యులైన కార్త్తికేయుల శిష్యులైన చోరాచార్యులవారు సెలవిచ్చిన కార్యసిద్ధి లక్షణము లిట్టివే. ఇప్పుడు నాపని యారంభించెదను. కాని కన్న మేవిధముగ ద్రవ్వుదును? పూజ్యులైన కనకదండి కన్నములు నాల్గువిధములని చెప్పియున్నారు.

అందు పండిటికె లూడదీయుట, పచ్చిటికె లూడదీయుట. మట్టిగోడ తడుపుట, బల్లకూర్పు గోడలు పగులగొట్టుట. ఇప్పుడీగోడ పండిటికలదే కావున, ఇటికల నూడదీయుదును. పద్మవ్యాకోశము, భాస్కరము, బాలచంద్రము, వాపి, విస్తీర్ణము, స్వస్తికము, పూర్ణకుంభమునను యేడువిధములైన కన్నములుగలవు. ఇప్పుడు నేను పూర్ణకుంభమను పేరుగల కన్నమునే ద్రవ్వెదను. నే నీవరకు వేసిన కన్నములను మరునాడు చూచినవారెల్ల ధనము పోయినందుకు విచారించినను, నా శిల్పమునకు మెచ్చుకొనలేదె! రే పిరుగు పొరుగునా రెల్ల మెచ్చి యానన, నే నీ సారంగమును ద్రవ్వెదను. వరదులగు కార్త్తికేయులవారికి నమస్కారము. బ్రాహ్మణులును, దివ్యలును, దేవవ్రతులును నగు కనకశక్తులవారికి వందనములు. భాస్కరనందులకు నాకై మోడ్పు. నాయందనుగ్రహించి, నన్ను బ్రధానశిష్యునిగా నంగీకరించి, యోగరచన అను దివ్యౌషధమును బ్రసాదించిన యోగాచార్యులవారికి బ్రణామము. ఈవిద్యవలననే రేలు రక్షకభటుల దృష్టిపథమునకుఁ దప్పి సంచరించుచున్నాను. దీనివలననే నా మేనికి కట్టియాయుధపు దెబ్బలును, బాధలను గల్గింపకున్నవి. (కన్నము

8

(ద్రవ్వుచు) అక్కటా ; యెంత ప్రమాదము. కొలదారము మరచి వచ్చి తిని. (కొంచె మాలోచించి) కానిమ్ము. ఇదిగో జందెమున్నదిగదా ; దీనితోనే కొలిచెదను. యజ్ఞోపవీతము బ్రాహ్మణుల కత్యంతోపయో గమైనది. అందును మావంటివారి కది మిక్కిలి యుపకరించును. ఏల నన, దీనితో కన్నము కొలువవచ్చును. నగల సీలలను ద్రిప్పవచ్చును. గట్టితలుపుల గడియల నెత్తవచ్చును. ఏవిషపుంబురుగైన నను గఱచినచో నచ్చోట కట్టు గట్టుటకుంగూడ పనికివచ్చును. దీనితో కొలిచి కన్నము వేయుట కువక్రమింతును. (అట్లు చేసి చూచి) ఇంక నొక యిటుక వరుస త్రవ్వవలసియున్నది. అయ్యో ; యెంతకష్టము. నన్ను పాము కఱచినది. (అని జందెముతో వ్రేలికి గట్టుగట్టినాడు.)

(విషపు బాధ పడుచు చికిత్స చేసికొని) కొంచెముబాధ తగ్గినది. (మరల కన్నము ద్రవ్వి చూచి) ఓహో లోపల దీపము వెలుగు చున్నదే. ఈకన్నమునుండి లోపలనున్న దీపపుకాంతి చీకటిరాత్రి వేళ గీటురాతిమీది బంగారు గీతవలె మెరయుచున్నది. (మరల కన్నము ద్రవ్వి) నాపని పూర్తియైనది. ఇక లోన బ్రవేశించెదను. కాదు, కాదు. ముందుగా కన్నములోనుండి తొంగి చూచెదను. (అట్లుచేసి) ఇచ్చట నెవ్వరును లేరు. కార్తికేయులవారికి నమస్కారము. (లోపల బ్రవేశించి చూచి) ఇచ్చట నిరువురు పురుషులు నిద్రించుచున్నారు. కానిమ్ము. ముందుగా నా రక్షణకొఱకు తలుపు తెరచి యుంచుకొం దును. (అట్లు చేయబోయి) అయ్యో ; యీయిల్లు ప్రాతదగుటచే దలుపు కిఱ్ఱుమనుచున్నది. ఇక్కడ నీళ్ళున్నవేమో (ఇటునటు చూచి) ఇవిగో నీళ్లు. (చల్లును) ఇది క్రిందబడిన చప్పుడగునేమో (అని తలుపు వీపు కానించి తెరచి) ఇక వీరు గాఢముగా నిద్రించుచుండిరో, మెలకు వగా నుండిరో పరీక్షించెదను. (భయముతో చూచి) వీరు నిజము

గానే నిద్రించుచున్నారు. శ్వాసపు గుఱక సమానాంతరముగ నెచ్చు తగ్గులు లేక వెలువడుచున్నది. దృష్టి చలించుటలేదు. కంటి పాపలు స్తిమితముగ నున్నవి. నిద్రాపారవశ్యముచే నవయవము లవశములై శయ్య నతిక్రమించి యిచ్చవచ్చిన తీరున నున్నవి. దొంగనిద్రయైనచో నెదుటనున్న దీపపుఁగాంతి సైరించునే; (అని అంతట కలయజూచి) ఓహో; ఇదిగో మద్దెల, అదిగో దర్దురము, వేరొకచో వీణ, మఱి యొకచో సితారు. అవిగో పిల్లనగ్రోవులు, యెదుట పుస్తకము లున్నవి. ఇది నాట్యాచార్యుని యిల్లు కాదుగదా! పైకి గొప్పగా కనబడగా మోసపోతిని. ఈయింటి యజమానుడు నిజముగా దరిద్రు డగునా; లేక రాజభయముచేగాని, చోరభయముచేగాని ద్రవ్యమును భూమిలో బాతిపెట్టియుండునా! అట్లయిన శర్విలకుని కది గోచ రింపకుండునా, సరే గింజలు చల్లి చూతును. (అట్లుచేసి) విత్తులు మొలువలేదు. కాబట్టి వీడు నిజముగా దరిద్రుడే. ఇంక నా దారిని నే బోయెదను.

విదూ: (నిద్రలో) ఓయీ, కన్నమువలె కనుపించుచున్నది. దొంగ లోనఁ బ్రవేశించినట్లున్నది. ఇదిగో యీ సువర్ణభాండమును బుచ్చుకొనుము. (అని కలువరించును.)

శర్వి: ఏమీ; దరిద్రునింట గన్నము వేసితినని నన్నుచూచి వీడు పరిహాసించుచున్నాడా? వీని నిప్పుడే చంపుదునా; లేక నిద్రలో యూరక పలువరించుచున్నాడా! (చూచి) ఏమీ దీపపువెలుతురులో ధగధగలాడుచున్నదది. బంగారు నగ. చిరిగిన యంగవస్త్రమున గట్ట బడియున్నది. కానిమ్ము. దీనిని నేను గైకొందును. పాపము నావలెనే దరిద్రుడైన యీ సద్బ్రాహ్మణుని సొమ్ము నపహరింపఁదగదు. కావున నేబోయెదను, వేరొకయింటికి బోయెదను.

విదూ: ఓ చెలికాడా; నీవీ సువర్ణభాండమును గ్రహింపవేని, గోబ్రాహ్మణుల గోరికకు విఘ్నము గావించినంత యొట్టు పెట్టుచున్నాను.

శర్వి: పవిత్రమైన గోబ్రాహ్మణుల కోరిక నిరాకరింపరాదు గదా; కావున నేనిప్పుడు దీనిని గైకొందును. దీపము వెలుగుచున్నదే; అయితే నాయొద్ద దీపముల నార్పుటకు నిప్పుపురుగున్నది కదా; దీని నిప్పుడు విడిచిపెట్టెదను. (అట్లుచేసి) నాచే విడువబడిన యీ భద్రపీఠ కీటకము దీపముపై గుండ్రముగా దిరిగి రెండు రెక్కలు జాడించి, ఈదీప మార్పి యెంత చీకటి చేసినది! అయ్యో; నేను మా బ్రాహ్మణకులమునకెల్ల చీకటినిఁ దెచ్చిపెట్టితినిగదా; నాల్గువేదములు నేర్చిన శిష్టుడైన బ్రాహ్మణపుత్రుడను, శర్విలకుడను బ్రాహ్మణుడను. భోగపుఁదొత్తు మదనిక గొఱకుగదా యింత యకార్యమొనరించితిని. ఇప్పు డీబ్రాహ్మణుని కోరికఁ దీర్తును. (అని సువర్ణభాండమును గ్రహింపబోయెను.)

విదూ: ఓయీ; మిత్రుడా; నీ యఱచేయి చల్లగా నున్నదేమి?

శర్వి: అయ్యో! యెంత ప్రమాదము. నీళ్ళు తగులుటచే చేయి చల్లబడినది. ఈచేయి చంకలోబెట్టుకొని వెచ్చ చేసెదను. (అట్లుచేసి సువర్ణభాండమును బుచ్చుకొను చున్నాడు)

విదూ: పుచ్చుకున్నావా?

శర్వి: బ్రాహ్మణునికోరిక త్రోసివేయరానిది గదా?

విదూ: సరకులన్నియు నమ్ముకొన్న వర్తకునివలె గుండెమీద చేయివైచుకుని సుఖముగా నిద్రించెదను.

శర్విః ఓయీ ; మహాబ్రాహ్మణా ? ఒక యేడుగాదునూ రేండ్లు ము. అక్కటా ; పణ్యాకాంత యైన మదనిక కొఱకై ణకులమునకుఁ గళంకము తెచ్చిపెట్టితిని గదా ; అట్లననేల ులినము చేసికొంటిని. ఆహా దారిద్ర్యముకంటె లోకమున మఱియొకటి లేదుగదా ; దారిద్ర్యము మానాభిమాన శింపఁజేయును. ఉచితా నుచితములను దోపనీయదు. నేను ంగియు నీపాడుపని చేసితిని. నేనిప్పుడు దీనిని వసంతసేన మదనికను బిలుచుటకై పోవుదును. (కొంచెము నడచి) ల యడుగుల సవ్వడి వినవచ్చుచున్నది. రక్షకభటులు కారు కానిమ్ము. స్తంభమువలె కదలక నిలిచియుండెదను నేను తను. నాకేమిభయము. పిల్లివలె దాగెదను. మృగము ఱుగెత్తుదును. డేగవలె పట్టుకొందును. పామువలె ప్రాకు ుక్కవలె పసికట్టుదును. నిద్రగాని, మెలకువగా నటింతును. లు పలికెదను. రాత్రిపూట వెలుగొందుదును. ఇరుకు ో ఉడుమువలె దూఱుదును. నీటిలో నోడవలె బోవుదును. గుఱ్ఱమువలె దాటుదును. పర్వతమువలె చలింపకుందును. క్షివలె మింటికెగయుదును. గ్రహించుటలోఁ దోడేలును ను. బలమున సింహమును బోలుదును. సృష్టిలో చెవుల ంలుదును.

(రదనిక ప్రవేశించి)

దనిక : వెలుపల నడవలో బరుండియున్న వర్ధమాను డగపడ ుమా ?

ర్వి : (రదనికను జూచి తనలో) దీనిం జంపుదునా ; ఛీ ! చంపదగదు పోనిమ్ము. (నిష్క్రమించును)

రదనిక : ( నడవలోనికి వచ్చి భయముతో ) అయ్యో ; అయ్యో మనయింటిలో దొంగ కన్నమువేసి పారిపోవుచున్నాడు. మైత్రేయుని లేపెదను. మైత్రేయుని లేపెదను. మైత్రేయా, లేలెమ్ము మనయింట దొంగ కన్నము త్రవ్వి పారిపోవుచున్నాడు.

విదూ : ( లేచి ) ఓసీ ; రదనికా ఏమంటివి ? చోరుని త్రవ్వి కన్నము పారిపోవుచున్నదా ?

రదనిక : చచ్చినాడా యీ వేళాకోళము చాలును, నీకు కన్నులు కనుపింపకున్నవా ? లేచి యీవైపు చూడుము.

విదూ : ఓసి పాపీ, ఏమందువు ? మనయింటికి రెండవ వాకిలి యెత్తినారా ? ఓయీ మిత్రుడా, చారుదత్తా, లెమ్ము లెమ్ము. మనయింట నెవడో దొంగవచ్చి కన్నము వేసి, పాఱిపోయినాడు.

చారు : ఓయీ, నీ పరిహాసముల కేమిలెమ్ము.

విదూ : పరిహాసము గాదోయి, కన్ను దెఱచిచూడుము.

చారు : ( లేచిచూచి ) ఆహా యీ కన్నమెంత సొగసుగా నున్నది. నడుమ విశాలముగను, పైన సన్నముగను, కుండవలె బైనుండి ఇటికెలను దీయగా గోడసందిచ్చి, దుర్జనుని స్నేహమునకు భయపడు సజ్జనుని హృదయమువలెనే పగిలిపోయెను. ఆహా ; ఏమీ యిటువంటి పనియందు గూడ యెంత నేర్పరితనము.

విదూ : ఓయీ ! చెలికాడా ఈకన్నమును క్రొత్తవాడో లేక దొంగతనము క్రొత్తగా నేర్చుకొనుచున్నవాడో త్రవ్వి యుండ వలయును. అట్లుగాకున్న నీయుజ్జయినీ నగరమున మనయైశ్వర్యమును నెఱుఁగని వారెవరు ?

చారు : పాపము, పొరుగూరి వాఁడెవడో మనయిల్లు చూచి యేదోయుండునని యూహించి, మోసపోయి కన్నమువేసి లోన

ప్రవేశించి, ధనములేమిచే మనము సుఖనిద్ర చెందితిమని తెలియక యేమియు దొరకనందున హతాశుడై పోయియుండును. పాప మతడు దనతోడి దొంగలతో "స్నార్థవాహుని యింట కన్నము వేసితిని ; యేమియు దొరకకపోయె" నని చెప్పుకొనును గాబోలును.

విదూ : ఏమీ ! ఆదొంగవచ్చినాడని కొఱకు విచారించు చున్నావా ? వాడు నీయిల్లుచూచి యేరత్న భాండమో, యేసువర్ణ భాండమో యున్నదను నాశచే కన్నము వేసినాడు. (జ్ఞప్తిదెచ్చు కొనితనలో) ఆసువర్ణభాండమెక్కడ నున్నదో ? (మరల జ్ఞప్తికిదెచ్చు కొని ప్రకాశముగా) మిత్రమా ! నీవు నన్నెప్పుడు "మైత్రేయుడు మూర్ఖుడు, తెలివితక్కువవాడు" అనుచుందువు. ఇప్పుడు సువర్ణ భాండము నీచేతికిచ్చుట మంచిపని గదా ! లేకున్న నా దొంగవాడు నాయొద్దనుండి దానిని తప్పక హరించియుండును.

చారు : పరిహాసము చాలును.

విదూ : నేనెంత మూర్ఖుడనైనను పరిహాసమునకు సమయముల నెఱుంగని వాడనుకాను.

చారు : నాకా సువర్ణభాండము నెప్పు డిచ్చితివి ?

విదూ : నీ యఱచేయి చల్లగానున్న దేమి ? అని నేను నిన్నడిగి నప్పుడే నీకిచ్చితిని.

చారు : అది యట్లేకావచ్చును. ( నలువంకలు గలయజూచి హర్షముతో ) మిత్రమా ! పోనిమ్ము మంచిపని చేసితివి. నీకొక ప్రియము చెప్పెదను

విదూ : దానిని దొంగవా డపహరింపలేదు గదా !

చారు : అపహరించెను.

విదూ : అయినచో నందు ప్రియ మేమున్నది ?

చారు : పాప మా దొంగ కృతార్థుడైనాడు.

విదూ : అది మనసొమ్ము కాదే. అది న్యాసము.

చారు : అయ్యో ! న్యాసమా ? ( అని మూర్ఛిల్లును. )

విదూ : అయ్యో ఊరడిల్లుము ఊరడిల్లుము. దొంగలెత్తుకొనిపో యినదానికి నీవేమి చేయగలవు. ?

చారు : ( తెప్పిరిల్లి ) మిత్రమా ! లోకులు యదార్థ మెఱిగి మాటాడరు. తులువలు నన్ను నిందింతురు. పేదకు గౌరవ మెట్లుండును ? ఆహా ! ఎంతకష్టము ? పాపపువిధి నన్ను సంపదలకుఁబాపి నన్ను జీవచ్ఛవముగ చేసినది. ఇప్పుడు విశుద్ధవర్తనమునుగూడ మలినము గావించినది. ఇంక నాగతియేమి ?

విదూ : చూడు దీనికి నేనొక పన్నాగము పన్నెదను. ఈసొమ్ము మీకిచ్చిన దెవరు ? పుచ్చుకొన్నవా రెవరు ? సాక్షు లెవరు ? నేనుపోయి యీవార్తను ధూతాంబగారికి విన్నవింతును.

( ప్రవేశము రదనిక, ధూతాంబ )

ధూతాంబ : చేటీ ; ఆర్యపుత్రునకును, మైత్రేయునకును శరీరమున నెక్కడను గాయములు తగులలేదు కదా !

రదనిక : అమ్మా లేదు తగులలేదు. కాని వసంతసేన యీయన కడ దాచిన సువర్ణభాండము పోయినది.

ధూతాంబ : ( మూర్ఛిల్లుచున్నది. )

రదనిక : ఊరడిల్లు మూరడిల్లుము.

ధూతాంబ : చేటీ, ఏమనుచుంటివి ? ఆర్యపుత్రున కే యపాయము రాలేదనియా, చరిత్రమున కపాయము రాకుండిన శరీరమునకుఁ

గల్గు సహాయమును గణింపనక్కరలేదు. ఇప్పు డుజ్జయినిలోని జనులం దఱు పేదరికమున నుండుటచే నార్యపుత్రుడే యీయాకార్యము నొన రించెనని చెప్పుకొందురు. హా! హతవిధీ! పేదవడిన పురుషుని యదృ ష్టములు తామరాకుమీది నీటిబిందువులవలె చంచలములుగ జేసి నీవా డుకొందువా! చేటీ ఇదిగో మాపుట్టింటివారిచ్చిన రత్నావళియొకటి నాయొద్ద మిగిలియున్నది. ఆర్యపుత్రుడు మానధనులగుట దీనిని గ్రహింపడు. కావున పూజ్యుడైన మైత్రేయునిఁ బిలువుము.

చేటి : అమ్మా! తమ యాజ్ఞప్రకారమట్లే చేసెద ( విదూష కునితో ) అయ్యా మైత్రేయా! ధూతాంబగారు మిమ్మొకసారి రమ్మని యాజ్ఞాపించిరి.

మైత్రే : ఆమె యెచ్చట నున్నారు?

రదనిక : ఇదిగో! యిక్కడనే యున్నారు. సమీపించుము.

విదూ : అమ్మా! మీకుశుభమగుగాక.

ధూతాంబ : అయ్యా నమస్కారము. తూర్పుదిక్కుమొగమై కూరుచుండుడు.

విదూ : ( అట్లుచేసి ) అమ్మా తూర్పుమొగముగానే కూరు చుంటిని.

ధూతాంబ : అయ్యా దీనిని బరిగ్రహింపుడు.

విదూ : అమ్మా ఇదియేమి?

ధూతాంబ : అయ్యా మరేమియు లేదు. రత్నషష్ఠీ వ్రతము పట్టి యుపవాసము చేసినాను. యథాశక్తి బ్రాహ్మణుని దక్షిణ యిచ్చి పూజింపవలసియున్నది. కనుక యీరత్నాలహారమును బరిగ్రహింపుము.

విదూ : ( గ్రహించి ) అమ్మా సెలవు. దీనిని మాప్రియవయ స్యున కిచ్చెదను.

ధూతాంబ : అయ్యా! మైత్రేయా! నన్ను నగుబాటు కానీ యకుము.

( అని నిష్క్రమించును )

విదూ : ఆహా! ఏమి యీమహానుభావురాలి యోగ్యత ?

( అని యాశ్చర్యపడుచున్నాడు. )

( చారుదత్తుడు మరల ప్రవేశించును. )

చారు : మైత్రేయు డెందులకో యాలసించుచున్నాడు. మన స్థిమితము చెడి యేయకార్యమునైనను చేసియుండడుగద !

విదూ : చెలికాడా; ఇదిగో వచ్చితిని. ఈరత్నావళిం బుచ్చుకొనుము.

చారు : ఇదియేమి ?

మైత్రే : అనురూపమైన అర్ధాంగి లభించినందుకు ఫలితము.

చారు : ఏమీ; నా యిల్లాలు నన్ను కనికరించినదా ? హా! ఎంతకష్టము. మందభాగ్యముచే విభవమంతయు గోలుపోయి; తుదకు స్త్రీధనము నాశించుటచే నేనిప్పుడు నిజముగా దరిద్రుడనైతిని. ధనము లేకున్న పురుషుడు స్త్రీతుల్యుడు. ధనముగల స్త్రీ పురుషునితో సమానము. కాని యొకవిధముగా నాలోచించిన నేను దరిద్రుడనే కాను. కలిమిలేములయందు సమముగా జూచు భార్యయు, కష్టసుఖముల యందు తోడగు మిత్రుడు నాకుండిరి. కావుననే అనన్యసామాన్యమైన సత్యమార్గమును గాపాడుకొనగలిగితిని.

చారు : ఓయీ; మైత్రేయా; యీ రత్నావళిని దీసికొని, వసంతసేనకడ కేగి, నామాటలుగ నిట్లనుము : " సువర్ణభాండము నా దే తును విశ్వాసముచే దానిని జూదమం దోడితిని. దానికి బదులుగ

నీరత్నహారమును గై కొనుము ” అని పలికి, యీహారము నామె కిచ్చి నీవు రమ్ము.

మైత్రే: ఆహా; మనమా సువర్ణభాండమును దింటిమా? అనుభవించితిమా? వాసనమైన చూడలేదు. తక్కువవెలగల యావస్తువునకు బదులుగ చతుస్సముద్ర సారభూతమైన యీ రత్నావళి నిమ్మందువా?

చారు: వారకాంత విలువగల యీ నగను దరిద్రులమగు మనయం దేనమ్మకమున మనయింట దాచనిచ్చెనో ఆనమ్మకమునకే యిది. ఎంత మూల్యమైనను, మన మీయవలసినదే. మిత్రుడా; నీవిక దీని నీయకున్న మన మొకరి మొగము లొకరు చూచుకొననట్లొట్టు పెట్టితిని. నీవెట్లైన నీనగ నామె కిచ్చి రమ్ము. వర్ధమానక! దొంగత్రవ్విన కన్నముఁ జూచు వేడుకచే జనులు వాకిలికడ గుంపులు గుంపులుగా కూడుదురు. నన్ను పలువురు పలుమాటలాడకుండ నీకన్నము నిటికలతో నిప్పుడే పూడ్పింపుము. మైత్రేయా! నీ వామెకడ నౌదార్యబుద్ధి జూపవలెనుసుమా!

మైత్రే: దరిద్రుడు అకృపణముగానే మెలగును.

చారు: సఖా! నేను దరిద్రుడను కానోయీ! విభవానుగతయగు భార్యయు, గష్టసుఖములకు దోడ్పడు నీవంటి మిత్రుడు నుండ నాకేమి లోటు? ఓయీ నీవు పోయి రమ్ము. నేను శుచినై సంధ్య నుపాసింతును.

( అందఱు నిష్క్రమింతురు. )

ఇది సంధిచ్ఛేదమను దృతీయాంకము

స మా ప్త ము

---

# మృ చ్ఛ క టి క ము

## చ తు ర్థా ం క ము

( అంతట చేటి ప్రవేశించుచున్నది. )

చేటి: తల్లిగారు కుమార్తె వసంతసేనకడకు బొమ్మని నాకాజ్ఞాపించినారు. అదిగో యామె చిత్తరువుపై దృష్టి నిలిపి మదనికతో నేమో మంతన మాడుచున్నది. కానిమ్ము జేరఁబోయెదను.

( పైన జెప్పినట్లు వసంతసేనయు, మదనికయుఁ బ్రవేశింతురు. )

వసంత: ఓసీ; మదనికా; యీచిత్తరు వార్య చారుదత్తునిఁ బోలియున్నదా?

మద: సరిగాఁ బోలియున్నది.

వసంత: నీకెట్లు దెలిసినది?

మద: నీచూపులు దానిమీద లగ్నమగుటచేత.

వసంత: మదనికా; వేశ్యా సహవాసముచేతనా యీ నిచ్చకపు మాటలు నేర్చితివి?

మద: వేశ్యల యింట నున్నంతమాత్రమున నందఱు నిచ్చకము లాడుదురా? వేశ్యలుమాత్ర మందఱును కపట ప్రేమను జూపుదురా?

వసంత : నానాపురుష సాంగత్యముచే వెలయాండ్రు కృత్రిమ ప్రణయమును ప్రకటింతురు.

మద : అమ్మా; నీదృష్టియేగాక, నీచిత్తమును నీచిత్తరువుపస హాత్తియుండుటకు గారణ మేమని యడుగుచున్నాను.

వసం : ఓసీ; మదనికా; సఖీజనులు నన్ను పరిహాసింతురని దాచుచున్నాను.

మద : అమ్మా; చెలు లెప్పుడును సఖీజనముల చిత్తవృత్తి ననుసరించియే యుందురు.

చేటి : (ప్రవేశించి) అమ్మా; మన రెక్కల తలుపు వాకిట యొక గవిసెన బండి కట్టి సిద్ధముగా నున్నది. కావున మిమ్ములను వెంటనే వెళ్ళుమని మీయమ్మగా రానతిచ్చినారు.

వసంత : చేటీ; ఆర్య చారుదత్తుడు నన్ను గొంపోవునా యేమి ?

చేటి : అమ్మా; ఆబండితో గూడ పదివేల బంగరు నాణెముల విలువగల నగలనుగూడ పంపియున్నారు.

వసం : ఆ పంపినవారెవరు ?

చేటి : రాజుగారి యుంపుడుకత్తె తమ్ముడు సంస్థానకుడేమో ?

వసం : (కోపముతో) పొమ్ము. నీ విట్టిమాట లికమీద నెన్నడును చెప్పకుము.

చేటి : అమ్మా అనుగ్రహింపుము. ఇది మీయమ్మగారి సందేశముగదా ?

వసం : నేనును సందేశమునకే యలిగితిని. నీపై నిగాదు.

చేటి: అమ్మా; నేను మీయమ్మగారి కేమని విన్నవింతును ?

వసం: నేను జీవింపవలయునన్న నాకెన్నడును నిట్టి సందేశ మంపవలదని చెప్పుము.

చేటి: సరే, నీయిష్టమే కానిమ్ము.

( అంతట శర్విలకుడు ప్రవేశించును )

శర్వి: రాత్రిని నిందపాలుచేసి రాజభటులతో బాటు నిదురను జయించిన నాకు సూర్యోదయమున శీతభానునకు వలె కాంతి మందగించినది. మరియు నెవ్వడేని నావైపు దేరి పాఱజూచినను, నావైపునకు వచ్చినను నేను భయపడుచున్నాను. నాయంతరాత్మ నన్ను బాధించుచున్నది. మనుజుడు తాను జేసిన పాపకార్యములఁ దలచుకొని నిత్యము శంకించుచుండును. మదనిక కొఱకుగదా యిట్టి సాహసకార్యము కావించితిని. మొదట నేనొకయింటికేఁబోవ నచట స్త్రీల సవ్వడి యైనందున నచ్చోటు విడిచి మఱియొక యింటికేగ నందు సేవకులు గాఢ గాఢలాడ నందుండి మరలితిని. మార్గమధ్యమున రక్షకభటులం జూచి యొక్కింత తడవు కొయ్యవలె నిలిచితిని. ఇట్టి వెన్నో యుపాయములతో రాత్రి తెల్లవారినది. ( అని నడచుచున్నాడు. )

వసం: ఓసీ; చేటీ; యీచిత్తరువును నాపడకటింటి సెయ్యపై నుంచి, తాళవృంతము నొకదానిం గైకొని, శీఘ్రముగ రమ్ము.

చేటి: అమ్మా; చిత్తము. అట్లే చేసెదను. ( అని చిత్రఫలకమును గైకొని నిష్క్రమించును. )

శర్వి: వసంతసేన గృహ మిదియే. లోపలకు బోయెదగాక ( ప్రవేశించి ) మదనిక నాకెట్లు గాన్పించును.

( అంతట చేత విసనకఱ్ఱతో మదనిక ప్రవేశము. )

శర్వి: ( చూచి ) అహో ఈమెయే మదనిక. ఆహా. రూపొందిన రతీదేవి. ఈమె గుణవిశేషము మదనునకుం గీర్తి దెచ్చును, మదనాగ్ని తప్తమగు నాయెడద కీమె మంచిగంధపుఁ బూతవలె చల్లదనము నిచ్చుచు హాయిని గూర్చుచున్నది. మదనికా; మదకాని.

మద: ( చూచి ) ఆశ్చర్యము; శర్విలకుడా; శర్విలకా కుశలమా? నీకు స్వాగతము. యెచ్చటనుండి నీరాక.

శర్వి: చెప్పెద నుండుము.

( ఇర్వురును గాఢానురాగమున జూచుకొందురు. )

వసం: ఏమీ; మదనిక జాగుచేయుచున్నది. ఎచటికి బోయినదో; ( కిటికీలోనుండి చూచి ) అదిగో యెవరో క్రొత్తమనుష్యునితో మంతన మాడుచున్నది. మిగుల ప్రేమాతిశయముతోడి నిశ్చలదృష్టితో యాతని యందమును ద్రావుచున్నట్లున్నది. అయిన నొకవేళ యాతడు దీనిం బెండ్లియాడి దీని దాస్యము మానుప నెంచెనేమో యని నే నూహించుచున్నాను. ఇది వీనితో చక్కగా సుఖించుగాక. యెవరికిని, నెన్నడును నిట్టివిషయమున ప్రతిబంధకము లుండరాదు. కావున నేను మదనికను పిలువబోను.

మద: శర్విలక; చెప్పుము.

శర్వి: ( సందేహముగ దిక్కులు చూచుచున్నాడు. )

మద: శర్విలక; యేల యిట్లు శంకించుచున్నావు?

శర్వి: నీతో నొకరహస్యమును జెప్పెదను. ఇందెవ్వరును లేరుగదా?

వసం: పరమ రహస్యమా; అయిన నే వినరాదు.

శర్వి : మదనికా ; వసంతసేన నిన్ను వెల యిచ్చిన విడుచునా ?

వసం : ఈసంభాషణము నన్ను గుఱించినట్లున్నదే ? కానిమ్ము. ఈకిటికీచాటుననుండి వినియెదను. ( అట్లు చేయుచున్నది. )

మద : శర్విలకా; పూజ్యురాలైన వసంతసేన నీవిషయమై యడుగగా నామె నాకు స్వతంత్రము కలదేని నాపరిజనమును వెల యడుగకయే దాస్య విముక్తులం జేయుదునని పలికె. కాని శర్విలకా నన్నామె కొలువునుండి విడిపించుటకుం జాలినంత ధనము నీ కెక్కడిది ?

శర్వి : ఓ రమణీమణీ ; నాకు నీయెడగల ప్రేముడిచేతను నా లేవడిచేతను నేనొక సాహసకార్య మొనరించితిని.

వసం : సహజ ప్రసన్నమగు నీతని యాకృతి సాహసకార్య మొనరించెనని వినుటకు భయమగుచున్నది.

మద : ఒక స్త్రీ ప్రణయమునకై రెంటిని సంశయమున నుంచితివా ?

శర్వి: రెండనగా ; నేది, యేది ?

మద : శరీరమును, చరిత్రమును.

శర్వి : ఓసీ ; మూర్ఖురాలా, సాహసకార్యములయందే లక్ష్మి నివసించునుగదా.

మద : ఓయీ, శర్విలకా ; నీవింతదనుక సచ్చరిత్రుడవు ఇప్పుడు నానిమిత్తమే దేని విరుద్ధకార్య మొనర్ప లేదుగదా ?

శర్వి : మేని నిండ నగలు ధరించి పూదీగవలెనున్న స్త్రీలజోలికి బోవను. భూసురుల విత్తమపహరింపను. పసిబిడ్డలకు హానియొనర్పను. యజ్ఞార్థము నాసింపను. నేను చౌర్యము నైనను వవినీతికార్యములను గావింపనుసుమా ? మదనికా ; వసంతసేనతో నామాటగా నిట్లు

విన్నవింపుము. అమ్మా; యిది నీమేని కాది యిచ్చి చేయించిన యలంకారము. కావున నన్ననుగ్రహించి దీనిని రహస్యముగా ధరింపుము.

మద: అలంకారము రహస్యమనియు వసంతసేనను ధరింపుమనియు చెప్పుచున్నావు. ఈ రెండును సరిపడియుండలేదు. ఏదీ యా నగ నిటు తెమ్ము, చూతము.

శర్వి: ఇదుగో; ఆ యలంకారము చూడుము. (అని సంశయముతో నామె కిచ్చును.)

మద: (నిదానించి చూచి) అయ్యా; ఈ యాభరణమును మున్నెప్పుడో చూచినట్లున్నది. ఇది మీ కెక్కడ లభించినదో చెప్పుము.

శర్వి: మదనికా; నీకు దానితోఁ బనియేమి? నీవు దానిని గ్రహింపుము.

మద: (రోషముతో) నాయందు దీమాత్రము నమ్మకము లేకున్న నన్ను సొమ్మిచ్చి యేల పెండ్లియాడదలచితివి?

శర్వి: మదనికా; యిది కోమటి వాడలో బ్రాహ్మణవర్తకుడగు చారుదత్తుని సొమ్మని యీ యుదయమున వింటిని.

(వసంతసేనయు, మదనికయు మూర్ఛిల్లిరి.)

శర్వి: మదనికా; యూరడిల్లుము. నీ విప్పు డిట్లుంటి వేమి? నీయవయవములెల్ల వివశము లయ్యెను. నీ వెడదకనులు నిలువుగ్రుడ్లు పడినవి. నీదాస్యవిముక్తి చేయనెంచిన నన్ను దయజూడుము. నీవేల యిట్లు కంపించెదవు?

మద: (ఊరడిల్లి) ఓయీ; సాహసికా; నాని మిత్తము నీవీయకార్యము గావించి యాయింట నెవ్వరినిం జంపలేదుకదా; మరెవ్వరికిని దేహమున గాయపఱుపలేదుగదా?

శర్వి : మదనికా ; భయపడినవానిని, నిద్రించుచున్నవానిని యీ శర్విలకు డెన్నడును జంపడుసుమా ; ఎవనికిని కాయము గాయ పడలేదు.

మద : నిజముగానా ?

శర్వి : నిజముగానే.

వసం : ( తెలివి దెచ్చుకొని ) అమ్మయ్యా ; బ్రతికితిని.

మద : ప్రియము.

శర్వి : ( అసూయతో ) మదనికా ; ప్రియమనగా నర్థమేమి ! మంచికులమున బుట్టి నీమీాది వలపుచే నిట్టిదుష్కృత్యము నాచరించితిని. గుణము పోయినను పరువు నిలుపుకొందును. నీవు నీనెయ్యుడనైన నన్ను విడిచి యన్యుని చేపట్టనేల ? ( సాభిప్రాయముగా ) ఆమూలాగ్రముగా బండిన ధనిక పుత్రులను మహావృక్షములు వేశ్య లనెడు పక్షులచే భక్షింపఁబడి నిష్ఫలము లగునుగదా ; ప్రేమానురాగము లింధనములుగా, కలయికలే జ్వాలలుగ నెగడెడు కామాగ్నిలో జనులు తమ యౌవనమును, ధనము నాహుతి చేయుచున్నారు.

వసం : ( చిఱునవ్వుతో ) ఏమీా ! వీని కీయసమయమున నీయుద్వేగము గల్గినది ?

శర్వి : స్త్రీలను, సిరులను నమ్మినవారు బుద్ధిహీనులు. కాంతా కనకములు నాగకన్నెలవలె వక్రముగా వర్తింతురు. పడతులపై వలపు నిల్పరాదు. వారు పురుషులను వంచింతురు. తన్ను వలచిన కాంతనే తాను ప్రేమింపవలయును. ఆరక్తిలేని స్త్రీని వదలివేయ వలయును. ఈవాక్య మెంతసమంజసముగానున్నది :

స్త్రీలు విత్త మున్నంతవరకు నవ్వుదురు, నవ్వింతురు. కాని వారు నమ్మరు. కులశీలముగల పురుషులు స్మశానకుసుమములవలె వెలయాండ్రను దరికి రానీయ దగదు.

మఱియు స్త్రీలు సముద్రపు టలలవలె మిగుల చపలచిత్తులు. సంజ కెంజాయవలె ముహూర్త మాత్రము రాగముకలవారు. పురుషులను బీల్చి, పిప్పిచేసి, ధనమును గ్రహించి లత్తుక పిడిచిన దూదివలె వారిని జులకనగ జూతురు.

ఆహా; స్త్రీలెంత చపలచిత్తులు. మనమున నొక్క పురుషుని గోరుదురు. వేరొకని యందు దృష్టినిల్పుదురు. మఱియొకనియందను రాగమును బ్రకటింతురు. ఇంకొకనికి కాయ మర్పింతురు.

ఇది యేకవి చెప్పినాడో కాని మంచి మాట.

"పర్వతశిఖరమునఁ బద్మము పుట్టదు. గుఱ్ఱములవలె గాడిదలు బరువులు మోయజాలవు. శాలిధాన్యమున యవలు పండవు. వేశ్యవాటికలో పతివ్రత యుండదు." ఓరీ; దురాత్మా; చారుదత్త హతక; నీవెంతకు లేవు (అని కొన్ని యడుగులు నడచును)

మద: (ఉత్తరీయపు కొంగు పట్టుకొని) ఓలసంబద్ధప్రలాపీ; కోపింపఁ దగనివారియెడ కోపించెద వేమి?

శర్వి: ఇందసంబద్ధ ప్రలాప మేది? కోపింపదగనివా రెవరు?

మద: ఈ యలంకారము మాయమ్మ గారిదిసుమా.

శర్వి: అయిన నేమి?

మద: ఈయాభరణము మాయమ్మగా రాయనకడ దాచ బెట్టినారు.

శర్వి: ఎందు నిమిత్తము?

మద : ( శర్విలకుని చెవిలో నేమియో చెప్పుచున్నది. )

శర్వి : ( తెల్లబోయి ) అయ్యో ; ఎంత ఘోర మొనర్చితిని. ఎండవేడిమి కోర్వజాలక విశ్రాంతికొఱ కేవృక్షము నాశ్రయించితినో చెనటినై దాని యాకులనే రాల్చివైచితిని.

వసం : ఏమీ ; ఇతడుగూడ సంతాపము నొందు చున్నాడు. ఆర్య చారు దత్తుని యిల్లని యెఱుగక దీని నపహరించి యుండును.

శర్వి : ఇప్పుడేమి చేయుట మంచిది. ?

మద : అందులకు నీవే పండితుడవు.

శర్వి : అట్లుగాదు చూడు. స్త్రీలు సహజముగనే తెలివిగల వారు. పురుషులకు శాస్త్రజ్ఞానమువలనగాని తెలివి గలుగదు.

మద : నాకు దోచినది చేయదలచినచో నీవస్తువును మరల నామహాభాగునికే సమర్పింపుము.

శర్వి : అట్లయిన నీతడు నన్ను రాజదండనమున కొప్పగించు నేమో ?

మద : చంద్రుడు డెండకాయడు.

వసం : బాగు, బాగు. మదనికా లెస్సగా జెప్పితివి.

శర్వి : ఓసీ ; మదనికా ; యీసాహసకార్య మొనర్చినందుకు నాకు విచారము గాని, భయముగానిలేదు. ఆమహానీయుని గుణములు నీవు కొనియాడనేల ; ఈపాడు పనికి నేను సిగ్గుపడుచుంటిని. మా వంటి మొండివాండ్రను రాజుమాత్ర మేమిచేయగలడు. అయినను చోరనీతి కిది విరుద్ధము. కావున వేరొక యుపాయము నాలోచింపుము.

మద : ఇదిగో మఱియొక యుపాయము.

శర్వి: ఏమిటా రెండవ యుపాయము ?

మద: నీవార్యుని సంబంధివనిచెప్పి యీనగ నామెకు సమర్పింపుము.

శర్వి: అందువలన నేమగును ?

మద: నీవు దొంగవుకావు. ఆయన ఋణము తీరిపోవును. మాయమ్మగారి సొమ్ము మరల నామెకు జేరును.

శర్వి: ఓసీ; మదనికా; ఇది మిక్కిలి సాహసకార్యము.

మద: ఇట్లు కాదేని మఱింత సాహస మగును.

వసం: మేలు, మేలు. పరిచారిక కందని యాలోచన జెప్పితివి.

శర్వి: సెబాస్; మదనికా, నిన్ననుసరించుటచేత నాదుర్బుద్ధి సుబుద్ధిగా మారినది. చంద్రాస్తమయ మగు రాత్రి యందు దారి జూపువా డెవడు ?

మద: నీవీ కామ దేవాలయమున నొక ముహూర్తకాలము నిలువుము. నేనుపోయి మాయమ్మగారికి నీరాక మెఱింగించెదను.

శర్వి: అట్లే కానిమ్ము.

మద: (వసంతసేనను సమీపించి) అమ్మా పూజ్యులైన చారుదత్తుని యొద్దనుండి యొక బ్రాహ్మణుడు వచ్చి వాకిటనున్నాడు.

వసం: ఆర్యపుత్రుని సంబంధి యని నీవెట్లు తెలిసికొంటివే.

మద: అమ్మా; మన యాత్మబంధువులనే యెఱుగనా;

వసం: (తలయూచి నవ్వి) మంచిది. అతని లోనికిం దోడ్కొని రమ్ము.

మద: చిత్తమట్లే చేసెదను. (అని పోయి) శర్విలకా; రమ్ము. మాయమ్మగారి యాజ్ఞయైనది. రమ్ము. రమ్ము. (అని యతనితో ప్రవేశించును)

శర్వి: (సమీపించి విస్మయముతో) పూజ్యురాలా; నీకు శుభ మగుగాక.

వసం: ఆర్యా; నమస్కారము ఇందు గూరుచుండుము.

శర్వి: మాయిల్లు ప్రాత దగుటచేత నీనగను దాచుట కష్టముగా నున్నది. కనుక నీవే దీనిని రక్షించుకొనుమని చారుదత్తభట్టారకుడు మీతో మనవి చేయు మని చెప్పినాడు. కాన దీని బుచ్చుకొమ్ము. (అని నగను మదనిక చేతికిచ్చి పోవుచున్నాడు)

వసం: అయ్యా; నాప్రతిసందేశమును గూడ నీవే యార్యుని కందజేయవలయును.

శర్వి: (తనలో) అక్కడి కెవరుపోవుదురు? (పైకి) ఆప్రతిసందేశమేమి?

వసం: అయ్యా; మదనికను మీరు గ్రహింపుడు.

శర్వి: అమ్మా; నాకేమియు దెలియలేదు.

వసం: నాకుఁ దెలియును. నేనే జెప్పెదను.

శర్వి: ఏమది?

వసం: ఈ యలంకారము నేపురుషుడు నీకుఁ దెచ్చియిచ్చునో యాతనికే మదనిక నిచ్చి పెండ్లిసేయుమని యార్యపుత్రుడు నాకాన తిచ్చెను. కావున నీవెను బరిగ్రహింపుము. ఈయుదంతమును నీవే యార్యునకు వినిపింపుము.

శర్వి: (తనలో) ఈమె నన్ను గుర్తుపట్టినదాయేమి ? (పైకి) సాధు, చారుదత్తా,సాధు; గుణహీనుడగు, రాజుకంటె గుణవంతుడగు దరిద్రుడు, గొప్పవాడు. కాబట్టి మనుజులెల్లరు సుగుణములకై ప్రయత్నము సేయదగును. గుణవంతునకు లోకమందసాధ్యమేదియు నుండదు. చంద్రుడు తన గుణగణము చేతనేకదా దుర్లభమగు శివుని శిరస్సు నధిరోహింపగలైను !

వసం : ఎవడురా ; అక్కడనున్న బండివాడు ?

చేటుడు : అమ్మా ; బండి సిద్ధముగా నున్నది.

వసం : చేటీ ; మదనికా ; నన్ను ధన్యురాలుగ జేయుము. నిన్ను విప్రున కిచ్చితిని; బండియెక్కుము.

మద : నన్ను విడిచిపెట్టుచున్నావా ? (అని కాళ్ళపై బడి యేడ్చును)

వసం : ఇప్పుడు నాకు నీవే వందనీయురాల వయితివి కావున పొమ్ము. బండినెక్కుము. నన్ను తలచుకొనుచుండుము.

శర్వి : మదనికా ; నీకు శుభమగుగాక. ఏదయామయికి పరిచారికవగుటచే పవిత్రమగు వధూశబ్దమును మేలి ముసుంగుగధరించితివో యాపూజ్యురాలికి నమస్కరింపుము.

(ఆ యిరువురు బండి నెక్కుచున్నారు)

ఓయీ ; ఎవరక్కడ ? (తెరలో) "ఆర్యకుడను గోపాలబాలకుడు రాజగునని సిద్ధులు చెప్పినమాటలు నమ్మి పాలక మహారాజు భీతిజెంది వ్రేపల్లెనుండి యాతని రావించి ఘోరమగు కారాగారబంధము గావించినాడు. కావున మీరందఱు మీనెలవులందు జాగరూకులై యుండుడని రాష్ట్రీయు డాజ్ఞాపించుచున్నాడు."

శర్వి: ఏమీ ; నా ప్రియమిత్రు డార్యకుని పాలకరాజు బంధించెనా ? నేనిప్పుడు కళత్రసహితుడనై యుంటినే. హా! యెంతకష్టము! కానిమ్ము. పురుషునకీ లోకమున భార్యయు, మిత్రుడు నను యిరువురే ప్రియతములు. అయినను నిట్టి సమయమున నూరుమంది సుందరీమణులకంటె మిత్రుడే ప్రియతముడు. కానిమ్ము బండి దిగుదును. ( బండి దిగును )

మద: ( కన్నుల నీరునించి చేతులు జోడించి ) ఆర్యపుత్రా ; అట్లుగాదు. నన్ను గురుజనముకడ నిలిపినపిదప నీవు పొమ్ము.

శర్వి: ప్రియతమా ; బాగు, బాగు, నీవు నాచిత్తము ననుసరించియే పలికితివి ( చేటు నుద్దేశించి ) ఓయీ ; నీవు రేభిలునియిల్లెఱుగుదువా ?

చేటుడు: అయ్యా ; ఎఱుంగకేమి ?

శర్వి: ఈ నా ప్రియురాలి నచట దిగ విడువుము.

చేటుడు: చిత్తము. తమ సెలవుప్రకారమట్లే చేసెదను.

మద: తమరు చెప్పినట్లే, మీరుమాత్ర మప్రమత్తులై సంచరింపవలయును.

శర్వి: ఇప్పుడు నేను బాహుబలసంపన్నులైన జ్ఞాతులను, విటులను, రాజావమానముచే గుపితులైన భృత్యులను సాయము చేసికొని, యౌగంధరాయణు డుదయనుని విడిపించినట్లు నామిత్రుని బంధవిముక్తునిం జేసెదను. రాబోవు కీడు శంకించి నామిత్రునెవడు బంధించెనో వానిం జెరబెట్టి రాహుముఖమునుండి చంద్రునివలె నీయార్యకుని విడిపించెదను. ( అని నిష్క్రమించును )

చేటి: ( ప్రవేశించి ) అమ్మా ; నీవదృష్టవంతురాలవు ఆర్యచారుదత్తు డంపగా నొక బ్రాహ్మణుడు ద్వారముకడ నున్నవాడు.

## చతుర్థాంకము

వసంత : ఆహా! నేఁడెట్టి సుదినమోఁగదా! చేటీ, ఆం
సగౌరవముగాఁ దోడ్కొని రమ్ము. బంధులునిగూడ ప్రవేశ పెట్ట

చేటీ : అమ్మా! చిత్తము. (అని నిష్క్రమించును)

(విదూషకుడు బంధులుడు గూడ ప్రవేశింతురు.)

విదూ : ఓహో; ఆశ్చర్య మాశ్చర్యము. తొల్లి రాక్ష
జైన రావణుడు చిరకాలము తపఃక్లేశమునొంది సంపాదించిన
కవిమానము నెక్కి సంచరించువాడు. బ్రాహ్మణుడనైన నే
క్లేశము లేకయే సుఖముగా నరనారీ జనముతో దిరుగుచున్నా న

చేటీ : అయ్యా, ఇదుగో మాగృహద్వారము చూడుడు

మైత్రేయుడు : అహో! యీవసంతసేన యింటి సింహ
మెంత రమణీయముగ నున్నది. ముంగిలి దుడిచి, కలియం
పచ్చనిరంగుబూసిరి. వివిధములగు పూవులతో నలంకరించినట్లు
రువుల పగిది ముగ్గు లిడిరి. దీనిశిఖరము దలయెత్తి వేడుకతో
శమును జూచుచున్న ట్లెత్తుగానున్నది సురగజము తొండమువలె
మూడు పేటలుగా గూర్చిన మల్లెపూలదండలు ముత్యాల చేర
వ్రేలాడుచున్నవి. నిడుపైన దంతిదంతపుఁదోరణము లెంతసొం
నున్నవి. రతనపు కాంతుల వెదజల్లు సౌభాగ్య పతాకలు 
వశమున నట్టిటు కదలుచు, అంచులను చేతులతో నన్నిటు 
మ్మని సైగచేయు చెలువుదోచెడు. తోరణములుగట్టిన స్తం
యరగు కిరువైపుల పచ్చని క్రొమ్మావిచిగుళ్ళచే నలంకరిం
స్ఫటికంపు మంగళకలశము లెంతయు మనోహరముగా నున్నది.
రాక్షసుని రొమ్మువలె విశాలమై దుర్భేద్యమై వజ్రములు
యీబంగారు రెక్కలతలుపు లెంతమనోజ్ఞములు! నిరుపేదల మ

్రములు కాయాసకరము. దారిబోవు మనుజుల మనసులనుగూడ నాకర్షింపఁజాలిన దీనిసొబగు నెంతనివర్ణింతును!

చేటీ: అయ్యా; రండు, రండు, ఇదిగో ఇది మొదటి ముంగిలి.

మైత్రే: (చూచి విస్మయముతో) ఇచ్చటకూడ చంద్రునివలె, శంఖముపగిది తామరతూడుల కైవడిని తెల్లనిపిండి ముగ్గులు పెట్టినారు. వివిధ రత్నములచే జెక్కబడిన బంగారు మెట్లుగల మేడలు ముత్తెపుసరులతో విరాజిల్లుచు స్ఫటిక వాతాయిన ముఖంబుల నుజ్జయినీనగర సౌందర్యమును జూచుచున్నట్లున్నది. ఇచ్చోట ద్వారపాలకుడు శ్రోత్రియునివలె, సుఖాసీనుడై నిద్రించుచున్నాడు. పెరుగుతో గలిపిన వరియన్నముల కలవాటు పడిన కాకులు సున్నముతో సమానమైన రంగుగలిగిన బల్యన్నమును ముట్టుటలేదు. చేటికా దారి చూపుము.

చేటి: అయ్యా; ఇది రెండవయంగణము

విదూ: (ప్రవేశించి చూచి) ఈరెండవ వాకిట బలిసిన బండియెద్దులు తినుచున్న పచ్చికను వాని సంరక్షకులు పోవుచేయుచున్నారు. వాని కొమ్ములకును నున్నుకై నూనె రాయుచున్నారు. ఈ దున్నపోతు లవమానము జెందిన సత్కులీనులవలె నిట్టూర్పు నిగుడ్చుచున్నవి. యుద్ధమునకు వెడలిన మల్లునివలె మేకమెడను మర్దించుచున్నారు. ఇదిగో యిక్కడ గుఱ్ఱముల మెడమీద జూలును దువ్వుచున్నారు. ఈగుఱ్ఱపుసాలలో నొక వానరము దొంగవలె బంధింపబడియున్నది. కమ్మని నేతితో గలిపిన యన్నపుముద్దలను మావటీంద్రండందీయ యేనుగు అందుకొనుచున్నది. చేటీ; లోపలకు, గొనిపొమ్ము.

చేటీ: అయ్యా; రమ్ము యిది మూడవ మొగసాల. ఇందు విచ్చేయుము.

మైత్రే : (ప్రవేశించి) ఔరా ; ఈమూడవ మొగసాల యందు దమేమని చెప్పుదును. ఇచ్చట సత్కుల ప్రసూతులగు పురుషులు కూరుచుండుటకుఁ దగిన యాసనము లమర్పబడి యున్నవి. రతనాల గోరువంకలు గల వ్యాసపీఠమున సగము చదివి విడిచిన కామశాస్త్ర గ్రంథమున్నది. సంధివిగ్రహచతురులైన వృద్ధవిటులు, వేశ్యలు, పలు రంగులతో చిత్రింపబడిన చిత్తరువుల చేతబట్టుకొని, తిరుగుచున్నారు. ఏదీ ముందుకు పద.

చేటీ : అయ్యా ; ఇటురమ్ము. ఇదినాలవ ప్రకోష్ఠము.

విదూ : (ప్రవేశించి చూచి) ఓహో ; ఏమీ నాల్గవముంగిలి యందము. యువతులు చేతులతో వాయింపగా మద్దెలలు మోగుచున్నవి. పుణ్యమునశింప, నేలరాలిన చుక్కలవలె కంచుతాళములు మెరయుచున్నది. మురళీనాదము తుమ్మెదల మ్రోతవలె శ్రావ్యముగా వినవచ్చుచున్నది. పొలయలుక బూనిన పూబోడి చందమున వీణను దొడపై నిడుకొని కొనగోళ్ళతో బుజ్జగించుచున్నారు. అదిగో మఱియొకచో, బూదేనెలఁగ్రోలి మత్తిల్లిన యాడు తుమ్మెదలపగిది బోగపుఁ బిల్లలు మధురముగా బాడుచు నృత్యము జేయుచున్నారు. శృంగారరస ముప్పతిలునట్లు నాట్య మాడుచున్నారు. వీరు దాహాము ద్రాగుటకై జలకలశములను కిటికీలయందుంచిరి. అవి గాలికిఁ జల్లనై పానయోగ్యములై యున్నది. సరే చేటీ పైనడవలోనికి బోదము రమ్ము.

చేటీ : అయ్యా ! ఈవైపునకు రమ్ము. ఇది యైదవ చత్వారము.

విదూ : (ప్రవేశించి చూచి) ఆహా ; యీయైదవ ప్రకోష్ఠమెంత యింపుగా నున్నది. ఇంగువనూనె పోగుపుల సువాసనలు పేదవారి కాశ గొల్పుచున్నది. రాత్రింబవ ళ్ళెడతెగని యగ్నితప్తమగు

నీవంటశాల వివిధవాసనల పొగల నెపమున ద్వారముఖములచే వెచ్చ నూర్చు చుండెనోయన నుండెను. వివిధవంటకముల వాసనలు నన్ను నోరూర జేయుచున్నవి. ప్రాతగుడ్డ పీలికవంటి మేకకడుపులోని తిత్తిని కటికి పిల్లవాడు కడుగుచున్నాడు. వంటలవాడు పలువిధములైన శాక ముల సమకూర్చుచున్నాడు. మోదకములు చేయుచున్నాడు. అప్ప ములు వండుచున్నారు. (తనలో) ఇప్పుడు నన్నిందలి వారెవరైన "రండు, భుజింపు"డని పిలిచి కాళ్ళు కడుగుకొనుటకు నీళ్ళిచ్చిన నెంత బాగుండును. ఇందు గంధర్వాప్సరోంగణములవలె వివిధాలంకార శో భితలైన వేశ్యాజనమును, బంధులును, సంచరించుచున్నారు. నిజముగ నీగృహము స్వర్గలోకమును మించియున్నది. బంధువులనగా మీరెవరు?

బంధు: పరపురుషాను రక్తలగు పరభార్యలయందు జనియిం చితిమి. మాభుక్తిపరాన్నము. పరులధనములే మాధనములు మా కాపురము పరుల గృహములయందే ఆర్యుల కవాచ్యులమై యేను గులవలె నేచ్ఛగా తిరుగుచుందుము.

విదూ: చేటీ; ఎచ్చటికిఁ బోవలయును.

చేటీ: అయ్యో; ఇటురండు.

విదూ: (ప్రవేశించిచూచి) రంగురంగుల మెఱయు రత్నపుఁ దోరణంబు లింద్రనీలము లకుఁ గట్టబడి యింద్రధనస్సును దలపించు చున్నది. నానాగాంత్రైన శిల్పులు వైడూర్యములు మంచిముత్యములు పగడములుఁ పుష్యరాగములు, ఇంద్రనీలములు, కర్కేతనరత్నములు, పద్మరాగములు, మరకతములు, మొదలగు రత్నవిశేషములను నా ణెము కట్టుచున్నారు. కొందరు కంసాలులు కట్టడపు బని సేయుచు న్నారు. కొందఱు బంగారునగలను చేయుచున్నారు. కొందఱు దార ముతో ముత్తెపుసరులు గ్రుచ్చుచున్నారు. మరికొందరు వైడూర్యము

లకు సూటిగా బెజ్జములు గ్రుచ్చు చున్నారు. శంఖములను దొలచు చున్నారు. పగడములను సానబట్టు చున్నారు. పడికుంకుమ నెండబెట్టు చున్నారు. కస్తూరిని గాలికారబెట్టు చున్నారు. మంచిగంధము నధికముగాతీసి, సుగంధద్రవ్యములతో గలుపుచున్నారు. గణికాకాముకులకు గర్పూర తాంబూలము లిచ్చుచున్నారు. కొందఱు క్రీగంటి చూపులు ప్రసరించు చున్నారు. కొందఱు నవ్వుచున్నారు. కొందఱు విలాసముగా మద్యములు త్రావుచున్నారు. వీరు చేటులు. వీరు చేటికలు. ఆయెదుటనున్న పురుషులు, ఆలుబిడ్డల విడనాడి, విత్తమెల్ల వేశ్యల పాలుచేసి, వ్యర్థులైనవారు. వీరెల్లప్పుడు నిక్కడనే యుండి వెలయాండ్రు త్రాగగా మిగిలిన మదిరారసమును గ్రోలుచుందురు.

చేటీ: ఇటుపైని దారిచూపుము.

చేటీ: అయ్యా; ఇటురండు. ఇది ఏడవ యంగణము.

విదూ: (చొచ్చి చూచి) వహ్వా; ఏమి యీయేడవ మనోజ్ఞత! ఇందు విహంగవాటికలో పావురములజంట సుఖముగా గూరుచుండి పరస్పరము ముద్దుపెట్టుకొను చున్నవి పంజరములలోని చిలుకలు పెఱుగన్నము కడుపునిండతినిన బ్రాహ్మణునివలె సూక్తములు పఠించుచున్నవి. పెంపుడు గోరువంక యజమానురాలి యనుగ్రహము సంపాదించిన దాసివలె కురకుర లాడుచున్నది. వివిధములైన ఫలరసము లారగించి కషాయితకంఠముగల కోకిలదూతికవలె యాలపించుచున్నది. అనేక పంజరములు నాగదంతములకు వ్రేలాడగట్టబడి యుండెను. లావుకపిట్టలు తమలో దాము కలహించుచున్నవి. తంగుపిట్టలు పంజరములో పలుకుచున్నవి. గువ్వపిట్టలు కూడుకొను చున్నవి. (మఱియొకవైపుజూచి), ఇదిగో; పెంపుడునెమలి. వివిధమణులచే చిత్రింపబడిన యట్లున్న తన పింఛమును విప్పి నృత్యము

చేయుచు సూర్యకిరణములకు సంతసించి, యొక మేడమీాదనుండి మఱియొక మేడమీాదికి దుముకు చున్నది. ఈవంక ప్రోగుచేయబడిన చంద్ర కిరణములవలె నున్న రాజహంస మిథునము కాముకులకు నడ కలునేర్పుటకోయనునట్లు వెనువెంట దిరుగుచున్నవి. పెంపుడు బెగ్గురు పక్షులు ప్రాయముతీరన తలకట్లవలె యీావైపీవైపుగా తిరుగు చున్నవి. ఇట్లు నానాపక్షినివహముచేత నీగణిక యిల్లు నందనవనము వోలె విరాజిల్లు చున్నది. చేటీ; తరువాతదారి చూపుము.

చేటీ: అయ్యా; రండు, రండు. ఇదియష్టమప్రకోష్ఠము

విదూ: (లోన బ్రవేశించి చూచి) చేటీ. పట్టువస్త్రముల ధరించి ఎక్కువ భూషణములు ధరించి యొడలు విరుచుకొనుచు దిరుగు చున్న వాడెవరు?

చేటి: ఆయన మా యమ్మగారి సోదరుడు.

విదూ: ఎంత తపస్సు చేసి వసంత సేనకు సోదరుడై పుట్టెనో గదా? కాని వీడెంత మంచి వేషము వేసికొన్నను యెట్టిని సుగంధ ద్రవ్యములు పూసికొన్నను, యెంత యందగాడై నను, స్మశానవాటిక యందున్న సంపంగి చెట్టువలె లోకులకు మాననీయుడుగాడు. (వేరొకవంక జూచి) ఈమె యెవరు? కాళ్ళనిండ నూనె రాసుకొని అట్టచెప్పులు తొడుగుకొని పువ్వులచీర గప్పుకొని యెత్తుపీటపై గూరు చున్నది.

చేటి: అయ్యా; ఈమెయే వసంతసేన తల్లి.

విదూ: ఆహా; ఈ ముసలి పిశాచి యుదరమెంత పెద్దది. ముందుగా నీమె నీయింట మహాదేవునివలె నెలకొల్పి తఱువాతనే యీా ద్వారము నెత్తి యుండవచ్చును.

చేటి: ఓరీ; పాపాత్ముడా; ఆమె మా యమ్మగారు ఆమెకు నాల్గుదినముల కొకపరి జ్వరము వచ్చుచున్నది. ఆమెను పరిహాసింతువా?

విదూ: (పరిహాసించుచు) ఓ చాతుర్థికజ్వరమా! నేను బ్రాహ్మణుడను ఇట్టి యుపకారముచే నన్ననుగ్రహింపుము.

చేటి: ఓయీ! నీ యాశ కూల, చచ్చిపోవుదువు సుమా?

విదూ: (పరిహాసముతో) ఓసీ; దాసీ! ఇంత బానకడుపుతో బ్రదుకుటకంటెఁ జచ్చుటయే మేలు. వివిధములగు మద్యములనుఁ జెడత్రాగి, యీ యవస్థకు గుఱియైనది. ఈ ముదుసలి చచ్చినచో వేయి నక్కలకు సంతర్పణ మగును. చేటీ; యోడలు మోయగలవా?

చేటి: అయ్యా; లేదు లేదు.

విదూ: ఓసీ; నే నిప్పు డడుగబోవునది యేమనగా ప్రేమయను నిర్మల జలము గల మదన సాగరమునందు స్తననితంబజఘనములే మనోహరమైన యోడలు గదా?

ఇట్టి బహువిషయములతో గూడిన ఈ యెనిమిదవ ప్రకోష్ఠము జూడగా ముల్లోకము లిచ్చటనే యున్నట్లు దోచెడిని దీనిని వర్ణించుటకు నామాటలు చాలకున్నవి. ఇది వేశ్యాగృహమా? లేక కుబేర భవనమా యని సందియము కల్గుచున్నది. ఓసీ; మీ యజమానురాలెక్కడ నున్నది?

చేటి: అయ్యా! ఆమె యుద్యానవనమందు చెట్లగుంపు నడుమ నున్నది. అందు బ్రవేశింపుము.

విదూ: (ప్రవేశించి చూచి) ఔరా ఏమి యీ వృక్షవాటిక రామణీయకము చిత్ర విచిత్రములైన పుష్పజాతుల నిండు నాటిరి,

ఘట్టంపు చెట్లనీడ నొక తూగుటుయ్యాల తరుణీజనమునకు మొలబంటి యెత్తున గట్టిరి. మంచి రంగుగల యడవిమొల్ల శేపాలిక మాలతి మల్లె జాజి, కురవక కురువింద, మొదలగు కుసుమములు తమంత రాలుచున్నవి. దీనియందము నందన వనమును గ్రిందు జేయు చున్నది. ఇదిగో యిక్కడ నొక దిగుడు బావి యున్నది. ఇది యుదయకాలపు సూర్యుని కాంతివలె వికసించిన యెఱ్ఱదామరలు నెఱ్ఱకలువలు గలిగి సంధ్యాకాలమువలె నున్నది.

ఆహా! యీ యశోకవృక్ష మామూలాగ్రము చిగిర్చి, పుష్పించి, యుద్ధరంగమున యోధవరుని రక్తసిక్తమగు నెమ్మేను పగిదిఁ గన్పట్టుచున్నది.

సరే కానిమ్ము. మీ యమ్మగా రెక్కడ?

చేటి: అయ్యా, అటువైపు చూడుడు ఆమెయే వసంతసేన.

విదూ: (చూచి దగ్గరకుబోయి) పూజ్యురాలా! నీకు శుభ మగుగాక.

వసం: ఓయీ! మైత్రేయా! (లేచి) నీకు స్వాగతము. ఇదుగో యీ పీఠముపై నాసీనుడ వగుము.

మైత్రే: అమ్మా నీవును గూరుచుండుము.

(ఇరువురునుం గూర్చుందురు)

వసం: మీ సార్థవాహ పుత్రునకుఁ గుశలమా?

మైత్రే: అమ్మా; కుశలమే.

వసం: గుణములు చిగుళ్ళుగను, వినయము శాఖలుగను, విశ్వాసమే మూలముగను, యోగ్యత పుష్పములుగను, చేతలు ఫల

ములుగను జెలగు సత్పురుష వృక్షములను సుహృద్విహంగము లాశ్రయించుచున్నవా ?

విదూ : ( తనలో ) ఈదుష్టవిలాసిని యెంత చక్కఁగా గ్రహించి నది. ( ప్రకాశముగ ) అట్లే.

వసం : ఆర్యా, మీరాకకు గతంబేమి ?

విదూ : ఆర్య చారుదత్తుఁడు శిరమున చేతులు మోడ్చి నీకిట్లు విజ్ఞాపన మంపినాఁడు.

వసం : ఏమని యాజ్ఞాపించినాఁడు ?

విదూ : " నాయందు నీకు గల విశ్వాసముచే నీసువర్ణభాండము నాదిగా భావించి జూదములో నోడిపోయితిని. ఆసభికుఁడు రాజుగారి వార్తాహరుఁడు. అతఁ డెక్కడకుఁ బోయెనో తెలియదు. "

చేటి : అమ్మా ; నీవదృష్టవంతురాలవు. ఆర్యుఁడు జూదరిగూడ నయ్యె.

వసం : ( తనలో ) దొంగ లపహరించిన నగ నాత్మగౌరవ మును గాపాడుకొనుటకై యిట్లు జూదమం దోడిపోయినట్లు జెప్పి పంపినాఁడు కావుననే, నేనాయనను గోరుకొంటిని.

మైత్రే : అందుచే దానికి బదులుగా నీరత్నావళిం గైకొమ్ము.

వసం : ( తనలో ) సువర్ణభాండము నీతనికిం జూపుదునా !

విదూ : అమ్మా ; అయితే, మీరీ రత్నావళిం బుచ్చు కొనరా ?

వసంత : ( నవ్వి చెలివంకజూచి ) ఓయీ ; మైత్రేయ ; ఏల గ్రహింపకుందును. ( రత్నావళిం బుచ్చుకొని తనలో ) పూవులు

పలుచబడినను తియ్యమామిడిచెట్టు మకరందబిందువుల నెట్లు వర్షించు చున్నది.

(ప్రకాశముగ) అయ్యా! ఆజ్ఞాదరి చారుదత్తునితో నేనీ సాయంకాల మార్యుని జూడవత్తునని విన్నవింపుడు.

విదూ: (తనలో) ఇది యింటికి వచ్చి, యింకొకటి యిమ్మ నునా? ఇకమీాద వేశ్యా వ్యాసంగము తలపెట్టవద్దని చెప్పెదను (అని వెళ్ళును)

వసం: చేటీ; ఈ రత్నావళిం బుచ్చుకొనుము. ఆర్యపుత్రుని రంజింపజేయుటకుఁ బోవుదము.

చేటి: అమ్మా; అటు చూడుము. ఉన్నట్లుండి కారుమబ్బు లాకసమునఁ గ్రమ్ముకొనుచున్నవి.

వసం: చేటీ; ప్రియతముని జూచు వేడ్క నామనంబున మిక్కుటముగా నున్నది. కావున కారు చీకటులు గ్రమ్మినను నీరాత్రి యంతయు నెడతెగని వర్షము కురిసినను నేను లెక్కసేయను. ఓసీ; నీవీరత్నావళిం గొని వేగముగా రమ్ము.

(అని యిరువురు నిష్క్రమింతురు)

మదనికా ప్రదానమను చతుర్థాంకము

సమాప్తము



# మృచ్ఛకటికము

## పంచమాంకము

( అంతట సోత్కంఠుడై చారుదత్తు డాసనస్థుడై ప్రవేశము )

చారు : ( పైకి చూచి ) ఆహా! యేమి, ఈ అకాల దుర్దినము, పెంపుడునెమళ్ళు పురులు విప్పి తమిదీర నాట్యమాడుచున్నవి. హంసలు వగతో వలసపోవ నెంచుచున్నవి. ఈయకాల దుర్దినము మేఘావృతమై యనంతరిక్షమును వియోగుల హృదయమును గూడ నరికట్టినది.

మఱియును, నీటిచే దడిసిన దున్నపోతు కడుపువలెను తుమ్మెదల కాంతి వలెను నల్లని మేఘము మెరపనెడు మిసిమిపుట్టము ధరించి బెగ్గురుపక్షుల బారులను తెల్లని శంఖము ధరించిన త్రివిక్రమునికై వడి జగమెల్ల నాక్రమించెను.

మేఘోదరమునుండి బయలువెడలు జలధారలు కరగిపోసిన వెండితీగలవలె వేగముగా పడుచు మెరపుదీపములచే నడుమ నడుమ గాన్పించుచు ఆకాశమనెడి వస్త్రముయొక్క తెగిన నూలుపోగుల వలె గన్పట్టుచున్నవి.

వాయువేగముచే నెగఱిమ్మబడిన మబ్బు లొక్కొక్కచో కవ గూడిన చక్రవాకంబుల వలెను, మఱియొక్కచో నెగురుచున్న హంసల వలెను, వేరొక్కచో కడలియందు దిరుగు మత్స్యంబుల

వలెను, మకరములవలెను, ఒక్కొక్కచో యెత్తైన మేడలవలెను గగన వృక్షమునుండి రాలుచున్న యాకులో యన చిత్రరచనవలె శోభించుచున్నవి.

అంతరిక్షము మేఘావృతమై దృతరాష్ట్ర వక్త్ర సదృశముగ నున్నది. శిఖి దుర్యోధనుని పగిది క్రేంకరించు చున్నది. కోయిల మాయ జూదమున నోడిపోయిన యుధిష్ఠిరునివలె చిన్నపోయినది. హంసలు పాండవుల చందమున యజ్ఞాత చర్యను పొందినవి. (ఆలోచించి) మైత్రేయుడు వసంతసేన యింటికేగి చాల తడవైనది. ఇంకను రాడయ్యెనేమి చెప్పుమా.

(మైత్రేయుడు ప్రవేశించును)

మైత్రే: ఔరా; ఏమి? యీ వారకాంతల నిర్దాక్షిణ్యము జూడ నాశ్చర్యకరముగున్నది. మఱియొక సంభాషణమైన నాతో చేయలేదు. స్నేహానుసారముగ నెన్నియేని మాటలు చెప్పి తుదకు రత్నావళిని బుచ్చుకొన్నది. నన్ను కొంచెము విశ్రమింపుమని కొంచెము మంచినీరైన త్రాగుటకు నీయలేదు. ఇకమీద నెన్నడీమె మొగము జూడను. (నిర్వేదముతో) దుంపలో బుట్టని తామర తీగయు, మోసములేని కోమటియు, బంగారు నపహరింపని కంసాలియు, బోరులేని యూరి రచ్చయు, లోభికాని బోగమదియు నుండరని పెద్దలు చెప్పియున్నారు. నా ప్రియమిత్రుడైన చారుదత్తునితో జెప్పి, యీ గణికా ప్రసంగ మింతటితో మానిపింతును. ఏమీ; నా వయస్యుడు వృక్షవాటికయం దొంటరిగా గూరుచున్నాడు. అచ్చటికే బోయెద. (పోయి) అయ్యా; మీరు వర్ధిల్లుదురుగాక. మంచినీళ్లైన త్రాగుట కీయలేదే; ఇకమీద నెన్నడు యీ తొత్తుకూతురు ముఖము చూడను.

చారు: (చూచి) మిత్రుడు మైత్రేయుడు వచ్చినాడా? చెలికాడా నీకు స్వాగతము. ఇటు గూరుచుండుము.

విదూ: ఇదిగో కూర్చుంటిని.

చారు: మైత్రేయా, నీవు వెళ్ళిన పని యేమైనది?

విదూ: ఆకార్యము నష్టమైనది.

చారు: ఏమీ; ఆమె రత్నావళిని గ్రహింపలేదా?

విదూ: మన కంతటి భాగ్యమా? ఆమె నవీన మంజులమగు దోసిలి యొగ్గి వినయమున గైకొనినది.

చారు: అట్లయిన కార్యము భగ్నమైన దంటివేమి?

విదూ: ఏల భంగము కాలేదు. మన మాసువర్ణభాండమును కుడిచితిమా, అనుభవించితిమా? దొంగలెత్తుకొనిపోయిన దానికి బదులుగా చతుస్సముద్రసార భూతమైన రత్నావళి సమర్పించితివి.

చారు: మిత్రుడా; మనమటు లనరాదు. అది వెలయాలయ్యు మనలను నమ్మి నగ మనయింట దాచనిచ్చినందువలన నా యలంకార మల్పమూల్యమయ్యు, దాని విశ్వాసమునకే మనమీ రత్నావళి నీయవలసి యున్నది.

విదూ: ఓ మిత్రుడా; నా సంతాపమునకు రెండవ కారణము గూడ కలదు. సఖుల కనుసన్నలచే తన పైటకొంగు చాటు చేసికొని నన్ను పరిహసించినది. నీ పాదములమీద పడి వేడుకొనుచున్నాను. నేను బ్రాహ్మణుడను గదా; నామాట నమ్ముము. పెక్కు చిక్కులు దెచ్చిపెట్టెడు నీ వెలయాలితోడి కూటమి యిక చాలింపుము. భోగముది యనగా చెప్పులో దూరిన రాయివంటిది. నొప్పి కలిగినప్పుడైనను దాని తొలగింపవలదా? అదిగాక నో మిత్రుడా; వెలయాండ్రు,

ఏనుగు, కాయస్థుడు, సన్యాసి, వంచకుడు, గాడిద, యివి యుండు చోట కీడు కలుగును.

చారు: మిత్రమా; వేశ్యానింద నిక గట్టిపెట్టుము. నా ప్రస్తుతావస్థయే గణికా ప్రసంగము నుండి మరల్చు చున్నదిగదా;

మంచిగుఱ్ఱము ప్రాణాంత సమయమందైనను పరుగెత్త ప్రయత్నించును గాని, యడుగులు పడవు. అట్లే బీదవారికి కోరిక లెన్నైన జనించును గాని యివి మనస్సులోనే జీర్ణించును.

వేశ్యజాతి కెవడు ధనమిచ్చునో వానినే యాశ్రయించును. (తనలో) కాని వసంతసేన సుగుణహార్య (ప్రకాశముగ) ధనము మనలను విడిచినపుడే యామెను నేను వదలితిని.

మైత్రే: (క్రిందికిజూచుచు తనలో) ఇతడు నింగిని చూడ్కులు నిల్పి నిట్టూర్పులు విడుచుచున్నాడు. నేను గణికా ప్రసంగము మానుకొమ్మని చెప్పినందున యాతనికి యుత్కంఠ హెచ్చినట్లున్నది. అందుకే కామము చెడ్డదని పెద్దలు పలుకుదురు. ఓ చెలికాడా; ఆమె యీ ప్రదోషకాలమున మనయింటికి వచ్చెదనని చెప్పవున్నది. రత్నావళితో తృప్తి నొందక యింకేదైన హరించుకొని పోవుటకై యుండునని నేననుకొనుచున్నాను.

చారు: మిత్రుడా; కానిమ్ము సంతృప్తి నొంది పోగలదులే.

చేటు: (ప్రవేశించి) ఎవరక్కడ; మనుష్యులు తొలగుడు.

అయ్యో, వాన కుండ చిల్లుపడిన ట్లైడ తెరిపి లేకుండ గురియు చున్నది. నా వీపు చర్మము తిమ్మిరి యెత్తుచున్నది. చలిగాలి హోరున వీచుచున్నది. ఈస్థితిలో నాహృదయము కంప మొందు చున్నది. (వెఱ్ఱినవ్వు నవ్వి)

ఏడురంధ్రములు గల పిల్లనగ్రోవి నూదుదును. ఏడుతంత్రులు గల వీణెను మీటుదును. గాడిదలకు సిగ్గువచ్చునట్లు రాగము పాడుదును. గానమున నాకు దుంబురుడును, నారదుడును సాటిరారు.

వసంతసేన నన్ను బిలిచి "ఓయీ! కుంభీలకా, నీవు పోయి ఆర్య చారుదత్తునితో నేను వచ్చుచున్నానని విన్నవింపు" మని చెప్పినది. సరే చారుదత్తుడుగారి యింటికి బోయెదను. (కొంచెము నడచి) అదిగో చారుదత్తుడు గారు చెట్లగుంపు క్రింద గూర్చుని యున్నారు. ఆదుష్ట బ్రహ్మచారి కూడ యిక్కడనే యున్నాడు. కానిమ్ము. సమీపించెదను. అయ్యో; ఈ యుప వనద్వారము మూయబడి యున్నదే; అయిననేమి యీ దుష్టవటువునకు సంజ్ఞ చేసెదను (అని చిల్లపెంకులను విసరుచున్నాడు)

మైత్రే: ఓరీ, ఎవడురా యిక్కడ; ముండ్లకంచె వేసిన వెలగచెట్టుమీదకు రాళ్ళు విసరినట్లు నామీద చిల్లపెంకులు విసరుచున్నాడు.

చారు: ఈ తోటలోని మేడపై నున్న యరుగుమీద క్రీడించు పావురములు దొర్లించి యుండును.

మైత్రే: ఓరీ; పారావత హతక; ఉండుండు, నాచేతికట్టతో నిన్ను ముగ్గిన మామిడిపండువలె క్రింద రాలగొట్టెదనులే. (అని కఱ్ఱ చేతబుచ్చుకొని పరువెత్తును)

చారు: (జందెము పట్టుకొని యాపి) ఓ వయస్యా, కూరుచుండుము. దానితో నేమి యీపావురము పాపము తన పెంటితో కలసి సుఖముగా నాడుకొనుచున్నది.

చేటు : ఏమిది. ఇతడు పాపురమువైపు జూచుచున్నాడు. నావంక జూడనే లేదు, కానిమ్ము. మఱియొక రాయి విసరెదను.

( అట్లు చేయుచున్నాఁడు )

మైత్రే : ( దిక్కులు చూచి ) ఏమీ ; కుంభీలకుడా ? ( అని తలుపు తీయును ) ఓరీ కుంభీలకా, రమ్ము నీకిదే స్వాగతము.

కుంభీ : అయ్యా ; నమస్కారము.

మైత్రే : ఇట్టి గాఢాంధకారములో ఈ దుర్దినమున నీవెక్కడ నుండి వచ్చితివి ?

కుంభీ : ఓయీ ; యీమె వచ్చినది.

మైత్రే : ఎవరు ? ఈమె యనగా నెవతె ?

కుంభీ : ఇదిగో ఆమె

మైత్రే : ఓరీ ; మూర్ఖా ; దుర్భిక్షకాలమున బడుగు తొండుకు వలె మిన్నుచూచి యామె యామె యని యూపిరి తీయుచున్నావు.

చేటు : ఓరీ ; నీవుకూడ మహాకాముకుడైన యింద్రునివలె సుఖముగా, కా, కా, యని గువ్వవలె కూయుచుంటివేమి ?

విదూ : అదేమో చెప్పుము.

చేటు : ( తనలో ) కానిమ్ము, వీని నిపు డొకప్రశ్న యడిగెదను ( ప్రకాశముగ ) ఓరీ ; నిన్నొకటి యడిగెదను.

విదూ : నేను నాకాలును నీనెత్తిపై బెట్టుదును.

చేటు : ఓరీ ; నేనడిగెడి దానివలన తెలిసికొందువుగాని మాడుము. మామిడిచె ట్లేకాలమున పుష్పించును ?

విదూ : ఓరీ ; మూర్ఖా, గ్రీష్మఋతువున గాదటరా ?

చేటు : (నవ్వి) కాదు, కాదు.

విదూ : (తనలో) ఇప్పుడేమని చెప్పుదును. కానిమ్ము. చారుదత్తు నడిగి తెలిసికొని వచ్చి చెప్పుదునులే (అని చారుదత్తుని సమీపించి) వయస్యా; మామిడిచెట్లెకాలమున పుష్పించును?

చారు : ఓయీ, మూర్ఖా! వసంతకాలమున.

విదూ : (చేటుని సమీపించి) మూర్ఖా! వసంతమున.

చేటు : ఓరీ; నిన్నొకప్రశ్న యడిగెద. సమృద్ధములగు గ్రామములకు రక్షణ యేది?

విదూ : ఓరీ, రచ్చ.

చేటు : కాదు, కాదు.

విదూ : ఇప్పుడు దీనికి నేనేమని ప్రత్యుత్తరమిత్తును. అంతు నను చారుదత్తు నడిగెదను. (చారుదత్తుని సమీపించి) వయస్యా! సుసమృద్ధ గ్రామములకు రక్షణ యేది?

చారు : సేన.

విదూ : (చేటుని సమీపించి) ఓరీ; సేన.

చేటు : ఆ రెండింటిని కలిపి చెప్పు తొందరగా.

విదూ : సేన వసంతమందు

చేటు : త్రిప్పి చెప్పుము.

విదూ : (శరీరమును త్రిప్పి) సేన వసంతమందు.

చేటు : ఓరీ; మూర్ఖ వటుక, పదములు త్రిప్పి చెప్పుము.

విదూ : (అడుగులు త్రిప్పి వేయుచు) సేన వసంతమందు.

చేటు : అక్షరములను త్రిప్పి చెప్పుము.

విదూ: (ఆలోచించి) వసంతసేనా?

చేటు: ఆ, ఆమెయే వచ్చినది.

విదూ: అట్లయినచో మా చారుదత్తునకు నివేదించెదను. (చేరబోయి) ఓయీ; మీ ధనికుడు వచ్చినాడు.

చారు: మాయింటిలో ధనికు డెక్కడ వచ్చును.

విదూ: ఇంటికి రాకున్నను వాకిలి యందున్నవాడు, వసంత సేన వచ్చినది.

చారు: మిత్రుడా; నాతో బొంకుచున్నావా?

విదూ: నా మాట లబద్ధము లైనచో నీ కుంభీలకు నడుగుదము.

చారు: ఓయీ; భద్రా, స్వాగతము వసంతసేన వచ్చినదా?

కుంభీ: ఆర్యా; వందనము.

చారు: ఓయీ; కుంభీలక నీవు మంచివాడవు నాకు ప్రియ వచనములు చెప్పినవా రూరకపోరు. ఇదిగో నీ బహుమానము బుచ్చుకొమ్ము. (ఉత్తరీయము నిచ్చుచున్నాడు)

కుంభీ: (పుచ్చుకొని నమస్కరించి సంతోషముతో) అదిగో వసంతసేన.

విదూ: వచ్చినది. మా అమ్మగారితో చెప్పెదను.

మిత్రుడా: ఇట్టి దుర్దినమున నీమె యెందులకు వచ్చియుండును?

చారు: ఏమో నేనెఱుగను.

విదూ: నేనెఱుగుదును. సువర్ణభాండమునకంటె రత్నావళి వెల తక్కువైనదని తగవుపెట్టి యేదైన బట్టుకొని పోవుటకు వచ్చినది.

చారు: (తనలో) సంతోషించియే పోగలదులే.

( అంతట ఉజ్జ్వలమైన యభిసారికావేషముతో ఉత్కంఠితురాలైన, వసంతసేనయు, ఛత్రధారిణియు, విటుడును ప్రవేశము )

విటు : ( వసంతసేన నుద్దేశించి )

పద్మమున బుట్టని లక్ష్మియు, ననంగుని మేలిమితూపును, లగుసతులకు సంతాపజనకమును, మదనవృక్షమునకు కుసుమమును, నగునీమె తన పరిజనముతో గలసి, తన ప్రియునిపై గల కూరిమితో సంకేతస్థానమునకు నిర్భయముగ బోవుచున్నది.

వసంతసేనా, యావంక గనుంగొనుము. ప్రియ వియోగము నొందిన యబలా జన హృదయముల చందమున మేఘమాలికలీ శిఖరము నాశ్రయించి, గర్జించుచున్నవి. వానిని జూచి నెమళ్ళు పురులు విప్పుకొని మణిమయములైన తాల వృంతములచే వీచు చున్నట్లు నాట్యము చేయుచున్నవి. మఱియు,

కప్పలు బురద మొగమునిండ నీటిధారల దెబ్బలు దినుచు జలమును గ్రోలుచున్నవి. నెమళ్ళ కంఠస్వరము మెఱుగెక్కెను. కడిమి పూచెను. కులదూషణులు సన్యాసినివలె మేఘములు జందురుని గప్పెను. మెరుపులు నీచకులాంగనల కైవడి పెక్కు భంగుల చంచలము లగుచుండెను.

వసం : బావా ; నీవు చక్కగా వర్ణించితివి.

ఓసీ, నావలెను ఉన్నత పయోధరవైన నిన్ను ప్రియుడు మన్నించునే ? సిగ్గుమాలిన దాన ననుచు గర్జ నెపంబున నిన్ను దూషించుచు, ఈ రజనీలలామ సపత్నివోలె కుపితయై మార్గము నడ్డగించుచున్నట్లు దోచును.

విటు : అవును. అది యట్లే యీరాత్రిని నిందింపుము.

వసం: దుర్విదగ్ధమగు స్త్రీ స్వభావముగల నీ యుపాలంభన మేమి ప్రయోజనము. బావా; యిటు వినుము.

మేఘము లురుమనిమ్ము, వర్షము కురియనిమ్ము, పిడుగులు పడనిమ్ము, ప్రియుల గలియబోవు తరుణులు శీతోష్ణములను గణింపరుసుమా?

విటు: వసంతసేనా; ఇదియొక చిత్రము ఇటు చూడుము.

గర్జనలను పటహాములను మెరుపను కేడెమునుబూని గాలికి కదల జలధారలను శరసంచయముచే మేఘుడు బలహీనుడైన శత్రువును పుర మధ్యమున భూపతి యాక్రమించునట్లే శీతకరుని కప్పివేసినాడు.

వసం: అవునది నిజమే; ఇటువంక జూడుము.

విటు: వసంతసేనా? నీవు చెప్పినది సరిగా నున్నది. ఇది మరియొక దృశ్యము. కొంగలబారనెడు అంబరము తెల్లని తలపాగను ధరించి, మెఱుపుతీగలను చామరములతో, నాకాశము మదవారణ సారూప్యమును బొందునది వోలె విరాజిల్లుచున్నది.

వసం: తడిసిన తమాల పత్రములవంటి మేఘములు క్రమ్మగా నాకసము సూర్యుని కబళించెను. మెరుపుతీగలు కాంచన దీపములవలె సౌధాంతరములందు సంచరించు చుండెను. పుట్టలు బాణములచే నింపబడిన యేనుగులవలె జలధారలకు గరగిపోవుచున్నవి. వెన్నెల దుర్బలుడైన భర్తను పొందిన కులకాంతవలె మేఘములచే హరింపబడుచున్నది.

విటు: వసంతసేనా; ఈ వైపున చూడుము. ఈ కారు మబ్బులు మెరుపుతీగలను పగ్గములు గట్టిన యేనుగులోయన నొకదాని మించి వేరొకటి నీటిధారలను జిమ్ముచున్నవి. ఇవి చూడ

దేవేంద్రుని యానతిచే నీ ధాత్రిని వెండి గొలుసులు కట్టి పైకెత్తు కొని పోవునట్లు దోచుచున్నది.

ఇంకను, కారెనుబోతుల శరీరకాంతి వంటి నల్లని కాంతితో జలధరములు తీవ్రమైన వాయువుచే ప్రేరేపింపబడి, మెరుపుల నెడు రెక్కలతో సముద్రములో యనట మింటబరుగు లెత్తుచున్నవి. వజ్రా యుధమునుండి బాణపు గుంపులవలె నీటిధారలు పచ్చని బయళ్లతో వెలయుచు, సుగంధము వెదజల్లు నీ భూమిని జీల్చుచున్నవి.

వసం: నెమళ్ళు రమ్మని కరసంజ్ఞలు చేయ జేరబోయి బలా కలు తమ్మక్కున జేర్చి యాదరింప నతని భయముచే రాజహంసలు పద్మముల వదలి పైకి జూడ్కులు నిగుడింప మేఘములు దిక్కులకు గాటుకను బూయఁ దొడఁగెను.

విటు: వసంతసేనా; ఆ వైపున చూడుము. పద్మనేత్రములు ముకుళింప రాత్రిం దినములు భేదము తెలియక మెరుపులు దీపముల క్షణమాత్రము చీకటి పోగొట్ట, కప్పబడిన దిక్కులను మొగములుగల్దై చేతనారహితమై నీటిధార లనెడి యగారముల మహాగృహమందు మేఘము లనెడి ఛత్రములు ధరించుచు నిద్రించు చున్నట్లున్నది.

వసం: అది యట్లే ... ఇది కనుంగొనుము, గృహేషు నిత్యము దుపకారము లట్లు చుక్కలు నశించెను. వియోగినీ జనమువలె దిక్కులు కాంతి మాసెను. వజ్రాయుధమునుంచి జనించిన యగ్నిచే తప్తమై యంతరిక్షము ద్రవించి నీటిధారలై క్రిందకు జారుచున్నట్లున్నది.

ఇంకను నూతనముగా సరిదొత్తిన ఘనఘనము వలె నీమేఘములు పైకి, క్రిందకి బోవుచు, నురుముచు, పరుగులిడుచు, భూమినంతయు చీకటిగా చేయుచు ననేక రూపము లెత్తుచున్నవి.

విటు : చూచితివా? మిన్ను క్రొమ్మెరుగులచే మండుచున్నట్లును, బలాకల బారులచే నవ్వుచున్నట్లును, శరముల వర్షించు నింద్ర ధనుస్సుచేత ధరించి నటించునట్లు, వాయువుచే భ్రమించునట్లు, కల శము ధ్వనించునట్లును, నల్లత్రాచువలె నల్లనైన మేఘములచే పొగలు గ్రమ్ముచున్నట్లును దోచుచున్నది.

వసం : ఓ జలధరమా ; నీకు సిగ్గులేదా ? నా ప్రియుని యింటికి బోవుచున్న నన్ను నీగర్జనములచే భయపెట్టి, ధారాకరములచే నన్నడ్డ గించు చున్నావు.

ఓయీ ; మహేంద్రా ; నాకు నీతో పొందు మున్నెన్నడైన గలదే. ఏల యీ లీల నా ప్రియుని గలియబోవు నా మార్గము నరికట్టి వర్షపాతముచే నన్ను బాధింతువు. ఇది నీ కేటిన్యాయము ; మున్ను నీవు మాత్రము గౌతముని దారకొఱకు కోడివై యసత్య ముగ ప్రవర్తింపలేదా ; నీయట్టి ప్రేమయేగదా ; యని యెంచి నన్ననుగ్రహించి యీ వర్షపాతమును నిల్పివేయుము.

అయినను, నీవు గర్జించినను, కుంభవృష్టి గురిపించినను, పిడు గుల బరపినను, మిన్ను మన్నేక మొనర్చినను, ప్రియులం గలియం బోవు ప్రియురాండ్ర మార్గము నరికట్ట జాలవు.

ఓ విద్యుల్లలామా, పురుషులు నిష్ఠురులు కావున మేఘమును గర్జింపనిమ్ము కాని నీవు నాసాటి కాంతవయ్యు వలవంత యెరుగనట్లు నన్నేల బాధింతువు.

విటు : భవతీ ; వసంతసేనా ; నీవట్లు నిందింప బోకుము ఈశంపాలత నీ కుపకారమే యొనర్చుచున్నదిసుమా ?

ఐరావతము మెడలోని బంగారు గొలుసువలెను, పర్వతాగ్రమున నుంచబడిన శ్వేతపతాక కైవడిని, మహేంద్రుని భవనమందలి దివ్వెవలెను నీ ప్రియుని నిలయమునకు దారి చూపుచున్నది.

వసం: బావా; అదే, నా ప్రియతముని గృహము.

విటు: సకలకళల నారితేరిన నీకుపదేశింపవలసిన దేదియు లేదు, కాని, నీయందలి స్నేహప్రేరేపణచే నేను కొంత నీకుపదేశించు చున్నాను. నీ వక్కడకు వెళ్ళినపిమ్మట నెక్కువగా నలుగజనదు. కోప మెక్కువైన సుఖము సున్న, కోపము లేకున్న కాముడు కృతార్థుడు కాడు. ఒకప్పుడు నీ వలుగుము. నిన్నతడు బతిమాలుకొనును. ఒక్కతరి నీ వతని నలుగ జేయుము. అట్టితరి, నీ వతని బ్రసన్నుని జేసికొమ్ము.

సరియే కానిమ్ము. ఎవరండీ అచట; ఆర్య చారుదత్తుడుగారితో నిట్లని మనవిచేయుడు.

కడిమి పూలవాసన వెదజల్లు నీరేయి, వర్షమున మదన ప్రేరితయై, నీటిధారలచే శిరోజములు దడిసిపోయి అంబుద గర్జనల భీతి జెంది పాదములందలి నూపురములు పంకలగ్నములై యుండ తమ దర్శనార్థము వాకిట నిలచి యుండెను.

చారు: (ఆలకించి) మిత్రమా, అదేమో తెలిసికొనిరమ్ము.

విదూ: అయ్యా; నీకు సుఖమగుగాక, దేవర యాజ్ఞాపించి నట్లే యొనర్చెద (వసంతసేనల సమీపించి సాదరముగా) కుశలమా;

వసం: ఆర్యా; ఇదే ప్రణామము, మీకు స్వాగతము (విటునితో) బావా, యీ ఛత్రధారికను నీ వుపయోగించుకొనుము.

విటు: ఆహా; ఈమె యెంత చక్కగా నన్ను బొమ్మని చెప్పినది. అట్లే యొనర్తును.

భవతీ వసంతసేనా; అసత్యమునకు నిలయములై కపటమునకు దంభమునకు ఆయువుపట్టై నిరంతరము రతిసౌఖ్య మితరుల కమ్మజూపు నీ పెనుభూతములగు వేశ్యలు సుజనత్వ నిర్వహ్యముగా నితరుల వలపింతురు గాక (అని నిష్క్రమించును.)

వసం: అయ్యో; మైత్రేయ; మీ జూదగాడెక్కడ?

విదూ: (తనలో) ఆహా; ఏమి యీ ఆశ్చర్యము; ఈతనిని జూదగాడని పిలిచి యీతనికి శోభ గూర్చుచున్నది. (ప్రకాశముగా) అదిగో ఆయెండు చెట్లమాటున నున్నాడు.

వసంతసేన: అయ్యో; ఎండుచెట్ల గుంపనియెద రేమి?

విదూ: అమ్మా; అది తినుటకా; త్రాగుటకా: ఏమి ప్రయోజనము. (వసంతసేన నవ్వుచున్నది) రా రమ్మ. ఇందుల ప్రవేశింపుము.

వసం: (జనాంతికముగా) నే నక్కడకు వెళ్ళి యేమని మాట లాడుదును?

చేటి: ఓ జూదరీ; నీకీ సంధ్యాకాలము సుఖముగా నున్నదా యని యడుగుము.

వసం: అడుగలేనేమో?

చేటి: నీవడుగలేకున్నను నీ యవసరమే యడిగించును లెమ్మ.

మైత్రే: రమ్మ, ప్రవేశింపుము.

వసం: (ప్రవేశించి సమీపించి, పూవులు రువ్వుచు) జూదగాడా, యీ ప్రదోషసమయము నీకు సుఖప్రదముగ నున్నదా?

చారు: (చూచి) ఓహో; వసంతసేన వచ్చినదా; (అని సంతోషముతో లేచి) ప్రేయసీ; నేను ప్రదోష సమయములం దెల్ల

ప్పుడును మేలుకొనియే యుందును. తేలునిట్టూర్పులతో గడపుచుం డును. ఇప్పుడు నీ రాకచే యీ ప్రదోషము అత్యంత సుఖావహము పూజ్యురాలా నీకు స్వాగతము. ఇదే యీ పీఠమున గూర్చుండుము.

విదూ: చేటీ నీ విటు గూరుచుండుము.

( వసంతసేన గూర్చున్న తరువాత నందఱు గూర్చుందురు.)

చారు: మిత్రమా, అటుచూడుము, ఈమె చెవికొననుండి స్రవేలు చున్న వర్షోదకమును గురియు కడిమిపూవుచే యౌవరాజ్యమును పాలించిన రాకొమరుని చందమున ఒకానొక పయోధర మభిషేకింప బడుచున్నది. కావున వసంతసేన యుడుపులు తడిసిపోయినవి. మరి యొక జత మంచి దుస్తులను తెచ్చి యిమ్ము.

విదూ: చిత్తము.

చేటి: ఆర్యా; మైత్రేయ; నీవుండుము, నేనే యీ పూజ్యు రాలిని సత్కరింతును. ( అట్లు చేయుచున్నది )

విదూ: (చారుదత్తునితో) ఓయీ; చెలికాడా; నేనీ పూజ్యురాలి నొకవిషయమును ప్రశ్నింతును.

చారు: అట్లే కానిమ్ము.

విదూ: (ప్రకాశముగా) అమ్మా; చంద్రాస్తమయమైనను కారుమబ్బులు క్రమ్మిన కటికచీకటివేళ నీవేతెంచిన కారణమేమి?

చేటి: అమ్మా! ఈ బ్రాహ్మణుడు కడు నమాయకుడు.

వసం: కాదు కడు నిపుణుడనియే పలుకుము.

చేటి: (విదూషకునితో) ఈమె రత్నావళి వెల యెంత యుండునని యడుగుటకు వచ్చినది.

విదూ : ( చారుదత్తునితో ) నేను మొదటనే చెప్పితినిగదా. రత్నావళి వెల తక్కువ. సువర్ణభాండము వెల యెక్కువ. అందు వలన సంతృప్తి లేక వేరుగ మూల్య మడుగుటకు వచ్చినది.

చేటి: మాయమ్మగారు రత్నావళి తనదిగా నెంచి జూదమున నోడిపోయినది. ఆ జూదరి రాజుగారి వార్తాహరు డగుటచే నాతడెందు బోయెనో తెలియదు.

విదూ : మామాట మాకే యొప్పగించితివి.

చేటి : ఆ జూదగా డగుపడునంతవరకు నీ సువర్ణభాండము మీయొద్ద నుండనిమ్ము. ( సువర్ణభాండమును జూపుచున్నది.)

విదూ : ( సవిమర్శముగ జూచును )

చేటి : ఏమయ్యా ; అట్లు వింతగా జూచుచున్నావు ? నీవు దీనిని ముందెన్నడైన జూచి యుంటివా ?

విదూ : దీని పనివానితనము నా దృష్టి నాకర్షించుచున్నది.

చేటి : ఓయీ ; నీదృష్టి నిన్ను వంచించినది. కాని యా సువర్ణ భాండమే యిది.

విదూ : ఓయీ ; మిత్రమా ; మనయింట చోరు లపహరించిన యా సువర్ణభాండమే యిది.

చారు : చోరు లపహరించిన న్యాసము బదులు తీర్చుటకు మనము పూర్వ మే నెపము చెప్పితిమో యది తిరిగి మన యెడలనే ప్రయోగింప బడినది. ఇదెంత సత్యమో, యెంత కల్పనమో తెలియదు.

మైత్రే : వయస్యా ; నా బ్రాహ్మణ్యము తోడు, ఇది నిజముగా నా సువర్ణభాండమే.

చారు: మంచిది, మంచిది. ఇది మనకు మిక్కిలి ప్రియమైన విషయము.

విదూ: (రహస్యముగా) అయ్యా; ఇది యెక్కడ దొరికిన దని యడిగెదను.

చారు: అందు దప్పేమి?

విదూ: (చేటి చెవిలో యేమేమో చెప్పి) అదేనా?

చేటి: (విదూషకుని చెవిలో) అదే.

చారు: ఏమీ; మీ రిరువురే చెప్పుకొనుచున్నారు. మేము పై వారమా.

విదూ: (చారుదత్తుని చెవిలో రహస్యము చెప్పును)

చారు: కళ్యాణీ; ఇది నిజముగా సువర్ణభాండమే?

చేటి: ఆర్యా; కాకేమి?

చారు: చేటీ; నేను ప్రియ నివేదన మెన్నడును వ్యర్థము చేయలేదు. కావున నీ యుంగరమును నీవు బహుమానముగ స్వీకరింపుము.

(అని యుంగరములేని వ్రేలు జూచి సిగ్గుపడుచున్నాడు.)

వసం: (తనలో) నిన్ను కామించుటకు కారణ మిదియే గదా;

చారు: (జనాంతికముగ) అక్కటా యెంత కష్టము, ధన హీనునకు నిగ్రహానుగ్రహములు వ్యర్థములే యగును. ధనము పోయిన మనుజుని జీవితముకంటె ధనములేని వాని బ్రదుకే మేలు. రెక్కలుం లేని పక్షి, యెండిపోయిన చెట్టు, నీళ్ళెండిన సరస్సు, కోఱలు తీసిన త్రాచు, దరిద్రునితో సమానమైనవి.

శూన్యగృహము, శుష్కవృక్షము, పాడువడిన నూయి, ధనము లేని నరులు పరిచితులను గలసినపుడు వేడుక లేక తమ వృత్తాంతములను తలంచుకొందురు.

మైత్రే: మిత్రమా, నీవింతగా విచారింపదగదు. (వసంతసేనతో పరిహాసముగా) ఓ వసంతసేనా; నా యంగవస్త్రము గూడ నాకిమ్ము.

వసం: ఆర్యా; చారుదత్తా! నన్నీ రత్నావళిచే చులకన చేయుట యుచితమా?

చారు: (నవ్వుచు) వసంతసేనా; చూడు లోకము నిజమెఱుగదుగదా; నన్నెల్లవారు చులకనగ జూతురు. నన్ను జనులు విశ్వసింపరు. పేదఱికమునకును ప్రతాపమునకును నెంతదూరము?

విదూ: చేటీ; నీ విచటనే నిద్రించెదవా?

చేటి: (నవ్వుచు) మైత్రేయా; బాగ్త్రిగా నీ యమాయకత్వమును వెల్లడించుచుంటివి.

విదూ: మిత్రమా; సుఖముగా గూరుచుండిన మనలను లేవగొట్టుటకుం గాబోలు వర్షధారలతో బర్జన్యుడిటే వచ్చుచున్నాడు.

చారు: చెలికాడా; నీవు లెస్సగా జెప్పితివి. బురదలోనుండి సూది మొనలవలె వాడిగల తామరతూండ్ల యంకురములు పుట్టునట్లీ యీ కారుమబ్బులనుండి చంద్రుని వియోగమునకు నిశాకాంత యోడ్చు కన్నీరోయన వర్షధారలు పడుచున్నవి. మఱియు బలరాముడు ధరించిన నీల వసనమువంటి కారుమబ్బులనుండి సత్పురుషుల యంతరంగమువలె స్వచ్ఛములై ధనంజయుని బాణములవలె నిశితములై వర్షధారలు మహేంద్రుని ముత్తెపు గనులను వెలిజిమ్ము

చున్నవో యను నట్లుండెను. గానుగ చెట్లయాకుల రంగుచే బూయబడినట్లు కారుమబ్బులచే గప్పబడినట్టిదియును, జల్లనైనను గంధయుక్తమైన ప్రదోష వాయువులచే జలించునట్టిదియు నైన యాకసమును ప్రియతమయనురాగయుక్తయు నగు విద్యుల్లత తనకుదానై వచ్చి యాలింగనము చేసికొనుచున్నది.

( వసంతసేన శృంగారభావము నటింపుచు చారుదత్తుని కౌగలించుకొన్నది. )

చారు : (స్పర్శసుఖ మనుభవించుట నటించుచు మరల కౌగలించుకొనుచున్నాడు.)

చారు : మేఘుడా ; గంభీరముగా గర్జింపుము. నీ యనుగ్రహము వలన మదనతాపముచే నవయుచున్న నా మేను స్పర్శసుఖముచే గలిగిన గగుర్పాటుచే ననురాగయుక్తమై కడిమిపూవు నందము వహించినది.

విదూ : ఓ పాడుదుర్దినమా ఈమెను నీ మెఱుపులచే భయపెట్టుచున్నావా ?

చారు : చెలికాడా ; అట్లు నిందింపకుము. వర్షము నూరేండ్లు శతవిధములుగా కురియుగాక. వర్షధార లవిరళముగా పడుగాక. జలప్రవాహములు వందలకొలది ప్రవహించుగాక. నా యట్టివానికి దుర్లభమగు ప్రియాలింగన సౌఖ్య మబ్బినది. అంతకంటె నాకు కావలసిన దేమి ; వసంతసేనా వలచి సంజవేళ వానకు దడిసి చల్లనైన మేన్నను గల ప్రియురాలిని గలియువారే ధన్యజీవులు ప్రేయసీ ; వసంతసేనా స్తంభముల పైనున్న రాళ్ళు కదలి రాలుచున్నను వితానము ఊగులాడుచు నెట్టెటో నిలచియున్నది. శిథిలమైన వితానము నుండి జారు నీరు గోడలపై బడుటచే సున్నము కరగిపోవుచున్నది. ( పైకిచూచి ) అదిగో యింద్ర ధనస్సు, ఆ వైపు చూడుము. మెరుపు

నాలుకలతోడను, ఇంద్రాయుధమను బుజములతోడను, కారుమబ్బులను దాడలు గలిగి, యంతరిక్ష మావులించు చున్నట్లున్నది. కావున మన మిప్పుడే యభ్యంతర మందిరమున కరుగుదము. ( అని నడచుచున్నారు )

చారు : అదిగో యీ వర్షధారలు తాడిచెట్లమీద మందముగ, రాళ్లమీద తీక్ష్ణముగను, జలమునందు చండముగ తాళానుసారముగ పడుచు సంగీత వీణవలె మ్రోగుచున్నవి.

( అందఱు నిష్క్రమింతురు )

ఇది దుర్దినమను పంచమాంకము

స మా ప్త ము

---

# మృ చ్ఛ క టి క ము

---

## ష ష్ఠాం క ము

---

( చేటి ప్రవేశించును )

చేటి : మా అమ్మగారింకను నిద్రనుండి మేల్కొనలేదా ? ఆయిన నేబోయి లేపెదను ( అని వెళ్ళును )

( అంతట ముసుగులో నిద్రించుచున్న వసంతసేన ప్రవేశము )

చేటి : అమ్మా ; లెండు, లెండు. తెల్లవారిపోయినది.

వసం : ( లేచి ) రేయి గడువకయే తెల్లవారినదా ?

చేటి : మాకందఱకు దెల్లవారినది. కాని నీకు మాత్రము రాత్రియే.

వసం : చేటీ ; మీ జూదగాడేడే ?

చేటి : అమ్మా ; చారుదత్తుడుగారు వర్ధమానకునితో నేదియో చెప్పి, పుష్పకరండమను జీర్ణోద్యానమున కరిగిరి.

వసం : వర్ధమానకునితో నేమి చెప్పిరి ?

చేటి : రాత్రియే వసంతసేనకొఱకు బండి కట్టుకొని రమ్మని చెప్పిరి.

వసం : నే నిప్పు డెచ్చటకు బోవలయును ?

చేటి : చారుదత్తులుగా రున్నచోటకే.

వసం: (చేటిని కౌగలించుకొని) ఓసీ; నిన్నటిరాత్రి సరిగ జూడనైనలేదే కావున నిపుడు నా మనోహరుని, గన్నులార జూచి యానందింతునులెమ్ము. చేటీ, నే నిప్పుడు చతుశ్శాలా భవనముననే యుంటినా ?

చేటి: అవునమ్మా, మీరు చతుశ్శాలా భవనముననే గాదు. అందఱి హృదయములలో నున్నారు.

వసం: ఆర్య చారుదత్త పరిజనము పరితపింతురేమో ?

చేటి: తపింతురు.

వసం: ఎప్పుడు ?

చేటి: మీ రిటనుండి వెడలునప్పుడు.

వసం: అప్పుడైనను ముందుగా బరితపింపవలసిన దానను నేనే గదా; చేటీ; ఇదిగో యీ రత్నావళిం గైకొని మా యక్కగారైన ధూతాంబగారి కడకేగి, నా పలుకులుగా నిట్లు వచింపుము. "అమ్మా! నేను మీభర్తగారి గుణనిర్జితదాసిని. కావున మీకున్ను నేనట్లే కాబట్టి నా యం దనుగ్రహించి యీ కంఠాభరణమును స్వీకరింపుడు"

చేటి: అమ్మా; ఆర్య చారుదత్తుడు మీపై, నాగ్రహించునేమో ?

వసం: ఆయన కోపగింపడు, నీవు వెళ్ళుము.

చేటి: (నిష్క్రమించి మరల ప్రవేశించి) అమ్మా! ధూతాంబగారు మీతో నిట్లు చెప్పుమనిరి.

"అమ్మా! ఆర్యపుత్రులు నీకుం బారితోషికముగ నిచ్చిన యీ నగను గైకొనుట యనుచితము. ఆయనయే నాకాభరణ విశేషమని గ్రహింపుము"

( అంతట పిల్లవాని నాడించుచు రదనిక ప్రవేశము )

రద : బిడ్డా ; రమ్ము, రమ్ము. ఈ చిన్న బండితో నాడుకొందువుగాని.

రోహ : ( జాలిగా ) రదనికా ; నా కీ మట్టిబండి వద్దు. నాకు బంగారు బండిని దెచ్చియిమ్ము.

రద : ( విచారముతో ) నాయనా ; మనకు సువర్ణ వ్యాపార మెక్కడిది ? మరల మీతండ్రిగారి కైశ్వర్యము కలిగిననాడు బంగారు బండి చేయించుకొందువుగాని లెమ్ము. ఇప్పుడీ మట్టిబండితోనే యాడుకొనుము. అల్లదుగో వసంతసేన. అక్కడికే పోయి బిడ్డ నాడించెదను. ( అటు పోయి ) అమ్మా ; దండములు.

వసం : రదనికా నీవు సుఖముగా నుంటివా ; ఈ బాలుడెవరు ? నెమ్మేన నగలు లేకున్నను, జాబిల్లివంటి మోముచే నానందకరుడు.

రద : అమ్మా ; ఈ బాలుడు ఆర్య చారుదత్తుని కుమారుడు. వీనిపేరు రోహసేనుడు.

వసం : ( చేతులు చాచి ) బాబూ ; ఇటు రమ్ము. నన్ను గౌగలించుకొమ్ము. ( అని యెత్తి తొడమీద నుంచుకొని ) రదనికా ; రూపమున నీ కుమారు డచ్చముగ తండ్రియే సుమా ?

చేటి : అమ్మా ; రూపముననేగాదు, గుణములచేత గూడ నతడు తండ్రిని బోలినవాడు. ఇట్టి దురవస్థయందు తండ్రి యీ కుమారుని జూచుకొనియే కాలము గడుపుచున్నాడు.

వసం : అయితే, యిప్పుడీత డేమి కావలెనని యేడ్చుచున్నాడు ?

రద : అమ్మా ! ఇత డింతకుమునుపు పొరుగుననున్నవారి పిల్లవాని బంగారు బండితో నాడుకొన్నాడు. ఇప్పుడా బండిని వారు

తీసికొనిపోయిరి. ఆ బండికై యితడు పట్టుపట్టి యేడ్చుచున్నాడు. అది యెట్లు తేగలము? అందుచే నేనొక మట్టిబండి చేసి యిచ్చితిని. అది వలదని బంగారుబండియే కావలెనని యేడ్చుచున్నాడు.

వసం: అక్కటా, యెంత కష్టము; చారుదత్తుని కుమారుడు ఈ బాలుడు కూడ పరద్రవ్యముకొఱకు బాధపడు దుష్కాలము సంభవించినది.

హా! హతవిధీ! తామరాకుమీఁది నీటిబొట్లవంటి మనుజుల భాగధేయములతో నాడుకొనుచున్నావా? (కనికరముగ) బిడ్డా యేడువకుము. ఇటు రమ్ము. బంగారు బండితోనే యాడుకొందువు లెమ్ము.

రోహ: రదనికా; ఈమె యెవరు?

వసం: బాబూ! మీ తండ్రిగారి గుణనిర్జిత దాసిని.

చేటి: బాలకా; ఈమె నీకుఁ దల్లి యగును.

రోహ: రదనికా; నీ వబద్ధమాడుచున్నావు. ఈమె నిజముగా మా తల్లియేయైనచో నిన్ని నగ లెక్కడివి?

వసం: బాలకా; నీ ముగ్ధముఖారవిందము, నీ ముద్దుమాటలు జాలి గొలుపుచున్నవి. (కన్నీరునించి నగలదీసి) ఇదిగో చూడు. ఇప్పుడు నిజముగ మీ తల్లినైతిని. ఈ నగలతో బంగారుబండిని చేయించుకొమ్ము.

రోహి: నాకు వద్దు, పో, నే నీ నగలు పుచ్చుకొనను నీవేడ్చు చున్నావు.

వసం: (కన్నీళ్ళు దుడుచుకొనుచు). బిడ్డా; నే నేడువను. నీవు వీనితో బంగారుబండిని చేయించుకొమ్ము, పొమ్ము. (అని నగలను మట్టిబండిలో పడవేయును. బాలకునితో రదనిక నిష్క్రమించును)

( వర్ధమానకుడు ముసుగువైచిన బండి కట్టుకొనివచ్చుచు )

వర్ధ : రదనికా ; వర్ధమానకుడు బండి కట్టుకొని వచ్చి వాకిట నిల్చి యున్నాడని వసంతసేనతో విన్నవింపుము.

రద : (ప్రవేశించి) అమ్మా ; వర్ధమానకుడు బండినితీసుకొని వచ్చియున్నాడు.

వసం : రదనికా ; క్షణకాలము నిలువుమనుము. నే నింతలో నలంకరించుకొని వత్తును.

రద : (పోయి వర్ధమానకునితో) ఓయీ ; కొంచెమాగుము. అమ్మగా రలంకరించుకొనుచున్నారు.

వర్ధ : ఓహో ; ఈబండిలో పరపు తేమరచితిని. ఇంతలో పోయి, త్వరగా వచ్చెదను. ఇక్కడ యీ యెద్లు నిలువవేమో ; యీ బండితోనే పోయెదను. (అని పోవుచున్నాడు)

వసం : చేటీ ; ఏవీ నాయలంకార వస్తువులు. నే నలంకరించు కొనియెదను. (అలంకరించు కొనుచున్నది.)

( ఇంతలో ముసుగుబండితో స్థావరకుడు ప్రవేశము )

స్థావరకుడు : రాజశ్యాలకుడు నన్ను బట్టుకొని పుష్పకరండ జీర్ణోద్యానమునకు రమ్మని ఆజ్ఞాపించెను. కావున నే నచ్చటికే బోయెదను. (అని యెద్లను హెచ్చరించును) ఏమీ ; పల్లెటూళ్ళనుండి వచ్చు బండ్లు మార్గము నరికట్టినవి. ఇప్పుడు నేనేమి చేయుదును. ఓరీ ; దారి విడువుడు, ఒత్తిగిలుడు. ఏమనుచున్నారు ? 'ఇది యెవరి బండి యనియా' ఇది రాజశ్యాలకుడగు సంస్థానకునిబండి. కావున వేగిరము దారి యీయండి.

వీడెవడో సభికుని జూచి యప్పువడిన జూదగానివలె ముసుగుతోఁ బారిపోవుచున్నాడు. పోనీ, యెవరైననేమి? నేను త్వరగా పోవలెను. ఓరోరీ; జానపదులారా; దారి యిండు. దారి యిండు.

ఏమనుచున్నారు? (కొంచెము సేపాగి) చక్రము ద్రిప్పుమని యా. రాజుగారి బావమరిదికి బండితోలువాడను నేను మీకు చక్రము ద్రిప్పుదునా? పోనీ; పాపము వీడొంటిగా నున్నాడు, అమాయకుడు. అట్లే త్రిప్పెదనులే. ఈ బండిని చారుదత్తుడుగారి వృక్షవాటికా పక్షద్వారమున నిల్పి వచ్చెదను. (అట్లు చేసి బండివానితో) ఇదిగో వచ్చుచున్నాను.

చేటి: అమ్మా; చక్రముల ధ్వనివలె వినబడుచున్నది. బండి వచ్చినట్లున్నది.

వసం: ఓసీ; నాయుల్లము వేగిరపడుచున్నది. పక్షద్వారమునకు దారి చూపుము.

చేటి: అమ్మా; రమ్ము, రమ్ము. ఇదియే మార్గము.

వసం: చేటీ; సీవించుక విశ్రమింపుము.

చేటి: చిత్తము. (అని నిష్క్రమించును)

వసం: (కుడి కన్నదురుట సూచించి స్థావరకుని బండినెక్కి తనలో) ఏటికో నాకుడి కన్నదురుచున్నది. కానిమ్ము. ఆర్య చారుదత్తుని ముఖసందర్శనమే యీయనిమిత్తమును బరిహాసించునుగాక?

(స్థావరకుడు ప్రవేశించును)

స్థావ: బండ్లను దారినుండి తప్పించితిని. (బండి తోలుట నభినయించి) ఏమీ; బండి బరువెక్కినది. కాదు, కాదు. బండి చక్రము త్రిప్పుట వలన గలిగిన యలసటచే నట్లు తోచుచున్నది. సరే, యిక నేబోయెదను. గిత్తలారా; నడువుడు, నడువుడు.

( తెరలో ) ఓరోరీ ; దౌవారికులారా ; మీ మీ నియమిత గుల్మస్థానములనుండి కదలక యప్రమత్తులై యుండుడు. పాలక మహారాజుగారు చెరలోనుంచిన గొల్లపిల్లవాడు చెరసాలల తలుపులు పగులగొట్టి చెరనుండి తప్పించుకొని యెటకో పారిపోయినాడు. వానిని బట్టుకొనుడు. పట్టుకొనుడు.

( ఇంతలో నొంటిగాలిగొలుసు జీరాడ ముసుగుతో తొందరగా ఆర్యకుడు బరుగెత్తుకొని వచ్చుచున్నాడు. )

స్థావ : ( తనలో ) పురమంతయు నల్లకల్లోలముగా నున్నది. నేను తొందరగా బోయెదను. ( నిష్క్రమించును )

ఆర్య : కట్లు ద్రెంచుకొన్న యేనుగువలె రాజబంధనమనెడు విపత్సాగరమును తరించి సుఖముగా దిరుగుచున్నాను.

అహా ; రాజు సిద్ధుని మాటలు విని భయపడి గొల్లపల్లెనుండి నన్నురప్పించి సంకెళ్ళు వేయించి చెరలో బంధించెను. కాని, నా ప్రియమిత్రుడగు శర్విలకుని యనుగ్రహముచే చెరనుండి విముక్తుడనైతిని. ( కన్నీరు నించి ) నిజముగా నా కదృష్టమే పట్టెనేని యందు నా దోషమేమున్నది. రావలసినది వలదన్న మానునే. ఈ ఱేడు చలపాదించి నన్ను వనగజమును వలె బంధించనేల ? రాజు బలవంతుడు నే నసహాయుడను. ఏకాకిని. బలవద్విరోధము నాకేల ; అయినను నాకిప్పుడు కర్తవ్యమేమి ? మందభాగ్యుడనగు నేనెందు బోవుదును. ( ముందు చూచి ) ఇదుగో ఏ పుణ్యాత్ముల గృహమో వాకిలి తెరువబడియున్నది. ( చూచి ) ఈ యిల్లు శిథిలమై యున్నది. దూలములు విరిగిపోయినవి.–సంధులు విడిపోయినవి. పెద్దతలుపులు బీటలు వారియున్నవి. పాప మీగృహస్థుడు మనవలెనే దురవస్థలో నున్నట్లు దోచుచున్నది. ఇందు ప్రవేశింతును.

( తెరలో "హే, హే" ఎడ్లతోలు చప్పుడు )

ఆర్య: (ఆలకించి) ఏదో యొకబండి యీ వైపునకే వచ్చు చున్నది. ఇందెవరైన నున్నారా? ఇది పెద్దమనుష్యు లెక్కిపోవు గోష్ఠియానమై యుండునా? లేక యిది ముసుగు వేయబడి యుండుటచే క్రొత్త పెండ్లి కూతురును గొంపోవుటకై వచ్చియుండునా; ధనికు లూరుబయటకు పోవునదియా; ఊ; ఏదియైన నేమి యిందు పరిజనము లేక యేకాంతముగ లభించుటచే నిందు దైవము నాకొఱకే దీని నేర్పఱ్చినని తోచుచున్నది. కావున నిందు యథేచ్ఛముగా బోయెదను.

( వర్ధమానకుడు బండితో ప్రవేశించును )

వర్ధ: (తనలో) అయ్యో; ఆస్తరణము మరచివచ్చుట యొక వింతగా నున్నదే. రదనికా; బండి వచ్చినది. అమ్మగారినిఁ బిలువుము, త్వరగా జీర్ణోద్యానమునకుఁ బోవుటకు రమ్మని చెప్పుము.

ఆర్య: (విని) ఇది వెలయాలిబండి. ఊరిబయటకుఁ బోవుచున్నది. కానిమ్ము. నే నిందెక్కి పోయెదను. (బండియొద్దకు వచ్చుచున్నాడు)

వర్ధ: (శబ్దము విని) ఏమి; అందెల చప్పుడగుచున్నది. అమ్మా! యీ యెడ్లకు ముక్కుత్రాళ్ళు క్రొత్తగా పోసినాము. బెదురుచున్నది. మీరు వెనకవైపునుండి యెక్కుడు.

ఆర్య: అట్లే (యెక్కును)

వర్ధ: నూపురధ్వనులు తగ్గినవి. బండి బరువెక్కినది. కావున వసంతసేన యెక్కి యుండవచ్చును. ఇక బండి తోలెదను.

ఆబోతులారా నడువుడు. (బండి తోలుచున్నాడు.)

వీరకుడు: (ప్రవేశించి) ఓరీ; జయా, జయమానా, చందానకా, మంగళా, పుష్పభద్రప్రముఖులారా; రాజుగారి హృదయమునకు బాధ కలుగజేసి, గొల్లపిల్లవాడు బంధనమును దప్పించుకొని పారిపోవుచుండ మీరెల్లరు చూచుచు నూరకుందురా! ఓరీ, నీవు తూర్పున ప్రతోళ ద్వారముకడ నిలువుము. నీవు పడమటి గుమ్మమునొద్ద గాయుము. నీవు ఉత్తరముననను, నీవు దక్షిణమునను నుండుడు. ఈ ప్రాకారము నుండి నేనును చందనకుడును జూచుచుండెదము. చందనకా; రావోయీ యిటు పోవుదము.

చంద: (తొందరగా బ్రవేశించి) ఓరీ; వీరకా; విశల్యా? భీమాంగదా; దండకాలా; దండశూల ప్రముఖులారా, రండు. యత్నింపుడు. పరగోత్రము వాని నిందు జేరనీయకుడు. మన ప్రభువు సామ్రాజ్యమును గాపాడుడు. మఱియు, దోటలు, పేటలు, రచ్చ సావళ్ళు, అంగళ్లు, అంతిపురములు మొదలగు చోటులందేగాక మీ కనుమానమున్న స్థలములన్నియు వెదకవలెను. ఏమిరా; వీరకా; గొల్లపిల్లవాడెక్కడ నున్నాడు. వానినే చెరనుండి విడిపించిన వా రెవరు? నీవెఱిగినంతవఱకు దాచక చెప్పుము. నా చేతనైనంతవఱకు వానిని వెదకెదను. చంద్రుడు నాల్గింటను. కుజుడైదవయింటను, శుక్రుడారవయింటను, నెనిమిదింట సూర్యుడు, తొమ్మిదింట శనియు, జన్మ మష్టమందు గురుడును నెవనికి గలరో యీచందనకుడు జీవించియుండ, గొల్లపిల్లవాని నపహరించినవాడు బ్రదికిపోగలడా?

వీర: చందనకా; సరిగ తెల్లవారకముందే వానినిఁ దరలించు కొనిపోయినారు. ఇప్పటికి జాలదూరము పోయి యుందురు. నిజముగా నీతోడుసుమా! ఇంక వాడు మనకెక్కడ దొరకును.

వర్ధ: హేహే, (అని యెద్దులను దోలుచున్నాడు)

చంద : ఓరీ ? చూడు, చూడు. రాజమార్గమున నొక ముసుగుబండి పోవుచున్నది. అందున్న వారెవరు ?

వీర : ఓయీ, బండివాడా ; బండి నిలుపుము. ఈ బండి యెవరిది ? ఇందెవరున్నారు ? ఎక్కడకుఁ గొనిపోవుచున్నారు ?

వర్ధ : అయ్యా ; యీబండి చారుదత్తుడుగారిది. ఇది స్త్రీలెక్కెడుబండి ఇందు వసంతసేన యున్నది. చారుదత్తునితో విహారింప పుష్పకరండక జీర్ణోద్యానమున కేగుచున్నది.

వీర : బండి చారుదత్తుడిగారిదట. అందు వసంతసేన యున్నదట. చారుదత్తునికొఱకై యుద్యానవనమునకుఁ బోవుచున్నదట.

చంద : అట్లయిన పోనీ.

వీర : చూడకుండగనే పోనిచ్చుట.

చంద : అవును. చూడనక్కరలేదు.

వీర : ఎవరిమీద నమ్మకముచేత ?

చంద : ఆ చారుదత్తుని యందలి విశ్వాసముచేత.

వీర : చారుదత్తు డెవరు ? వసంతసేన యెవ్వతె ? లోపలకు బోయి చూడకుండ వెళ్ళనిచ్చుటకు ?

చంద : ఓరీ ; చారుదత్తునే యెఱుగవా ? ఆర్య చారుదత్తుని, బూజ్యురాలైన వసంతసేనను నెఱుగనివాడవు మింట చంద్రుని, వెన్నెలను గూడ దెలిసికొనలేదన్నమాటే. సుగుణములకు జలజమును శీలమునకుఁ జందురుని బోలినవానిని, ఆపన్నివారకుని చతుస్సముద్ర సారభూతమైన రత్నమువంటి వానిని చారుదత్తు నెఱుఁగని వారీ పుడమి గలరే ! మన యుజ్జయినీ పురమునకు, జారుదత్తుఁడును, వసంతసేనయు నను వారిరువురే తిలకములుగా నున్నారు.

వీర : ఓరీ; చందనకా, చారుశీలుడైన చారుదత్తునిగాని పుణ్యాత్మురాలగు వసంతసేననుగాని నేనెఱుగకపోలేదు. కాని, రాజకార్యములలో నేను నాకన్నతండ్రినైనను నెఱుగను. ఇది నిజము.

ఆర్య : (తనలో) ఇతడు నాకు బూర్వవైరి. అతడో నాకు పూర్వబంధువు. ఒక యగ్నియే, పెండ్లికార్యములయందును, స్మశాన వాటికయందును, వెలుగొందునట్లు వీ రిరువురు నేక కార్యమందే నియుక్తులయ్యును, స్వభావములలో భిన్నులై యున్నారు.

చంద : నీవు రాజుగారి సేనాధిపతివి. నమ్మినబంటువు చక్కని పరిశీలన గలవాడవు. కావున నీవు పోయి చూడుము. నేను యెడ్ల నాపితిని. నీవు లోపల జూడుము.

వీర : అవును రాజుగారికి నమ్మినబంటువే నీవును పరాక్రమ వంతుడవె. నీవే పోయి చూడుము.

చంద : ఓయీ, నేను జూచినచో, నీవు జూచినట్లగునా ?

వీర : నీవు చూచినయెడల మనపాలక మహారాజుగారు చూచి నట్లే యగును. కావున నీవే చూడుము.

చంద : ఓరీ; బండివాడా ; బరువుగానున్న యీ బండిగూడు నెత్తుము. లోనఁ జూచెదను.

(చేటుడు గూడెత్తుచున్నాడు)

ఆర్య : (తనలో) అయ్యో ; రక్షకభటుల కంటబడితిని. నిరాయుధుడనగు నేనిప్పు డేమి చేయుదును ! నేను కడు మందభాగ్యుడను. అయినను నా బాహువే నాకు శస్త్రమగుగాక. భీమునివలె బాహు యుద్ధము జేయుదును. చెఱసాలలో బంధింపఁబడి మరణము నొందుటకంటె యుద్ధమున నొడలు విడచుట శ్రేయోదాయకము. (కొంచెమాలోచించి) అయిన నిప్పుడింత సాహసమునకుఁ గడంగనేల ?

చంద : ( బండినెక్కి చూచును )

ఆర్య : అయ్యా ; శరణాగతుడను.

చంద : ( సంస్కృత భాషతో ) శరణాగతున కభయ మొసగు చున్నాను.

ఆర్య : శరణన్న వారి నాదరింపని వారిని జయలక్ష్మి చేపట్టదు. బంధుమిత్రులు త్యజింతురు. అట్టివాని జీవితము హాస్యాస్పదమగును.

చంద : ఏమీ ! ఆర్యకుడా ; గొల్లపిల్లవాడా ! అయ్యో, డేగకు భయపడిన పక్షి బోయవానికి చేత బడినట్లయినదే ! (చింతించి) పాపము వీడు నిరపరాధి. మీదు మిక్కిలి శరణు జొచ్చినవాడు. ఆర్య చారుదత్తుని బండి యెక్కి యున్నవాడు. నాకు ప్రాణమిత్రుడైన శర్విలకుని ప్రియమిత్రుడు. ఒకవైపు శరణాగతుడు మిత్రుడు మఱి యొకవైపు రాజనియోగము. ఇప్పుడు నాకేది కర్తవ్యము (ఆలోచించి) ఏమైనను గానిమ్ము. ముందే యభయ మిచ్చితినిగదా ; ఆర్తుల కభయ మొసంగిన పరోపకార పారీణుల కొక యాపద వాటిల్లినను, లోకులు వారి సుగుణములనే చెప్పుకొందురు. కాని నిందింపరు. ( భయము నభినయించును ) ఆర్యుని జూచితిని. కాదు. కాదు. ఆర్యురాలిని వసంతసేనను జూచితిని. ఆర్య చారుదత్తునితో విహరింప నేగుతున్న రాజమార్గమున నిట్లు పరిభవించుట తగదని నన్ను మందలించు చున్నది.

వీర : చందనకా; ఇందు నాకు కొంత సందేహముగా నున్నది.

చంద : ఆ సందేహమేమి ?

వీర : నీవు తొందరగ గద్గదస్వరమున ముందుగా ఆర్యుడనియు, పిదప నార్యురాలనియు బలికితివి. నీయసందర్భపు మాటలలో నా కనుమానము గలిగినది.

చంద: ఇందు నీకనుమానమేల? నా మాటలయం దవిశ్వాస మేల? మేము దాక్షిణాత్యులము. మాభాషలు మీకు స్పష్టముగా దెలియవు. ఖష, ఖత్తి, ఖడ, ఖడక్టి, బిడ, కర్ణాట, కర్ణప్రావరణ, ద్రావిడ, చోడ, చీన, బర్బర, ఖేన, ఖాన, ముఖ, మధుఘాత ప్రముఖు లగు మ్లేచ్ఛ జాతుల వారితో నాయా భాషలలో మాట్లాడుచుందుము. ఆర్యుడో ఆర్యురాలో అన్న మాటలో నీకు, పరిశీలన మెందుకు?

వీర: ఏదీ! నన్నుగూడ చూడనిమ్ము. నాయందు రాజుగారు మిగుల విశ్వాసముంచినారు.

చంద: ఇక నా నమ్మకము వమ్మయినట్లే.

వీర: ఇది రాజాజ్ఞగదా?

చంద: (తనలో) గొల్లపిల్లవాడైన యార్యకుడు చారుదత్త మహాశయుని బండిలో పోవుచున్నాడని దెలిసినంతనే రాజు చారు దత్తుని శాసించునుగదా! దీనికేమి యుపాయము చెప్పుమా; ఇప్పుడు కర్ణాట కలహము ప్రారంభించెదను. (ప్రకాశముగ) ఓరీ వీరక; చందనకుడనైన నేను జూచిన తఱువాత గూడ నీవు చూడనెంతువా? నీవెవడవురా?

వీర: నీవుమాత్ర మెవడవురా?

చంద: నీవేమో మహా ఘనుడవని జేనికడ చనువు గలిగి యుందునని గర్వించి నీజాతి నెఱుగకున్నావు.

వీర: (క్రోధముతో) ఓరీ; నీజాతి ఏదిరా?

చంద: ఎవరు చెప్పుదురు?

వీర: చెప్పుము. నీవే చెప్పుము.

చంద : నేను చెప్పనుత్లే నీజాతి నేనెఱుంగుదును కాని బయలు పఱుపను. అది నా మనమున నే యుండనిమ్ము. పచ్చి వెలగకాయ బగుల గొట్టిన బరువుండనట్లు, నీజాతిని బయల్పరచిన నీపరువు పోవును.

వీర : ఏమయినను స రే చెప్పుము.

చంద : ( చర్మకార జాతి యని సంజ్ఞ చేయుచున్నది. )

వీర : ఏమిరా యిది ?

చంద : ఒక రాతిముక్క చేత బట్టుకొని క త్తి, క త్తెర గ్ర కొని జుట్లు దువ్వి యలంకరించెదవు. అట్టి జాతివాడవు నీవిప్పుడు సేనాపతి వై తివి.

వీర : ప్రస్తుత విభవము నే చూచుకొని, నీవు నీజాతిని స్మరింప కున్నావు.

చంద : ఓరీ ; చంద్రునివ లె స్వచ్ఛమైన నా జాతిని గూడ నెన్నుచున్నావా ? అయినను చెప్పుము.

వీర : ఎవరు చెప్పుదురు ?

చంద : చెప్పుము. చెప్పుము.

వీర : ( చర్మకారుడనియే సంజ్ఞ చేయుచున్నాడు )

చంద : ఏమిరా యిది ?

వీర : ఓరీ ; ఇటు వినుము. నీజాతి యెంత పవిత్రమైనదో, నీతల్లి భేరి. నీతండ్రి పటహము. కరటము నీయన్న, నీవు సైన్యపతివి.

చంద : ( కోపముతో ) చందనకుడైన నేను చర్మకారుడనా ? స రే ; నీవు పోయి బండి చూడుము.

వీర : ఓరీ ; బండివాడా ; బండి యిటు త్రిప్పుము. పరీక్షింప వలెను. ( చేటుడు బండి త్రిప్పుచున్నాడు )

( వీరకుడు బండి యెక్కబోగా చందనకుడు సాహసముతో జుట్టు పట్టుకొని యీడ్చి నేలపై బడవైచి తన్నుచున్నాడు. )

వీర : ఓరీ ; రాజాజ్ఞ శిరసావహించి నా ధర్మమును నేను నిర్వహించుచుండగా, నన్ను బడవైచి, జుట్టుపట్టుకొని తన్నుచున్నావా ? చూడు. ఇప్పుడే పోయి ధర్మాధికారులతో జెప్పి నీకు శిక్ష వేయింపకున్న నేను వీరకుడను గాను.

చంద : నీవు ధర్మాధికారులకడకే పొమ్ము. రాజుగారియొద్దకే పొమ్ము. కుక్కా, నీలెక్కయేమి ?

వీర : సరే ( నిష్క్రమించును )

చంద : ఓరీ ; బండివాడా ; తోలుము, తోలుము. దారిలో నిన్నెవరైన యడిగినచో జందనక వీరకులు పరీక్షించినారని చెప్పు. అమ్మా ; వసంతసేనా, నీకానవాలిచ్చుచున్నాను. ( ఒక కత్తి నిచ్చుచున్నాడు. )

ఆర్య : ( కత్తిని తీసుకొని సంతోషముతో ) ఆహా ; నాకాయుధము లభించినది. నాకుడిభుజ మదరుచున్నది. ఇంక భయము లేదు. బ్రదికితిని. అనుకూల పరిస్థితులేర్పడినవి.

చంద : అమ్మా ; వసంతసేనా ; నాదొక మనవి. ఆలింపుము. నీవు సంపదలో నున్నప్పుడు నన్నుఁ దలచుకొనుము నేనిట్లనరాదు. కాని చనవుచేత నిట్లు వచించితిని దురాశచేగాదు.

ఆర్య : ఆహా ; దైవానుగ్రహమున చంద్రునివంటి చల్లని యుల్లము గల చందనకుడు నాకు మిత్రుడయ్యె. సిద్ధుని వచనములు నిజమయ్యేనేని నేను జందనకుని మరువను.

చంద : త్రిమూర్తులు, సూర్యచంద్రులు నిన్ను రక్షింతురుగాక. మహిషాసురమర్దని, శుంభ, నిశుంభలట్లు నీ శత్రువులను నశింప జేయుగాక.

( చేటుడు బండితో నిష్క్రమించును )

చంద : ( తెరవంక జూచి ) అదుగో నా ప్రియమిత్రుడు బండి వెనుకనే జారుచున్నాడు కానిమ్ము, నాకిప్పుడు రాజుగారి నమ్మిన బంటును ప్రధాన దండనాధుడునైన వీరకునితో నిష్కారణవైరము తటస్థించినది. నేనును దారపుత్రాదులతోడను, సోదరులతోడను, వీనినే యనుసరించెదను. ( నిష్క్రమించును )

అనుప్రవహణ విపర్యయమను షష్ఠాంకము

స మా ప్త ము.

---

# మృచ్ఛకటికము

## సప్తమాంకము

( చారుదత్తుడు, విదూషకుడు ప్రవేశించుచున్నారు. )

మైత్రేయుడు : వయస్యా ; ఈ పుష్పకరండక జీర్ణోద్యానము సొగసును గనుంగొనుము.

చారు : మిత్రమా ; అవును కడు రమణీయముగ నున్నది. ఈ యారామ మంగడివీధివలె నున్నది. వృక్షములను వర్తకులు పూవులను సరకుల నమ్ముచుండ తుమ్మెదలను పురుషులు కొనవచ్చినట్లున్నది.

మైత్రే : బాగుచేయకున్నను రమణీయమైన యా శిలాతలమునఁ గూరుచుండుము.

చారు : ( అట్లు చేసి ) మిత్రమా ; వర్ధమానకు డింకను రాలేదేమి ?

మైత్రే : వసంతసేననుఁ దీసుకుని శీఘ్రముగ బండి తోలుకొని రమ్మని నేను వర్ధమానకునితోఁ జెప్పితిని.

చారు : వర్ధమానకు డేల జాగుచేసెను. ముందుబోవు బండ్లు మందముగా నడచినవో; ఇరుసు విరిగినదో, త్రాళ్ళు తెగినవో, ఎడ్లు సరిగా నడువలేదో, దారిలో నేవైన నడ్డు వచ్చిన నవి తప్పించుకొని యెనో, మార్గము సరిగ లేకుండుటచే వేరొకదారిని వచ్చునో తెలియదు.

( అంతట అర్యకు డెక్కిన బండి తోలుకొని
వర్ధమానకుండు ప్రవేశించును )

చేటు: చొచ్చోచ్చో. ఎద్దు నడువవు.

ఆర్య: రాజభటులకు భయపడి యొంటికాలి సంకెళ్ళతో నొరులకుఁ దెలియకుండ కాకిగూటిలో బెరిగిన కోకిలవలె యితరుల బండి నెక్కితిని. ఓహో; నగరము దాటి చాలదూరము వచ్చితిమి. ఇప్పుడీ బండి దిగి యీ యెదుట నున్న చెట్లచాటున దాగియుందునా? ఇందే యుండి యజమానుని జూతునా? వృక్షవాటికా గహనమున నేల ప్రవేశింపవలెను? మహాత్ముడైన చారుదత్తు డార్తులయెడ వాత్సల్యము గలవాడుగదా కావున నిప్పుడాతనిఁ బ్రత్యక్షముగ బోయి సందర్శింతును. నా దుస్థితి నాతడు జూచెనేని యాతడు నాయెడ దయార్ద్ర హృదయుడై నాకు సాయము చేయఁగలడు. నేనిప్పుడీ స్థితిలో నుండగలిగిన దీతని సుగుణముల వల్లనేగదా.

చేటు: ఇదే ఉద్యానవనము. బండి నీవైపుగ బోనిత్తును.

మైత్రే: వయస్యా; నీకొక ప్రియము చెప్పెదను. వర్ధమానకుడు వసంతసేననుఁ దీసుకుని వచ్చినాడు.

దారు: మేలు, మేలు.

మైత్రే: ఓరీ; మూర్ఖా; ఇంత యాలస్యము చేసితివేమిరా?

వర్ధ: అయ్యా; కోపింపకుడు; నేనీ బండిలో బరువును మరచి వచ్చినందుచే నిటు నటు దిరుగుటలో కొంచె మాలస్యమైనది.

చారు: వర్ధమానక; బండి నిటు త్రిప్పుము. సఖా, మైత్రేయ, వసంతసేనను దింపుము.

మైత్రే: మిత్రమా; ఆమె కాళ్ళకు సంకెళ్ళున్నవా? నేను దింపవలెనా ఆమెయే దిగవచ్చును.

చారు: మిత్రమా; పరిహాసము వలదు. స్నేహము కాల విలంబనమును కోరదు. పోనిమ్ము నేను స్వయముగానే దింపెదను. (అని లేచుచున్నాడు)

ఆర్య: (చూచి) అహా? యితడేనా యీబండి యజమానుడు ఈమహానుభావుడు శ్రుతిరమణీయుడే గాక దృష్టికింగూడ రమణీయుడే. అమ్మయ్యా; ఇప్పటికి బ్రతికితిని.

చారు: (బండి యెక్కి-చూచి) ఓయీ; ఈతడెవరో ఏనుగు తొండమువంటి బాహువులు, సింహమువంటి బలిసి యెత్తైన అంస భాగములు, ఎఱ్ఱదామరవంటి విశాలనేత్రములు, వెడదరొమ్ములు గలిగిన యీ నిరుపమాన వ్యక్తి యొంటికాలి సంకెలలతో విన్నబోయి యున్నవాడు.

ఆర్య: అయ్యా; శరణు జొచ్చినవాడను. నే నార్యకుడను, గొల్లపిల్లవాడను.

చారు: పాలకమహారాజుగారు వేపల్లెనుండి రప్పించి, చెఱలో బంధించిన యార్యకుడవు నీవేనా?

ఆర్య: అవునండి.

చారు: దైవవశమున లభించిన నీదర్శనముచే నాకన్నులు చరితార్థత నొందినవి. నేను నా ప్రాణములనైన విడుతును గాని శరణాగతుని విడువను.

ఆర్య: (సంతోషము గనబఱచును)

చారు: వర్ధమానకా; ఆయన కాలి సంకెల నూడదీయుము.

వర్ధ: చిత్తము బాబు (సంకెళ్లు విప్పి) గొలుసులు విప్పితిని.

ఆర్య: మహాశయా; ఇనుపసంకెళ్ళు వదలించి, స్నేహసర స్నేహబంధమును గల్పించితిరి.

మైత్రే: ఈతడు బంధవిముక్తుడైనాడు. అది నీవు గ్రహింపుము. ఇక మనము పోవుదము రమ్ము.

చారు: నీవు కొంచెము శాంతింపుము.

ఆర్య: ఆర్యా; మీయందలి చనవుచే మీబండి నెక్కితిని. నన్ను మన్నింపుము.

చారు: మీరు స్వయముగా నాయందు జూపిన స్నేహభావముచే నేనలంకరింపబడితిని.

ఆర్య: సెలవయ్యోనేని పోయి వచ్చెద.

చారు: మంచిది. మీరు పోవచ్చును.

ఆర్య: అయ్యా; బండిదిగి పోయెదను.

చారు: మిత్రమా; వలదు, వలదు. ఇప్పుడే సంకెళ్ళు విప్పుటచే కాళ్ళు తడబడును. నడక సాగదు. రక్షకభటు సంచారము గలయిచ్చోట బండి నమ్మకమును బుట్టించును. కావున బండిలోనే పోవలయును.

ఆర్య: చిత్తము. తమయాజ్ఞప్రకార మట్లే పోవుదును.

చారు: నీవు సేమముగ నీ బందుగులను జేరుకొనుము.

ఆర్య: నీవే నాకుఁ బరమ బంధువవు.

చారు: నన్నెప్పుడైన తలంచుకొనుము.

ఆర్య: నేను మిమ్ము మరువగలనేని నన్ను నేను మరతును.

చారు: మార్గమున నిన్ను దేవతలే గాపాడుదురు.

ఆర్య: నన్ను నీవే రక్షించితివి.

చారు: నీ భాగ్యమే నిన్ను రక్షించెను.

ఆర్య: దానికి నీవే కారణము.

చారు: పాలకుడు పరాక్రమించినచో నీకు రక్షణ దుర్లభము. కడువడిగ దాటిపొండు.

ఆర్య: పునర్దర్శన మయ్యెడుగాక.

చారు: చెలికాడా; మనము రాజునెడ నపచార మొనర్చిన వారమైతిమి. ఇక నిట నుండజనదు. ఈ గొలుసుల నా పాడునూతిలోఁ బడవేసిరమ్ము. ఇచ్చటనే యుండినచో చారచక్షుడైన రాజెటింగిన ప్రమాదము వాటిల్లును. (ఎడమ కన్నదురుట నటించి) సఖా; నా యెడమ కన్నేటికో యదరుచున్నది. ప్రియురాలు రాకుండుటయు, నెడమకన్నదురుటయుఁజూడ నాహృదయము కలతనొందినది. పోదము రమ్ము. (నడచి) ఏమీ; శ్రమణికు డెదురైనాడు. ఇదియు నొక యపశకునమే గదా; (యోచించి) వీని నీదారిని రానీ, మనమా దారిని బోవుదము.

(అని మైత్రేయునితో నిష్క్రమించును)

ఆర్యకాపహారణమను సప్తమాంకము

స మా ప్త ము

# మృచ్ఛకటికము

## అష్టమాంకము

(అంతట తడిబట్ట చేతబూని యొకభిక్షుకుడు ప్రవేశించును)

భిక్షు: పామరులారా! ధర్మమును గడింపుడు. ఇంద్రియములను దొంగలు మీరుచిరకాలము నుండి సంపాదించుకొన్న ధర్మధనమును దోచుకొన జూచుచుందురు. కావున మీరు భగవద్ధ్యానమను భేరీ చేతబూని వాయించుకొనుచు కడు జాగరూకతతో నుండుడు. అశాశ్వతములగు యీ యిహసుఖములను మే మాశింపక ధర్మమునే యాశ్రయించు చున్నాము. దేహమను గ్రామమందున్న యైదుగురు దొంగలను వశపరచుకొని, మాయనుండి తప్పించుకొని మనస్సను చండాలునిగెల్చి గ్రామము సురక్షితముగ జేసికొనవలయును. అపుడు స్వర్గము కరస్థము. మొగమును తలయును ముండితంబులయినను మనస్సు ముండితముగానిచో ఫలమేమి?

మనస్సు ముండితమైనచో తలయును, మొగమును ముండితము గాకున్నను నైనన్లే. ఈ నీరుకావిబట్టను రాజశ్యాలకుని యుద్యానవన మందలి పుష్కరిణిలో జాడించుకొని మెల్లగా దాటిపోయెదను. (పోయి యట్లు చేయుచున్నాడు)

(తెరలో)

ఓరీ దుష్టశ్రమణకా; నిలువుము. నిలువుము.

భిక్షు : ( చూచి భయముతో ) అయ్యో ; ఇదిగో ; రాజ్య శ్యాలకుడు వచ్చుచున్నాడు. మున్నెన్నడో యొక సన్న్యాసి వీని కపకారము గావించెనని తన కంటఁబడిన భిక్షుకుల నందఱను యెడ్లకు ముకుద్రాళ్ళు పోసి ట్లు బాధించి వెడల గొట్టించుచున్నాడు. ఇక్కడ నాకు దిక్కెవరు ? నేనెవరిని శరణుజొత్తును ? నాకిక బుద్ధదేవుడే శరణము.

(అంతట శకారుఁడు కత్తి చేతపట్టుకొనిన విటునితో ప్రవేశించును)

శకా : నిలువుమురా, ఓదుష్టసన్న్యాసీ, నిలువుము.

కల్లంగడిలోనికి దెచ్చిన ముల్లంగిదుంపవలె నీతల చిదుకబొడిచెదను. ( అని కొట్టుచున్నాడు. )

విటు : వైరాగ్యముచే గావిగుడ్డలు ధరించిన సన్న్యాసిని గొట్టుట భావ్యముగాదు. వీనిజోలి నీకెందుకు ? అదిగో ; సుఖోపగమ్యమైన యుద్యానవనము కన్నులపండుగు చేయుచున్నది. ఇల్లులేనివారి కిల్లిచ్చి, వనతరులు కూర్చిన పూలధనము, దీనిని చూడుము. ఇది దురాత్ముని హృదయమువలెను, గ్రొత్త రాచఱికమువలె దోచుచున్నది.

భిక్షు : ఉపాసకా ; నీకిదె స్వాగతము. నన్ననుగ్రహింపుము.

శకా : బావా ; చూచితివా ; వీడు నన్ను చూచి, యేమో యఱచుచున్నాడు.

విటు : ఏమనుచున్నాడు ?

శకా : నన్ను పాసకు డనుచున్నాడు ; నేను మంగలినా ?

విటు : నీవు బుద్ధోపాసకుడవని నిన్ను నుతించుచున్నాడు.

శకా : శ్రమణక ; నుతింపుము, నుతింపుము.

భిక్షు: నీవు ధన్యుడవు, నీవు పుణ్యుడవు

శకా: నన్ను ధన్యుడు, పుణ్యుడు ననుచున్నాడు. నేను చార్వాకుడనా? కోష్ఠకుడనా; కుంభకారకుడనా?

విటు: ఓయీ, నీవు ధన్యుడవని, పుణ్యుడవని నిన్ను నుతించుచున్నాడు.

శకా: బావా; ఇత డిక్కడికేల వచ్చినాడు?

భిక్షు: ఈ కావిబట్ట నుదుకుకొనుటకై వచ్చితిని.

శకా: ఓయీ; దుష్టసన్యాసీ; ఉద్యానవనము లన్నింటిలో మేలైన యీ పుష్పకరండకోద్యానము మాబావ మాకిచ్చినాడు. దీనిలో కుక్కలు, నక్కలు నీరు ద్రాగునుగాని, యుత్తమపురుషుడనైన నేను స్నానము చేయను. ఇట్టి సరస్సులో పాతయులవ గుగ్గిళ్ళవంటి రంగుగల నీయీమురికి కావిగుడ్డ నుదుకుచున్నావా; చూడు. నిన్నొక్క తన్ను తన్నెదను.

విటు: ఓరీ; మూర్ఖా; వీ డీమధ్యనే సన్యసించినట్లున్నది.

శకా: అది నీకెట్లు తెలిసినది?

విటు: తెలియుట కేమున్నది? కురులు లేకున్న నుదుట నెండ్రుకలు దిద్దు తీరుగ గానవచ్చుచుచు బచ్చగనే యున్నది. కావిబట్ట ధరించుటచేత గాక కాబోలు బట్ట ముడుత లున్నవి. కావిబట్ట చెరగు జారిపోచున్నది.

భిక్షు: ఉపాసకా, అవును నేను కొలదికాలము క్రిందటనే సన్యాసాశ్రమమును స్వీకరించితిని.

శకా: అయితే, నీవు పుట్టగానే యేల సన్యాసము స్వీకరింపలేదు? (అని కొట్టుచున్నాడు)

భిక్షు : బుద్ధదేవునకు నమస్కారము.

శకా : ఓరీ ; కొంచెముండుము. నే నాలోచించుకొందును.

విటు : ఎవరితో నాలోచింతువు ?

శకా : నా హృదయముతో.

విటు : అకటా ; అది గతించిపోలేదా ?

శకా : ఓ హృదయమా ; ఇదిగో సన్యాసి వీడిక్కడ నుండవచ్చునా ; పోవచ్చునా ? ( తనలో ) ఉండనుగూడదు, వెళ్లనూ నుగూడదు. (ప్రకాశముగ) బావా ; నా హృదయముతో నాలోచించు కొంటిని. అది చెప్పిన మాట లివిగో.

విటు : నీ హృదయ మేమన్నది ?

శకా : " ఈ సన్యాసిని పోనీయవద్దు, ఇక్క డుండనీయవద్దు, ఊపిరి యెగబీల్చ నీయరాదు, దిగబీల్చనీయరాదు. ఇచ్చటనే బడవైచి క్షణములో చంపవలెను " అని.

భిక్షు : బుద్ధునకు నమస్కారము. నేను శరణాగతుడను.

విటు : ఇక నీవు వెళ్ళి నీపని చూచుకొమ్ము.

శకా : ఒక యొట్టుమీద.

విటు : అది యెట్టిది ?

శకా : నీరు బురద గాకుండ, కావిబట్ట మన్నందు గలుపుము. లేదా ప్రాగు నీరంతయు గలిపి బురదయందు గలుపుము.

విటు : అహాహో ; ఏమి వీని మూర్ఖత ; లోకవిరుద్ధమై హృదయ విహీనమైన చేష్టలుగలిగి రాతిపలకవంటి దేహముతో మాంసవృక్షము లైన మూర్ఖ మనుజజాతిభారముచే నీ వసుంధర క్రుంగిపోయినది.

( భిక్షుకుడు సంతోషముతో గంతులు వేయుచు కేకలు వేయుచున్నాడు

శకా : ఏమీ ! అరచుచున్నాడు.

విటు : నిన్ను నుతించుచున్నాడు.

శకా : వినవయ్యా ; వినుము, వినుము.

( భిక్షుకుడు అతని నుతించుచు నిష్క్రమించును )

విటు : ఓయీ ; మహారసికా ; ఈ యుద్యానవన శోభను చూడుము. ఇవిగో ఫల పుష్పసంపదలతో నెంతయో సొబగుగొల్ప యీవనవృక్షము లల్లిబిల్లిగానల్లుకొన్న లతాజుంపములతో నొప్పుచు, సత్ప్రభు పాలిత రాజ్యమున జక్కగ సుఖించు గృహస్థులవలె నున్నవి.

శకా : బావా ; చక్కగా చెప్పితివి. పలురంగులు గల పూవులచే భూమి త్రివర్ణము గలిగి యున్నది. పుష్పభారముచే చెట్లు వంగి యున్నవి. చెట్ల పై భాగమున నల్లుకొనిన తీగలను బట్టుకొని కోతులు పనసపండ్లవలె నేలకు దిగుచున్నవి.

విటు : ఓయీ ; ఇదే శిలావేది, ఇందు కూరుచుండుము.

శకా : ఇదిగో కూరుచుంటిని. ( విటునితో కూడ కూరుచుండును ) బావా ; నేనిప్పుడు, వసంతసేనను తలచుకొనుచున్నాను. దుర్మార్గుని బెదరింపు మాటలవలెనే నేను దానిని మరువలేకున్నాను.

విటు : అట్లామె నిరసించినను నిత డామెనే తలంచుచున్నాడు. అయితే స్త్రీలచే తిరస్కరింపబడి కాపురుషులు మరులుకొందురు. సత్పురుషులు మనస్సు మరల్చుకొందురు. ఒక్కొకచో పూర్తిగ నిస్పృహు లగుదురు.

శకా : బావా ; బండికట్టుకొని త్వరగా రమ్మని స్థావరకుని బంపి యొంతసేపైనది. మిట్ట మధ్యాహ్నమైనది. నా కాకగులియుచున్నది.

ఇంత యెండలో కాలినడకను బోవుట కష్టముగదా; అదేచూడుము. ఈ సూర్యభగవానుడు మింటినడుమ దుర్నిరీక్ష్యుడై ప్రకాశించుచు కోపించిన కోతిముఖము వలె నున్నాడు. పుత్రశతమును గోల్పోయిన గాంధారివలె యీదారి మిగుల దట్టముగా నున్నది.

విటు: గోవులు చెట్ల నీడల నెమరు వేయుచు బరుండియున్నవి. దప్పికచే మృగములు వెచ్చని నీరు ద్రాగుచున్నవి. ఎండ తీవ్రతచే పురమందు జనులెవ్వరు సంచరించుటలేదు. బండివాడు రాక యెందో చిక్కువడి యుండెనేమో.

శకా: బావా; సూర్యకిరణములు నెత్తి మాడ్చుచుండ, ఖగ, శకున, విహంగములు చెట్లకొమ్మల నాశ్రయింప, నర, పురుష, మర్త్యులు వేడినిట్టూర్పుల నిగుడింప, స్వగృహముల శరణముగ గలవారు యెండ బాధను సహింపగలరే, బావా, చేటు డింకను రాకున్నాడే నా వినోదము కొరకు కొంచెము పాట పాడెదను. (పాడి) నీవు నా పాట నెప్పుడైనను విని యున్నావా;

విటు: నే నేమందును. నీవు గంధర్వుడవు.

శకా: ఏమీ, నేను గంధర్వుడను గానా? ఇంగువ, భద్రముస్తెలు, వస, బెల్లము, జీలకఱ్ఱ, సొంటిగంధము కలిపి తినిన గొంతు మధురముగ నుండును. బావా; మరల పాడెదను. నా పాట నీవెప్పుడును వినలేదా?

విటు: ఇక చెప్పనేల. నీవు గంధర్వుడవే.

శకా: నేను గంధర్వుడను గానా; సువాసనగల యింగువలో మంచి మిరియపు బొడిని నూరి నేతితోను, నూనెతోను వేచి, కోయిల మాంసముతో భుజించిన కంఠస్వరము కోకిలస్వరముగ మారును. చేటు డింకను రాకున్నాడేమి?

విటు: నీవిక్కడ సుఖముగా గూరుచుండుము. నే నిప్పుడే వచ్చెదను. (అంతట వసంతసేన యున్న బండి తోలుకొని చేటుడు ప్రవేశించును

చేటు: అయ్యో; ఇప్పుడు సూర్యుడు నెత్తిమీదకు వచ్చినాడు. రాజశ్యాల సంస్థానకుడు నాపై గోపించునేమో యని భయమగుచున్నది. బండి త్వరగా తోలెదను. (అట్లు చేయును) గిత్తలారా; నడువుడు, నడువుడు. (నిష్క్రమించును)

వసంతసేన: అయ్యో, అయ్యో, ఇది వర్ధమానకుని గొంతు కాదు. ఆర్య చారుదత్తు డెద్దులకు విశ్రాంతి నిచ్చుటకై నాకు వేరొక బండిని బంపియుండ వచ్చును. నా కుడి కన్నదరుచున్నది. నా గుండెలు దడదడ కొట్టుకొనుచున్నవి. దిక్కులు చీకట్లు గ్రమ్ముచున్నవి. నాకు లోకము తలక్రిందైనట్లున్నది.

శకా: (బండిచప్పుడు విని) బావా; బండి వచ్చినది.

విటు: ఎట్లు తెలిసికొంటివి.

శకా: బావా; నీవు చూడలేదా? ముసలిపందివలె గురగుర లాగుచుండుట.

విటు: (చూచి) మంచిది చూచితిని. వాడు వచ్చినాడు.

శకా: కొడుకా; స్థావరకా; చేటూ; వచ్చితివా?

చేటు: చిత్తం వచ్చినానండి.

శకా: బండికూడ వచ్చినదా?

చేటు: బండియు వచ్చినది.

శకా: ఎడ్లుకూడ వచ్చినవా?

చేటు: మరేనండి.

శకా: నీవుకూడ వచ్చితివా?

చేటు: (నవ్వుచు) భట్టారకా నేనుకూడ వచ్చితినండి.

శకా: అయితే బండిరానీ?

చేటు: ఏ త్రోవను?

శకా: ఇలాగుననే, ప్రాకారము పడిపోయిన చోటునుండి రానిమ్ము.

చేటు: భట్టారకా; బండి విఱుగును, రెండెడ్లు చచ్చును. నేనును చత్తును.

శకా: నేను రాజ్యశ్యాలకుడను. ఎడ్లు రెండును చచ్చినచో నేను మరియొక యెడ్లజతను కొందును. బండి విఱిగినా, మఱియొక బండిని జేయింతును. నీవు చత్తువేని మఱియొక బండివాని నేర్పాటు జేసి కొందును.

చేటు: అన్నియు జరుగును. కాని, నేను మాత్రము మిగులను.

శకా: ఓరీ; సర్వము నశింపనీ, బండిమాత్ర మా ప్రాకార ఖండము దాటనే రానిమ్ము.

చేటు: ఓసీ; బండీ; ముక్క ముక్కలై పోనీ యజమానితో కూడా విఱిగిపోనీ వేరొకబండి యగును. యజమానితో బోయి చెప్పు కొందును. అయ్యో; విఱిగిపోలేదే (ప్రవేశించి) భట్టారకా; ఇదుగో బండి తీసుకుని వచ్చితిని.

శకా: రెండెడ్లు తెగిపోలేదా? ఎడ్లపగ్గాలు నీవు చచ్చిపోలేదా? చచ్చిపోలేదా?

చేటు అవునండీ.

శకా: బావా: బండి వచ్చినది. చూతమురా; నీవు నాకు గురుడవు, పరమగురుడవు. సోదరకుడవని యభ్యంతరకుడవని, పురస్కరణీయుడవని నేను నిన్ను చూచుకొందును. కాబట్టి నీవే యీ బండిని ముందుగా నెక్కుము.

విటు: ఆలాగే కానిమ్ము. (అని బండి యెక్కుచున్నాడు)

శకా: ఆలాగుకాదు ఉండుము. ఈ బండి నీ యబ్బసొమ్మా ముందు నీ వెక్కుటకు? బండికి యజమానుడను నేను కాబట్టి ముందుగా నేనే యెక్కెదను.

విటు: నీ వెక్క మన్నందుననే కదా నే నెక్కితిని.

శకా: నేనాలాగునంటినే కానిమ్ము. నీవు మాత్రము "భట్టారకా; నీవే ముందుగానెక్కుము" అని మర్యాదగా నన నక్కరలేదా?

విటు: అయితే నీవే ముందుగా నెక్కుము.

శకా: ఇదుగో; యిప్పుడే యెక్కుచున్నాను. పుత్రకా; స్థావరకా; చేటూ; బండి నిటు త్రిప్పుము.

చేటు: (బండిని త్రిప్పి) భట్టారకా; యెక్కండి.

(ఎక్కి చూచి శంకించి వెంటనే బండి దిగి విటుని మెడ పట్టుకొని) బావా; బావా; చచ్చితిని, చచ్చితిని. ఈ బండిలో రాక్షసియో, దొంగయో యున్నట్లున్నది. అది రాక్షసియే యైనచో మన మిద్దరము దొంగిలింప బడినవారమే దొంగయైనచో మన యిరువురను వాడు నోట వేసుకొన్నవాడే.

విటు: భయపడకు, భయపడకు. ఎడ్లబండిమీద రాక్షసి యెట్లు సంచరించును. అదిగాదు. మట్టమధ్యాహ్నపు ఎండచే నీ దృష్టి చెదరించుకము ధరించిన స్థావరకుని నీడ చూచిన నీకట్టి భ్రాంతి కలిగినది.

శకా: నాయనా; స్థావరకా; నీవు బ్రదికి యున్నావా?

చేటు: మరేమిటండీ?

శకా: బావా: బండిలో నొక యాడుది యున్నది. చూడుము.

విటు: స్త్రీ యెట్లు వచ్చును. నేనెట్లు చూతును. మేము దారినిబోవు నపుడు జడివానలకుఁ గ్రుడ్లు మూసికొను వృషభములవలె తలవంచుకొని పోవుచుందుము. సభలలో గౌరవాభిమానములుగల జనులదృష్టి స్త్రీ పరాఙ్ముఖముకదా?

వసం: (విస్మయముతో తనలో) ఏమీ నాకన్నుల కాయాస కారియైన రాజశ్యాలకుడే వీడు. ఈ దినమున నాకేదో మూడినదని భయము కలుగుచున్నది. నా దురదృష్టముచే, జవిటినేలను జల్లిన విత్తులవలె ఇక్కడకు నారాక నిష్ఫలము. ఇప్పుడు నేనేమి చేయుదును దైవమా?

శకా: మన యీ ముసలిచేటుడు బండి చూచుటకు భయపడు చున్నాడు. బావా; నీవు చూడుము.

విటు: ఇందు తప్పేమి, ఆలాగే చూచెదను.

శకా: ఏమీ; నక్కలెగురు చున్నవి. కాకులు పరుగెత్తు చున్నవి. కాబట్టి బావ కండ్లతో కొరికి, పండ్లతో చూచుచుండగ నేను పరుగెత్తిపోనా?

విటు: (వసంతసేనను చూచి విచారముతో తనలో) కన్నెలేడి పులికంట బడినది. అయ్యో యెంత కష్టము. శరత్కాలపు వెన్నెల వలె స్వచ్ఛమైన సైకతమున విహరించు హంసమునువిడచి, హంసి కాల వశమున కాకిని చేరినది. (జనాంతికముగా) వసంతసేనా; ఇది నీకిది యుక్తముగాదు. ఈయకార్యము నీకు తగదు. మున్ను నీవు ధనము

కాశింపక గర్వించి తూలనాడిన రాజశ్యాలకుని గూర్చి నీతల్లి యాజ్ఞచే మర్యాద గోలుపోయితివా ?

వసం: లేదు, లేదు. ( తల యూడించుచున్నది )

విటు: వేశ్యావృత్తి నేర్చుకొంటివా ? నేను మునుపు చెప్పియుండ లేదా ; ఇష్టమైనను, కాకున్నను నీవంగీకరింపుమనియు, అది నీ ధర్మ మనియు ననలేదా ?

వసం: ఒక బండి యనుకొని వేరొకబండి నెక్కి ప్రమాదవశ మున నే నిందు వచ్చితిని. నిన్ను శరణుజొచ్చితిని.

విటు: భయపడకుము. కాని మీ్మాతనినే వంచింతును లెమ్ము. ( శకారుని సమీపించి ) ఓరీ ; దౌర్భాగ్యుడా ; ఇందు రాక్షసియే యున్నది.

శకా: బావా ; అది రాక్షసియే యైనచో అది నిన్నెందుకు దోచుకొనలేదు. దొంగయే యైనచో నిన్నేల తినివేయలేదు.

విటు: బావా ; దీనితో మనకేమి పని. మన మీా తోటలో నుండి కాలి నడకనే యుజ్జయినీపురికి బోవుదము. దీనివలన దోషమేమి ;

శకా: నీవు చెప్పినట్లు చేసిన ప్రయోజనమేమి ?

విటు: అట్లు చేసిన మనకు వ్యాయామ సేవనము కలుగును. ఎడ్ల కలసటయును దీరును.

శకా: అట్లేస్థావరకా ; చేటుడా ; బండినడిపింపుము. అట్లుకాదు నిలుపుము. నిలుపుము దేవతలకు, బ్రాహ్మణులకు ముందు నడచియే పోవుదము. లేదు, లేదు. నేను బండి యెక్కియే వెళ్ళెదను. దూరము నుండి నన్ను జూచుజనులెల్ల " అదిగో రాష్ట్రియ శ్యాలభట్టారకుడు వచ్చు చున్నాడని " చెప్పుకొనునట్లు బండి యెక్కియే వెళ్ళెదను.

విటు: (తనలో) విషమున కౌషధగుణ మబ్బుట కష్టము. అయిన నిట్లు చేసెదను. (ప్రకాశముగా) ఓరీ; నీచుడా; ఇదుగో వసంతసేన నిన్ననుసరించుచున్నది.

వసం: పాపము శమించుగాక, పాపము శమించుగాక.

శకా: (సంతోషముతో) బావా; బావా; పురుషపుంగవుని, మనుష్యుని, వాసుదేవకుని నన్నా! నన్నా! నన్నా!

విటు: సందియమేమి?

శకా: అయితే నా కపూర్వసంవద యబ్బినది. ఆనాడు కోపమునకు బాత్రురాలైనది. ఇప్పుడామె కాళ్ళపై బడి ప్రసన్నురాలిం జేసుకొందును.

విటు: లెస్సగా బలికితివి.

శకా: ఇదిగో కాళ్లపై బడుచున్నాను. (వసంతసేనను సమీపించి) ఓ అత్తికా, ఓ అమ్మా; నా విన్నపము వినుము. ఓ విశాలనేత్రీ; చారుగాత్రీ పదిగోళ్ళు, తెల్లని దంతములు గల నీకిదే అంజలి యిచ్చుచున్నాను. నేను కామాతురుఁడనై నీకు బాధ కలిగించితిని మన్నింపుము.

వసం: ఛీ, ఆవలకు బొమ్ము. అనుచిత సంభాషణము చేయుచున్నావు (అని కాలితో దన్నుచున్నది.)

శకా: (కోపముతో) దేవతలకై నను బ్రణమిల్లనదియునైన నాశిరస్సు అడవిలో ఏనుగు నక్క కాలికింద నలిగిపోయినట్లు నీకాళ్ల నడుమ నలిగిపోయినది. ఓరీ; స్థావరకా; చేటా; ఈమె నీకెక్కడ దొరికినదిరా.

చేటు: భట్టారకా; రాజమార్గము బండ్లచే గ్రిక్కిరిసి యుండగా, నీబండిని చారుదత్తుడుగారి తోటయందు నిలిపి అడ్డముగా

నున్న బండిచక్రము దిప్పుటకై వెళ్ళితిని. అప్పుడీమె వారిబండి యను పొరబాటున నీబండి యెక్కి వచ్చినదని నాయూహ.

శకా: ఏమీ; పొరబడి వచ్చినదా. నాకొఱకు రాలేదా? అయితే దిగు, మాబండిదిగు. ఆదరిద్ర చారుదత్త వర్తకుని వెంబడించు చుందువని నేనెఱుగుదును. మా యెడ్లు నలిగిపోవుచున్నవి. దాసి; దిగు, మా బండి దిగు.

వసం: ఆర్య చారుదత్తుని కామించి, వెనువెంట తిరుగుచున్నా నను సత్యమైన మాటచే నే నలంకరింపబడితిని. ఇప్పుడేది కానున్నదో యది కానిమ్ము.

శకా: తెల్ల కలువ రేకుల చుట్టువలె యొప్పి, చాటు శీతతాడన లంపటములు గల నా యీ చేతులతో నీజుట్టు పట్టుకొని వాలిభార్యను జటాయువువలె బండినుండి క్రింది కీడ్చెదను.

విటు: ఉత్తమ స్త్రీల శిరోజముల నంటుకొందురా? ఉద్యాన వన లతల లేజిగుళ్లు త్రుంచి పాడుచేయుదురా? కాబట్టి నీవుండుము నేదించెదను. వసంతసేనా బండి దిగుము.

వసం: (బండి దిగి యేకాంతమున నిలిచియుండును)

శకా: (తనలో) ఆనాడు నాకోరిక త్రోసి వేసినందున నాకోపాగ్ని లోలోన మండుచున్నది. అది యిప్పు డీమె కాలితాపున రగిలి ప్రజ్వ రించినది. అందుచేత నే నీమె నిప్పుడే చంపెదను. కానిమ్ము. అది యిట్లే (ప్రకాశముగ) బావా; బావా; నూరుపోగులతో నేసిన కుచ్చుల యుత్తరీయము నీకిచ్చెదను. నాతో కమ్మని భోజనము పెట్టింతును సుఖముగా ననుభవింతువా?

విటు: అయితే యేమందువు.

శకా: నాకొక ప్రియము చేయుము.

విటు: అకార్యము కాదేని తప్పక చేసెదను.

శకా: అకార్యపు వాసనయైనను లేదు, ఏరాక్షసియులేదు.

విటు: అట్లయిన జెప్పుము.

శకా: వసంతసేనను జంపుము.

విటు: (చెవులు మూసుకొని) బాల! ఆపైని యాడుది. కపట ప్రేమ నెరుగని యసదృశయైన వేశ్య. ఈయుజ్జయినీ నగరమున కలంకార మనదగినది. నిరపరాధియైన యీమెను జంపి యేతెప్పచే పరలోక నదిని తరింతును?

శకా: బావా; నేను నీకొక తెప్ప నిప్పించెదను. నిర్జనమైన ఈ యుద్యానవనమున నీమెను జంపిన యెవ్వరును జూడరు.

విటు: మనముచేయు పాపపుణ్యములు దశదిశలు, వనదేవతలు, సూర్యచంద్రులు, ధర్మదేవత, వాయువు, ఆకాశము, భూదేవి, అంత రాత్మ మొదలగు వారందఱు చూచుచునే యుందురు.

శకా: అట్లయిచో బట్ట చాటుచేసి మఱి చంపుము.

విటు: ఇహాపరముల రెంటికిం జెడితిని.

శకా: ఈ ముసలి పంది యధర్మమునకు వెఱచుచున్నాడు. కానిమ్ము. స్థావరకచేటులను మంచి చేసుకొనెదను. నాయనా, స్థావరకా, చేటా, మీాకు బంగారు మురుగులు చేయింతును.

స్థావ: అవి నేను ధరించుకొందును.

శకా: నీకు బంగారుపీట చేయించెదను.

స్థావ: నేనందు గూరుచుండెదను.

శకా: నా యెంగిలి యంతయు నీకే యిచ్చెదను.

స్థావ: నేను దానిం దినియెదను.

శకా: చేటు లందరిలో నిన్ను గొప్ప వాడనిపింతును.

స్థావ: భట్టారకా; నేనట్లే నయ్యెదను.

శకా: కాబట్టి నీవు నామాటను మీరకుండ నుండవలెను.

స్థావ: భట్టారకా మీరేమి చేయుమన్నను చేసెదను. అకార్యము తప్ప.

శకా: అబ్బే; దాని వాసనయే లేదు.

స్థావ: భట్టారకా; అయినచో చెప్పండి.

శకా: వసంతసేనను జంపుము.

స్థావ: భట్టారకా; అనుగ్రహించండి. ఈమెను బండి మార్పు వలన గలిగిన ప్రమాదమున నే నిక్కడకుఁ దెచ్చి మొదట తప్పు చేసితిని.

శకా: చేటా; నీవుకూడ యజమానుడనైన నామాట వినకున్నావా?

చేటు: నా శరీరమునకు నీవు ప్రభువవే కాని, చరిత్రకుఁగాదు నన్ను మన్నించండి, నన్ను మన్నించండి. నేను చాలా భయపడుచున్నాను.

శకా: నీవు నాకు చేటుడవైయుండి యెందుకు భయ పడుచున్నావు.

చేటు: భట్టారకా; పరలోకము వలన.

శకా: ఆ పరలోక మెటువంటిది?

చేటు: పాపపుణ్యముల పరిణామమే.

శకా: పుణ్యముయొక్క పరిణామ మెట్టిది?

చేటు: భట్టారకులు, బహు సువర్ణ భూషితులు నగు మీా భాగ్యము వంటిదే.

శకా: పాపముయొక్క ఫలమేమి?

చేటు: పరాన్నభక్షితుండ నగు నా బ్రదుకువంటిదే. కాబట్టి యకార్యము చేయజాలనంటిని.

శకా: ఓరీ; చంపవురా; (కొట్టుచున్నాడు)

చేటుడు: భట్టారకా; నన్ను చావమోదండి, చంపండి. కాని, నేనకార్యము చేయను. ఎన్ని పాపములు చేసియో యిట్లు పుట్టుదరిద్రుడనైతిని. నేనింక కానిపనులం జేయను.

వసం: (విటునితో) బావా; నిన్ను శరణు జొచ్చితిని.

విటు: ఓయీా; నీచుడా; శాంతింపుము. శాంతింపుము. మంచిది చేటా; మంచిది. వీడు దిక్కులేనిదరిద్రుడు పైగాసేవకుడు పరుల ధనమున కాశించి బ్రదుకువాడు. వీని యజమాను డిది తగదని తలపక వీనిని బాధించునో, మంచినూహించి విడుచునో, వీనికి దాస్యమిచ్చి, వానికి ప్రభుత్వమిచ్చి కృతాంతుడు వ్యత్యస్తము చేసి. లోకనిందకు బాల్పడినాడు. ఈ సిరి వా డనుభవింపరాదా! వీని యాజ్ఞ వాడు పాలింపరాదా!

శకా: ఈ ముసలి నక్క యధర్మమునకు వెఱచును. ఈ గర్భదరిద్రుడు పరలోకమునకు వెరచును. నేను రాష్ట్రీయ శ్యాలకుడను. వర పురుష మనుష్యుడను. నాకెవరివలననుభయము లేదు. ఓరీ; గర్భదరిదుడా పొమ్ము. నీవు పోయి లోపలి గదిలో విశ్రమింపరా.

చేటు: భట్టారకుడు చెప్పినట్లే చేయుదును. (వసంతసేనతో) అమ్మా నా విభవ మింతటిదే.

శకా: (బట్ట మొలకు జుట్టపెట్టుకొని) ఉండు. వసంతసేనా; ఉండు. నిన్నిదే చంపెదను. (కత్తి పట్టుకొనుచున్నాడు)

విటు: ఆ; నాముందటనే చంపుచున్నావా? (గొంతుక పట్టుకొనును)

శకా: (నేలమీదబడి) బావా; భట్టారకునే చంపుచున్నావా? (మూర్ఛ నటించి మరల తెలివి తెచ్చుకొని) ఎల్లప్పుడు నీవు నాయింట మాంసము, నేయి, మొదలగు పదార్థములను దిని బలిసి యిప్పుడు మంచి సమయమునకు నాకు శత్రుడ వైతివేల? (ఆలోచించి తనలో) కానీ నాకొక మాయోపాయము దోచినది. ఈ ముసలినక్క తల యూడించుచున్నాడు. వీని నిక్కడనుండి పంపివేసి, వసంతసేనను వధింతును. (ప్రకాశముగా) బావా; దీపపుప్రమిద నిప్పువంటి కులమున బుట్టిన నేనుకూడ నిట్టిపని జేయుదునా! నిన్నైన నంగీకరింప జేయుట కట్లంటినంతే.

విటు: కులముతో బనియేమి? శీలధర్మమే కావలసినది. సుక్షేత్రమునందు ముండ్లచెట్లు మొలచుటలేదా?

శకా: బావా; నీయెదుట నీచెడిపె సిగ్గుపడుచున్నది. అందుచే నన్నొల్లకున్నది. కనుక నీవు బొమ్ము. స్థావరక చేటుడు నాచేత దెబ్బలు దిని పారిపోవుచున్నాడు. నీవు పోయి వానిని దీసికొనిరమ్ము.

విటు: (తనలో) నా యెదుట వసంతసేన యీ మూర్ఖుని ధనలోభముచే నైనను గామింపదు. కామము వివిక్తవిస్రంభ రసము గదా, నేనీ మరుగున నుండి యీ సంగతి కనిపెట్టెదను. (ప్రకాశముగ) కానీ, నేను వెళ్ళెదను.

వసం: (ఉత్తరీయము చెంగు పట్టుకొని) అయ్యా; నేను నీకు శరణాగతను.

విటు : వసంతసేనా; భయమెందుకు. వెఱువకుము. ఓయీ, చెడిపెసంగడీడా; వసంతసేనను నీహస్తమందుంచుచున్నాను.

శకా: సరే; నాహస్తమందు నాశమై యుండుగాక.

విటు : నిజముగానా?

శకా: నిజముగానే.

విటు : (కొంచెము నడచి) ఒకవేళ నేను వెడలిపోగానే యీ పాపాత్ము డీమెను జంపునేమో, కావున నేనీచాటునుండి వీని చేష్టలం గనిపెట్టెదను. (దాగుకొనును)

శకా: కానిమ్ము. ఇప్పు డీమెను జంపివేయుదును. అయినను, యీ కపటబ్రాహ్మణుఁడు ముసలినక్క యిక్కడనే యెందో దాగి యుండును. కనుక వీనిని మోసగించుటకై యిట్లు చేయుదును. (పూలు గోయుచు తన్నలంకరించుకొని) బాలా, బాలా; వసంతసేనా రమ్ము రమ్ము.

విటు : వీడు మోహపరవశుడై యున్నాడు. అమ్మా నేను బ్రదికితిని. ఇక నేను బోయెదను. (నిష్క్రమింతును)

శకా: ఓ సుదతీ; నీకు బంగారు వరహాలిత్తును. నీకుఁ బ్రియము చెప్పెదను. నా తలపాగతో గూడ నీకు సాగిలపడుదును. నన్నేల గైకొనవు? నీ సేవకు మనుష్యులు తగరా?

వసంత : దురాత్మా నీ ధనము చూపి నన్ను భాధింతువా? మఱియు సహకార వృక్షమును సేవించు నేను మోదుగుచెట్టు నెట్లంగీక రింతును. సుచరిత చరితము; శుద్ధదేహమును గలిగిన పద్మమును మధుపము విడుచునా? పేదయైనను కులశీలవంతులైన పురుషులనుయత్నించి యైనను సేవింపవలెను.

శకా: పుట్టు దరిద్రురాలా; దరిద్ర చారుదత్తుడు సహకార వృక్షమా? నేను మోదుగుచెట్టునా? కింశుకసామ్యమునై నను చెప్పక పోయితివా; నీవిట్లు నన్ను పరిహరించుచు నింకను చారుదత్తునే స్మరించుచున్నావా?

వసం: స్మరించుటేల? అతడు నాహృదయస్థుడేగదా; కులశీల సదృశ జనసమాశ్రయమైన కామము వేశ్యకాంతకు శోభను గలిగించునుగదా?

శకా: ఇప్పుడే నీహృదయగమునితోగూడ నిన్ను జంపుదును. ఉండు ఆ దరిద్ర చారుదత్తుని కాముకురాలా ఉండు.

వసం: చెప్పుము, చెప్పుము. మరల జెప్పుము. కొనియాడ దగిన యక్షరములను.

శకా: ఆ దరిద్ర సార్థవాహుఁడు వచ్చి నిన్ను రక్షించునులే చూతము.

వసం: నన్ను చూచినయెడల రక్షించును.

శకా: అతడేమి వాలి కొడుకా; మహేంద్రుడా, రంభ కొడుకా, కాలనేమియా, సుబంధుడా, రుద్రుడా, రాజా, ద్రోణ పుత్రుడా, జటాయువా, చాణక్యుడా, దుంధుమారుడా, త్రిశంకువా, వీరెవ్వరు వచ్చిన నిన్ను గావలేరు. పూర్వము భారత యుద్ధములో సీతను చాణక్యుడు చంపినట్లు, జటాయువు ద్రౌపదిని జంపినట్లు నిన్ను జంపెదను. (కొట్టబోవుచున్నాడు.)

వసం; హా తల్లీ, ఎక్కడనున్నావు? హా ఆర్య చారుదత్తా; ఈ మనుజుడు తన కోరిక విఫలమైనందున నన్ను గాసిబెట్టుచున్నాడు. కానిమ్ము యెలుగెత్తి యేడ్చెదను. వసంతసేన గొంతెత్తి యేడ్చెననిన నాకు సిగ్గుచేటు. ఆర్య చారుదత్తునకు నమస్కారము.

శకా: చావుము, పుట్టుదాసీ; చావుము. (గొంతు నలిపి చంపుచున్నాడు.)

వసం: (నిశ్చేష్టయై క్రింద పడును.)

శకా: (సంతోషముతో) పాపపు పుట్ట దుర్వినయమునకు బుట్టినిల్లైన యీ వసంతసేననుఁ దన ప్రియుని గలియవలెనని వచ్చిన దానిని దాని హృదయగతుడైన బ్రియునితోగూడ చంపివేసితిని. నా శూరత్వము నిదే చాటుచున్నాను. భారతమునందు సీతవలె నిట్టూర్పులు విడుచుచున్నది. తన్ను గోరిన నన్ను నిరాకరించినదన్న కోపమున నీవేశ్యను పాడువారిన యీయుద్యానవనమున జంపితిని. నాశౌర్యమును జూచి ద్రాపదివంటి నాతల్లియు, దండ్రియు సంతోషింతురు. కానిమ్ము. యీ ముదుసలి జంబుక మిటే వచ్చుచున్నాడు. దూరముననే నిలుచుండెదను. (అట్లు చేయును.)

(అంతట చేటునితో విటుడు ప్రవేశించును.)

విటు: స్థావరక చేటుని ననునయించితినిగదా. ఇక శకారుని సమీపించెదను. (కొంచెము నడచి తనలో) త్రోవలో నొక చెట్టు కూలి యొక స్త్రీ మృతిజెందినది. ఆ పాపాత్ము డీపని చేసియుండునా; ఓరీ; పాపాత్మా ఏమీ? యిట్టి యకార్య మొనర్చితివి. ఈ పాప కార్య మొనర్చిన నిన్ను జూచిన మాకుగూడ పాపము చుట్టుకొనును. శకారుడు వసంతసేనం జంపియుండునేమో; నిర్నిమిత్తముగా నామనస్సు సందేహించుచున్నది. దేవతలు సర్వదా నామెకు శుభము జేకూర్తురు గాక. శకారుని సమీపించి (ప్రకాశముగా) ఓయీ; స్థావరక చేటుని తీసుకొని వచ్చితిని.

శకా: బావా! నీకు స్వాగతము. నాయనా! స్థావరక చేటా; నీకు స్వాగతము.

చేటు: మ కేమండీ.

విటు: నా న్యాసము నాకు నొప్పగింపుము.

శకా: న్యాసమనగా నెట్టిది ?

విటు: వసంతసేన.

శకా: పోయినది.

విటు: ఎక్కడకు ?

శకా: నీ వెనువెంటనే.

విటు: నావైపునకు రాలేదే!

శకా: నీవేదిక్కుగా బోయితివి ?

విటు: పూర్వదిక్కుగా తూర్పునకు.

శకా: ఆమె దక్షిణపుదిక్కుగా బోయినది.

విటు: నేను దక్షిణదిక్కుగా.

శకా: అయితే ఆమె ఉత్తరదిక్కునకు బోయినది.

విటు: నీ యసందర్భపు మాటలకు నా యంతరాత్మ మిగుల కలవరపడుచున్నది. నిజము చెప్పుము.

శకా: బావా; నాతల నీ రెండుపాదములమీాద బెట్టి చెప్పుచున్నాను. నీహృదయమును స్వస్థపరచుకొనుము. నేనామెను జంపితిని.

విటు: (విచారముతో) నిజముగా నీవామెను జంపితివా ?

శకా: నామాటయందు నీకు విశ్వాసము లేకున్నచో మొదట రాష్ట్రియశ్యాలకుని శౌర్యము జూతువుగాక. (ఆవైపు జూపుచున్నాడు)

విటు: హా! చచ్చితిని. మందభాగ్యుడను. (మూర్ఛిల్లుచున్నాడు.)

శకా: హా; హా; బావా; పెద్దనిద్దురబోయినావా ?

చేటు: బావా; ఊరడిల్లు మూరడిల్లుము. అనాలోచితముగా బండితోలుకొనివచ్చి, యీమె చావునకు నేనే మొదటి కారణమైతిని.

విటు: హా; వసంతసేనా; నీ మరణముతో దాక్షిణ్యోదక వాహిని యింకిపోయినది. రతి స్వదేశమునకుఁ దరలిపోయినది. హా; మండితాలంకృతీ; చారువదనా; క్రీడారసోద్భాసినీ, సౌజన్యనదీప్రహాస పులినా, మావంటివారి కాశ్రయమైనదానవుగదా; హా; సౌభాగ్య పణ్యాకరమా; అక్కటా; మనోభవుని విపణి యంతరించెను. (కన్నీటితో) ఎంతకష్ట మెంతకష్టము. (శకారునితో) పాపాత్ముడవైన నీవీయుజ్జయినీనగరలక్ష్మి నేమిఘనకార్యమని చంపితివి? (తనలో) యీదురాత్ముఁడు డీయకార్యమును నాపై బెట్టునేమో; నేనిపుడే బోయెదను. (పోవుచున్నాడు శకారుడు వచ్చి పట్టుకొనుచున్నాడు.)

విటు: ఓయీ, పాపీ, నన్ను తాకకుము. నీతో చాలును. ఇంక నేబోయెదను.

శకా: ఓయీ; వసంతసేనను నీవే చంపి, నన్ను నిందించుచు, ఎక్కడకు పారిపోవుచున్నావు. నేనిపుడు దిక్కులేనివాడనైతిని.

విటు: అధోగతిపాలైతివి.

శకా: నీకు నూరువరహాల సొమ్మిచ్చెదను. మనుష్యులమీద నేరములుమోపు సంస్థానకుని యుపాయము జూచితివా; నాకు సాయము గమ్ము.

విటు; చీ అవి నీకేయుండనిమ్ము.

స్థావ: పాపము శాంతించునుగాక.

(శకారుడు నవ్వును.)

విటు: నవ్వ చాలును. అది యపకారియై యవమానము గల్గించును. నీ కపటప్రేమ చాలును. నీతోడి చెలిమినిఁ నిర్గుణ ధనుస్సువలె విడిచివేయుదును.

శకా: బావా; అనుగ్రహింపుము, అనుగ్రహింపుము. రమ్ము తామరకొలనులో జలకమాడు కొందము.

విటు: పాపాత్ముడవైన నిన్ను సేవించుటచే జనులు నన్ను గూడ దోషిగ నెంతురు. ఈగతించిన స్త్రీలతిని గని యూరిలోని పడతులెల్లరు భయము జెందుదురు. (కరుణతో) వసంతసేనా! మఱియొక జన్మమందైన వేశ్యగా పుట్టకమ్మా, సుందరీ, శీలా; మంచి కులమున జన్మింపుమమ్మా.

శకా: నాపుష్పకరండకజీర్ణోద్యానమునందు వసంతసేనను జంపి యెక్కడకు బారిపోయెదవు రమ్ము. మాబావగారియెదుట వ్యవహారము జరిపించెదను. అక్కడ చెప్పుకొందువుగాని?

విటు: ఛీ! మూర్ఖా; (కత్తి దూయుచున్నాడు.)

శకా: (బెదురుచు దగ్గరగా వచ్చి) అరే; భయపడితివా; అయిన నీవికబొమ్ము.

విటు: (తనలో) ఇచ్చట నేనుండతగదు. కానిమ్ము. పూజ్యులైన శర్విలకుడు, చందనకుడు మొదలగువా రున్నయెడకు బోయెదను. (నిష్క్రమించును.)

శకా: పోయి చావుము. ఓరీ, స్థావరకా; పుత్రకా; చేటా; నేను చేసిన పని యెట్టిదిరా?

చేటు: భట్టారకా; మిక్కిలి కూడని పని చేసితిరి.

శకా: ఓరీ; చేటా, నే వకార్య మొనరించితినిరా (నగల మూట విప్పి) ఇవిగో యీ సొమ్ములు నీవు పుచ్చుకొనుము. ఇవి

నీ కిచ్చుచున్నాను. నే నలంకరించుకొని నప్పుడు నీవు వీనిని ధరింపుమని మాయాజ్ఞ.

చేటు: ఇవి మీకు శోభించును కాని, మావంటివారికి వీనితో నేమిపని?

శకా: అయితే నీవు పొమ్ము. ఈ యెడ్లజతను దోలుకొనిపోయి పై మేడ వసారాలో నుంచుము. ఇంతలో నే వత్తును.

చేటు: మీయాజ్ఞప్రకార మట్లే చేసెదను.

శకా: ఆత్మరక్షణకై బావ తప్పుకొనెను. చేటుని సౌధోపరి భాగమున సంకెలలు వేసి యుంచెదను. ఇప్పుడీ రహస్యము బైటపడ కుండును. ఇక నేనుకూడ పోయెదను. కాని యీ వసంతసేన చచ్చినదో లేదో చూచెదను. చావనిచో మరల చావగొట్టెదను. (చూచి) చావనే చచ్చినది కానిమ్ము, ఈ పై గుడ్డ నీమెపై గప్పెదను. దీనిపై నాపేరున్నది. ఎవరైన పెద్దమనుష్యులు చూచినచో గుట్టు బయట పడును. కాబట్టి గాలికి రాలిన ఎండుటాకులతోఁ గప్పివేయుదును. (అట్లు చేసి ఆలోచించి) సరి. ఇంక నేను న్యాయస్థానమున కరిగి చారు దత్తునిపై నభియోగము దెచ్చెదను. సార్థవాహ చారుదత్తుడు ధనాశచే నాజీర్ణకరండ కోద్యానమునకు వసంతసేనను దెచ్చి చంపెనని ఫిర్యాదు చేయుదును. చారుదత్తుని సర్వనాశనము చేయుటకై కపటోపాయ మొకటి పన్నితిని. పవిత్రమైన నగరమున దారుణ పశువధ జరిగినట్లు నేను సంతోషింతును. ఇక నేను వెళ్ళుదును. (వెళ్ళుచు అటుచూచి భయముతో) నేనెటువైపు వెళ్ళినను, నావైపుననే యీ దుష్టసన్యాసి కావిబట్టతో నాకెదురగుచున్నాడు. నేను వీనిని ముక్కు పగులగొట్టు టచే నాపైఁ బగ దీర్చుకొనుటకై వీడు నా రహస్యమును బట్టబయలు పెట్టునేమో; ఇప్పుడేమి చేయుదును. సగము కూలిన యీ ప్రాకారపు గోడనుండి దుమికి పారిపోవుదును. దేవేంద్రుడు ముల్లోకములందు

స్వేచ్ఛగా దిరుగునట్లు, హనుమంతుడు లంకాపట్టణ ప్రాకారమును దాటి నట్లు నేనీగోడ దుమికి పోయెదను. ( నిష్క్రమించును )

( అంతట తెర త్రోసికొని భిక్షుడు ప్రవేశము )

భిక్షు: నారగుడ్డ నుదుచుకున్నాను. దీని కొమ్మపై నను నారవే తునా? ఇక్కడ కోతులు చింపివేయునేమో; నేలపై నారవేసిన దుమ్మంటుకొనును. అదిగో అక్కడ గాలికి రాలిన పండుటాకుల ప్రోవున్నది. దానిపై నారవేతును. (అట్లుచేసి) బుద్ధదేవునకు నమ స్కారము. కానిమ్ము ధర్మవాక్యములు చదువుకొందును. (అట్లుచేసి) సరే. స్వర్గము చాలును. బుద్ధోపాసికయైన వసంతసేనకు ప్రత్యుపకారము చేయలేదు. ఆనాడు పది వరహాల సొమ్మిచ్చి జూదరుల బారినుండి తప్పించినది. అప్పటినుండియు నామెకు నేను వెల కమ్మబడినట్లే యెంచుకొనుచుంటిని. (ముందుచూచి) ఏమిా ఆ ఎండుటాకుల నడుమ నుండి నిట్టూర్పు లెసగుచున్నవి. మండు వేసవియెండల నెండుటాకులు తడి బట్టనుండి పడిన నీటిబొట్లవలన తడిసి, విప్పిన పక్షిరెక్కలవలె విస్తరించినవి.

వసం: ( తెలివి వచ్చి చేయి చాపుచున్నది )

భిక్షు: ఆహా; ఆహా; ఏమిది. సహజాలంకారసహితమైన స్త్రీ హస్తమొకటి కనబడుచున్నదే. ఏమిది; రెండవ హస్తము గూడనా; ( లెస్సగా పరికించి ) యీా చేయి యెవరిదో గుర్తుపట్టగలనేమో! తెలిసి నది. పూర్వము నాకుపకారము చేసి యభయ మిచ్చినదే యీాహస్తము, నిజము. అయినను జూచెదగాక. ( ఆకు లొత్తిగించి చూచి ) ఆ బుద్ధో పాసికయే యీామె.

వసం: ( దాహామని సంజ్ఞ చేయుచున్నది )

భిక్షు : త్రాగుటకు జలము గోరుచున్నదే. దిగుడుబావి దూరమున నున్నది. నేనేమి చేయుదును. కానిమ్ము నాకాషాయ వస్త్రమును పిండి దాహము దీర్చెదను. (అట్లు చేయును)

వసం : ( తెలివి దెచ్చుకొనును )

(భిక్షుకుడు నారపంచెతో విసరుచున్నాడు)

వసం : అయ్యా, మీ రెవ్వరు ?

భిక్షు : పది వరహా లిచ్చి నన్ను గొనిన బుద్ధోపాసిక నన్ను మఱచెనా.

వసం : లేదు. మరువలేదు. అయినను మీరు చెప్పిన విషయము జ్ఞప్తికి రాలేదు. నేను దీర్ఘనిద్ర జెందిన నెంత బాగుండును.

భిక్షు : బుద్ధోపాసికా ; ఇదేమి ?

వసం : ( విచారముతో ) వేశ్యాభావమున కిది తగినదే.

భిక్షు : బుద్ధోపాసికా ! లెమ్ము. నీ సమీపమునున్న చెట్టు నల్లుకొన్న తీగ నూతగా గొని లేచి నిలువుము ( తీగ నందిచ్చును )

( వసంతసేన అట్లు చేసి నిలువపడును )

భిక్షు : ఈ యెదుటనున్న విహారమున మా ధర్మభగిని కలదు. నీ వక్కడకేగి కొంత తడవు విశ్రమించి తదనంతరము నీయింటి కరుగ వచ్చును. మెల్లమెల్లగా నడువుము. బుద్ధోపాసికా ; కొంచె మెడముగా నడువుము. నీవా స్త్రీవి. తరుణివి. నేనో బౌద్ధసన్యాసిని. కనుక నా ధర్మమిది. హస్తసంయుతుడు, ఇంద్రియ సంయుతుడు, నగు వాడే మనుజుడు. అట్టివానికి రాజకులము కానీ, పరలోకము గానీ; నిశ్చయముగా శుభప్రదమె యగును. ( అందఱు నిష్క్రమింతురు )

వసంతసేనా మోటనమను సప్తమాంకము

సమాప్తము

---

# మృ చ్ఛ క టి క ము

## న వ మాం క ము

(అంతట శోధనకుడు ప్రవేశించుచున్నాడు)

శోధ: అధికరణాధికారులు నన్ను బిలిచి "ఓరీ; శోధనకా; అధికార మండపమును శుభ్రపరచి యాసనములు వేయుము" అని నాకాజ్ఞాపించిరి. నేనచట కిప్పుడు పోవుచున్నాను. (నడచి) ఇదిగో; వ్యవహార మండపము. ఇందు బ్రవేశింతును. (మండపము లోనికిఁ బోయి శుభ్రపరచి, ఆసనములువేసి ప్రకాశముగ) అన్నియు సిద్ధము చేసితినని యధికారులకు విన్నవింతును (ముందుచూచి) ఇదుగో రాష్ట్రియ శ్యాలకుడు. ఇతను దుర్జనుడగుటచే వీనికంట బడరాదు. కావున నిందేచాటున నుండెదను. (అట్లు చేయును)

(అంతట నుజ్వలవేషధారియై శకారుడు వచ్చును)

సలిలోదక నీరములచే స్నానమాడి, సుందరాంగులగు స్త్రీలు, తరుణులు, ఉవిదలు, నన్ను బరివేష్టింప గంధర్వునివలె యీయుద్యాన వనిలో సుఖముగా నాసీనుఁడనై యున్నాను. ఒకప్పుడు జుట్టుముడి వేసికొని, మఱియొకప్పుడు జునపములుగా దువ్వి, ఇంకొకప్పుడు ముంగురులుదిద్ది, వేరొకప్పుడు, విరియబోసికొని, యలంకరించుకొనిః రాజుగారి మరదినని, చిత్రవిచిత్రచర్యలు గలవా డనిపించుకొందును.

విసపుకంతి కడుపులోని పురుగువలె యేదో సందు చేసుకొని, యీవల బడితిని. ఇప్పుడు నేనుచేసిన దౌష్ట్య మెవ్వని తలపై

మోపుదును (జ్ఞప్తికిఁ దెచ్చుకొని) ఆ; స్ఫురించినది. దరిద్ర చారుదత్తునిపై యీ నింద పడవైతును. ఈతడు దరిద్రుడగుటచే నెల్లరు నామాట విశ్వసింతురు, కానిమ్ము. చారుదత్తుడు ధనాశచే వసంతసేనను గొంతుపిసికి చంపినాడని పత్రము వ్రాసి, ముందుగా నిచ్చెదను. ఇదే; వ్యవహార మండపము. లోపలకు వెళ్ళెదను. (ముందుకు నడచిచూచి) ఇక్కడ యాసనము లన్నియు వేయబడి యున్నవి. కాని అధికరణభోజులు వచ్చునంతకు యీ ముంగిటలోని గరికమీద గూరుచుండి, వారి రాక నిరీక్షించెదను.

(అట్లు చేయును)

శోధన: (మఱియొక వైపునుండివచ్చి యెదుటచూచి) వీరే యధికరణికుడు. వేంచేయుచున్నాడు. నేను సమీపించెదను.

(అట్లు చేయును)

(అంతట శ్రేష్ఠి కాయాస్థాది పరివారముతో నధికరణికుడు ప్రవేశించి)

అధి: ఓహో; శ్రేష్ఠికాయస్థులారా;

శ్రేష్ఠికాయ: స్వామి ఆనతిత్తురుగాక.

అధిక: పరుల చిత్తమును దెలిసికొనజాలక పోవుటచే వ్యవహార మధికరణులకు కష్టసాధ్యముకదా! ప్రచ్ఛన్నముగా నొనర్చిన అధర్మములను, నకార్యములను స్వార్థపరులై దుర్జనులు పరులపై మోపి, స్వదోషములను గుప్తము గావించుకొందురు. ఇరు కక్షులవారు నట్లు దోషముల గప్పిపుచ్చి వాదించుటచే న్యాయము కనుగొనుట కష్టమగును. అందుచేత నాపాపము అధికరణులకుఁ జుట్టుకొనును. సజ్జనులాపదల పాలౌదురు. గుణగ్రహణ పారీణు లరుదుగా నుందురుకదా; అధికరణికుడు, శాస్త్రజ్ఞానము కలవాడును, పరుల కపటము గ్రహింప

నేర్పరియైన వాడును, వక్తయు, అక్రోధనుండును. శత్రుమిత్రుల కార్యములయందు సమభావము కలవాఁడును మునుముందు కార్యము నిశ్చయింపక, విమర్శించి మాటలాడువాఁడును, ధర్మాత్ముఁడై, లోభము లేనివాడును, బలహీనులకు నండయై, దుర్జనులకు గుండె లదరజేయు వాఁడును, సత్యవాక్యబద్ధుడు, రాజువలన భయము లేనివాఁడై యుండ వలెను.

శ్రేష్ఠికా: తమ గుణముల యందును దోషమారోపించుట వెన్నెలయందు చీకటి యున్నదనమాటే.

అధికర: శోధనకా; అధికరణమండపమునకు దారిచూపుము.

( అని నడచు చున్నాడు )

శోధన: అయ్యా; ఇదే, అధికరణ మండపము. ఇటు దయ చేయుడు.

( అందరు ప్రవేశించుచున్నారు )

అధిక: భద్రా; శోధనకా నీవుబయటకు బోయి యెవరెవరు వచ్చినారో తెలిసికొని రమ్ము.

శోధన: చిత్తము. ( వెళ్ళి ) అయ్యా; ఇక్కడ కార్యార్థులై వచ్చినవా రెవరెవరని యధికరణు లడుగుచుచున్నారు.

శకా: ( సంతోషముతో ) అధికరణులు వచ్చినారు. (సాటోవ ముగా నడచి ) నేను వరపురుషుడను. మనుష్యుడను. వాసుదేవుడను, రాష్ట్రియశ్యాలకుఁడను. నేనే కార్యార్థినై వచ్చితిని.

శోధ: ( తొందరతో ) మొట్టమొదటనే రాజ్ఞశ్యాలకుడు కార్యార్థియా? కానిమ్ము. ( ప్రకాశముగా ) అయ్యా క్షణకాల ముండుడు. అధికరణులతో జెప్పి వత్తును. ( లోపలకు బోయి) అయ్యా; రాజ్ఞశ్యాలకుడు కార్యార్థియై ద్వారముకడ నున్నవాడు.

అధి : మొట్టమొదటనే రాజ్ఞశ్యాలకుడు కార్యార్థియా ; సూర్యోదయ సమయమున నుపరాగమువలె మహాపురుష నాశనమును సూచింపుచున్నదే. శోధనకా ; వ్యవహారము వ్యాకులత గలుగ జేయునని తోచుచున్నది. ఈవేళ నీవ్యవహారము చూడబడదని నీవు పోయి చెప్పుము.

శోధ : (బయటకు బోయి) అయ్యా ; నేడునిన్ను బొమ్మనియు నీ వ్యవహారము చూడరనియు యధికరణికులు చెప్పుమనిరి.

శకా : ( కోపముతో ) ఏమీ ! నేడు నా వ్యవహారము చూడక పోయినచో వెంటనే మాయక్క పెనిమిటి రాజుతోను మాయక్కతోను, మాయమ్మతోను చెప్పి, యీ యధికరణిలను పదవుల నుండి తొలగించి, వేరొక యధికరణిల నిందు నిలపగలనని చెప్పుము. చూడుము. ( పో బోవుచున్నాడు )

శోధ : అయ్యా క్షణకాల మాగుడు. లోపలకుఁ బోయి యధికరణికులకు నివేదించి వచ్చెదను. ( లోపలకువెళ్ళి ) అయ్యా ; రాష్ట్రియశ్యాలకుడు కోపమువచ్చి యిట్లనెను.

అధి : మూర్ఖుడు పట్టినపట్టును నెగ్గించుకొనగలడు. నీవుపోయి వాని వ్యవహారము జూచెదము రమ్మని చెప్పుము.

శోధ : ( బయటకు వెళ్లి ) అయ్యా ; అధికరణికులు మీా వ్యవహారము చూచెదము రమ్మని చెప్పినారు ( లోపలికి రండు )

శకా : ( తనలో ) ఏమీా ; మొదట నా వ్యవహారము జూడమని చెప్పి, మరల నిప్పుడు చూచెద మనుచున్నాడు. అధికరణికలు నాకు భయపడి నట్లున్నారు. కానిమ్ము. వ్యవహారము నేను చెప్పినట్లెల్ల వీరిచే జేయింతును. లోనికి వెళ్ళెదను. ( వెళ్లి ) అయ్యా ; మాకు సుఖము మీాకుకూడ సుఖము. పోనిండు సుఖము నీయదు.

అధి: (తనలో) కార్యార్థి యెంత స్థిరనిశ్చయుఁడై యున్నాఁడు. (ప్రకాశముగ) కూర్చుండుము.

శకా: ఈ నేల యంతయు నాదే. నాకిష్టము వచ్చినచోటఁ గూర్చుండెదను. (శ్రేష్ఠిం జూచి) ఇందుఁ గూర్చుందునా? (శోధకునితో) ఇందు కూరుచుందునా, (అధికరణుల నెత్తిమీద చేయిపెట్టి) ఇందు కూర్చుందునా, (అని భూమిమీద కూరుచుండును)

అధి: నీవేనా కార్యార్థివి?

శకా: అవును. నేనే కార్యార్థిని.

అధి: వ్యవహార మేదియో చెప్పుము.

శకా: నా కార్యమును నేను నీ చెవిలో చెప్పెదను. నేను దీపపు ప్రమిదలో నున్న దీపమువంటి పవిత్రవంశమున జన్మించితిని. రాజుగారికి మాతండ్రి మామగా రగుదురు. మాతండ్రికి ప్రభువు జామాత యగును. రాజుగారికి నేను బావమరదిని, ప్రభువు నా యక్క పెనిమిటి.

అధి: అది మాకు దెలిసిన విషయమే. కులముతో బనియేమి? శీలమే ప్రధానము. మంచి భూమిలో ముండ్లకంచెలు మొలచుటలేదా. కావున నీవ్యవహార మేదో తెల్పుము.

శకా: ఇదిగో చెప్పుచున్నాను. నేనేమి తప్పుచేసినను నన్నెవరు నేమియు చేయఁ జాలరు. కాబట్టి నా యక్క పెనిమిటి చాల సంతోషించి, నేను విహరించుటకును సంరక్షణము చేసుకొనుటకును నాకు సర్వోద్యాన శిరోమణి యగు పుష్పకరండక జీర్ణోద్యానమును బహుమానముగా నిచ్చెను. నేను నిత్యము దానిని బరిశీలించి, యెండినభాగములను దీయించి, దానికి బలము నిచ్చు పనులు చేయించి, పనికిమాలిన దానిని గోయించి బాగుచేయించుటకు నే నచ్చటకు బోవు

చుందును. దైవయోగమున నేనీవేళ నందులో స్త్రీ శవము నొక దానిని జూచితిని. లేదు, చూడలేదు.

అధి: విపన్నరాలైన ఈ యబల యెవ్వతెయో? తెలిసి నదా?

శకా: అధికరణ భోజకులారా; తెలియలేదు. వందలకొలది మేలిమి బంగారునగలను ధరించి యీ యుజ్జయినీ నగరమున కలంకార మనదగిన యీ యువతిని నేనెఱుగనా? వసంతసేనను ధనాశచే నెవరో నిర్జనమైన యీ జీర్ణ పుష్పకరండకో ద్యానమున బాహుపాశ బల త్కారమున జంపివేసినారు. నేనుకాదు. (గొణుగుచు బట్ట మొగమున కడ్డముగా వేసుకొన్నాడు)

అధి: ఆహా; నగరరక్షకుల, కెట్టి ప్రమత్తత! శ్రేష్ఠి కాయస్థు లారా "నాచేతకాదు" అనునది వ్యవహారపదము.

శ్రేష్ఠి: చిత్తము. తాము సెలవిచ్చినట్లే వ్రాసికున్నాము.

శకా: (తనలో) తొందరపడి వేడిపాయసము జుట్టుకొన్నట్లు నన్ను నేనే నాశనము జేసుకొంటిని కానిమ్ము. ఓ యధికరణులారా! భోజకులారా! నేను జూచితినని యంటిని. ఏల యీ కోలాహలము. అది తుడిచివేయండి(కాలితో వారు వ్రాసినదానిని దుడిచివేయును).

అధి: ధనమున కాశించి యీమెను బలాత్కారమున జంపినట్లు నీకెట్లు తెలిసినది?

శకా: మెడలోను, లలాటమునను నలంకారములుండు స్థాన ములు శూన్యములై యుండుటచే నట్లూహించితిని.

శ్రేష్ఠి: ఇది యుచితమె.

శకా: (తనలో) అమ్మయ్యా; నా యదృష్టము బాగున్నది. నేను బ్రదికితిని.

శ్రేష్ఠి: ఈ వ్యవహార మెట్టివారికి జెందును.

అధిక: ఇక్కడ వ్యవహారము రెండు విధములు.

శ్రేష్ఠి: ఆ రెండు విధము లెట్టివి ?

అధిక: వాక్యానుసారమని యర్థానుసారమని రెండువిధములు. అందు మొదటిది. అర్థి ప్రత్యర్థుల వాదముచేత నగునది. రెండవది యధికరణికుల బుద్ధివలన నుత్పన్నము కాగలది.

శ్రేష్ఠి: అయినచో నీవ్యవహారము వసంతసేన తల్లికిఁ జెందినది.

అధిక: అవునంతే ! ఓరీ ; శోధనకా ; వసంతసేన తల్లిని భయ పెట్టక యిక్కడకుఁ దీసుకుని రమ్ము.

శోధ: చిత్తము ( వెళ్లి, వసంతసేన తల్లితోఁ బ్రవేశించి ) అమ్మా ; ఇటు రమ్ము.

వృద్ధురా: (తనలో) నా కుమార్తె ప్రియ సమాగమమున కై చారుదత్తుని యింటికేగి తడవాయెను. ఇంటి కింకను రాలేదు. ఈచిన్న వాడు నన్నధికరణికు లెందుకో రమ్మనుచున్నారని పిలుచుచున్నాడు. నా గుండెలు దడదడ కొట్టుకొనుచున్నవి. అయ్యా ; అధికరణ మండ పమునకు దారి చూపుము.

శోధ: అమ్మా ; ఇటురమ్మిటు రమ్ము. ఇదే వ్యవహార మండపము.

వృద్ధురాలు ; ( సమీపించి ) ఆర్యులారా ; తమకందరకు సుఖ మగుగాక.

అధి: స్వాగతము. కూరుచుండుము.

వృద్ధు: చిత్తము ( కూరుచుండును )

శకా: ( పరిహాసముగా ) వచ్చితివా ; వృద్ధకుట్టినీ ;

అధి : వసంతసేన తల్లివి నీవేనా ?

వృద్ధ : అవునండీ.

అధి : ఇప్పుడు వసంతసేన యెందేగినది ?

వృద్ధ : మిత్రగృహమునకు.

అధి : ఆమె మిత్రుని పేరేమి ?

వృద్ధ : ( తనలో ) ఛీ; ఛీ; ఎంత లజ్జాకరమైన విషయము. (ప్రకాశముగా ) ఇది సామాన్య లడుగదగినది. కాని మీావంటివా రుగ దగినదికాదు.

శ్రేష్ఠికాయస్థులు : సిగ్గుపడనక్కరలేదు. వ్యవహార మడుగు న్నది. ఇందు తప్పులేదు. చెప్పుము.

వృద్ధ : వ్యవహారమా ; అట్లైన చెప్పెదను. ఆర్యులారా ; యడు. అతడు సార్థవాహ వినయదత్తుని మనుమడు. సాగరదత్తుని మారుడు సుగృహీత నామధేయుడు, పూజ్యుడైన చారుదత్తుడు, రడు కోమటివాడలో కాపురమున్నాడు. నాకూతురు అతనిని మించినది, ఇప్పు డక్కడికే వెళ్లినది.

శకా : ఆర్యులారా ; వినండి. ఈ మాటలు వ్రాసుకోండి. వా గాద మా చారుదత్తునితోడనే.

శ్రేష్ఠి : చారుదత్తుడు మిత్రుడనిన దప్పులేదు.

అధి : ఇప్పు డీ వ్యవహారము చారుదత్తునకు సంబంధించినది.

శ్రేష్ఠి : అవునంతే.

అధి : ధనదత్తా; వసంతసేన చారుదత్తుని యింటికేగెనని యము. ఇది వ్యవహారమునకుఁ బ్రథమ పాదము. ఇప్పుడు ఆర్య రుదత్తుని పిలిపింపవలయును. సరే ఆయన వ్యవహారమే ఆయన హ్వానించును. శోధనకా నీవు పోయి ఆర్య చారుదత్తుని బిలుచుకొని

రమ్ము. వారిని తొందరచేయక భయపెట్టక స్వేచ్ఛగా దోడ్కొని రమ్ము. అధికరణికులు మిమ్ము చూడగోరుచున్నారని చెప్పుము.

శోధన : చిత్తము. (పోయి చారుదత్తునితో ప్రవేశించి) ఇటు రండు, ఇటురండు.

చారు : ( ప్రవేశించి, ఆలోచించి ) నాకులమును, శీలమును నడవడియు, లెస్సగా నెఱిగిన ప్రభు సమయమున నన్నాహ్వానించుట జూడ నా యవస్థ యెటులుండునో యని భీతియు, శంకయు గల్గుచున్నది. ( సవితర్కముగ ) సంకెళ్లు వదలించుకొని పాఱిపోవు గొల్ల పిల్లవాడు నా బండి యెక్కి పోయినట్లు చారులు చెప్పగా విని, రాజు నా కిప్పుడీ వర్తమానము పంపియుండునేమో ; సరే! ఎందుకీ విచారణ. అధికరణ మండపమునకే పోవుచున్నానుగదా ? నాయనా; శోధనకా; వ్యవహార మండపమునకు దారి చూపుము.

శోధ : అయ్యా ; రండి, రండి. ( ఇద్దఱు నడచుచున్నారు )

చారు : కాకులు బిగ్గరగా నఱచుచున్నవి. నా యెడమకన్నదరుచున్నది. అధికారుల సేవకులు నన్ను బిలుచుచున్నారు. ఈయ నిమిత్తములు చూడ నేను నాకేదో యాపదరానై యున్నట్లు నా డెంద మాందోళన మందుచున్నది.

శోధ : రండి, అయ్యా ! రండి, సావకాశముగా రండి.

చారు : ( నడచి ముందుకుచూచి ) ఎండిన చెట్టుకొమ్మ మీాద గూరుచుండి కాకి సూర్యునివైపు తిరిగి కఠినముగా కూయుచున్నది. నా యెడమకన్ను మాటిమాటికి అదరు చున్నది. ఇప్పుడు నాకేదో ఘోరమైన యాపద మూడనున్నదనుట సత్యము. ( మఱియొక వంక జూచి ) అయ్యో! ఇదియేమి. తెల్లత్రాచుపాము చుట్టలుచుట్టుకొని, నావైపు చూచుచు నాలుకచల్లార్చుచు, నాలుగుకోరలు గన్పట్ట,

బుస్సుమనుచు కాటువేయుటకు సిద్ధముగ నున్నట్లు దారి కడ్డముగ నిద్రించుచున్న దే! ఈనేల బురదగా నున్నను పాదములు జారిపోవు చున్నవి. ఈయపశకునము లన్నియు జూడ నాకు మహాఘోరమైన, యపమృత్యువు సంప్రాప్తించునట్లు దోచుచున్నది. అయినను విచార మేల; నా కులదేవతలు నన్ను రక్షింతురుగాక?

శోధన: అయ్యా; రండు. ఇదే యధికరణ మండపము. ప్రవేశింపుడు.

చారు: (ప్రవేశించి అంతటఁ గలియజూచి) ఏమీ? ఈయధికరణమండప సౌభాగ్యసంపద.

వ్యవహారమందలి సత్యాసత్యములు విమర్శింపఁ జింతానిమగ్నులైన సచివులే యుదకములుగ వార్తాహరులు, దూతలు, అలలుగ, శంఖములుగ పరిసరముల జరించు జనులు జలచరములుగ, కర్ణేజపాది సంకీర్ణ వాశకులు కంకపక్షులుగ, ముసలికరణములు సర్పములుగ, నీతి పథమున నెగుడుదిగుడైన తటములు గలిగి, సకలహింసలకు నాశ్రమ మైన, ఈవ్యవహార మండపము సముద్రమో యన నొప్పుచున్నది. ఇప్పుడిందు బ్రవేశింతును. (ప్రవేశించి ద్వారము తగులుటనభినయించి) నాకు యెడమకన్ను, యెడమభుజము నదరుచున్నవి. సర్పము దారి నెదురగుచున్నది. ఇవిచూడ నాకు నశుభము శుభముగూడ దోచు చున్నవి. అయిన నిందు బ్రవేశింతును. (అట్లు చేయును)

అధికర: ఓహో; చారుదత్తు డితడా! ఉన్నతమైన నాసికయు విశాల నేత్రములును గలిగిన యీ శుభలక్షణుని దోషిగా నెంచు టెట్లు? శుభలక్షణములుగల గోవులు, నేనుగులు, గుఱ్ఱములు నరులు దోషులు గారు.

చారు : ఓహో ; అనికృతులకు సుఖముగుగాక, నియుక్తులకు సేమమా ?

అధికర : (సంభ్రమముతో) ఆర్యులకు స్వాగతము. శోధనకా; ఆర్యులకాసనము దెచ్చి వేయుము.

శోధన : (ఆసనము దెచ్చివేసి) ఆర్యా ! ఇదిగో ; ఆసనము కూరుచుండుడు.

చారు : (కూర్చుండును)

శకా : క్రోధముతో ఓరీ ; స్త్రీఘాతుకా ; వాచ్చితివా ; వచ్చితివా ; ఆర్యా ; వ్యవహార మెంతధర్మముగా నున్నది న్యాయ పరిశీలన మెట్లున్నది ? స్త్రీఘాతుకున కాసనమిచ్చి గౌరవింతురా ?

అధి : ఆర్యా ; చారుదత్తా నీకీమె కుమార్తెతో నీకు ప్రసక్తి గాని, ప్రణయముగాని, ప్రీతికాని కలదా ?

చారు : ఎవరి కుమార్తె ?

అధికర : (వృద్ధురాలిని జూపి) ఈమె కుమార్తె.

చారు : (లేచి) ఆర్యురాలికి నమస్కరించు చున్నాను.

వృద్ధు : నాయనా ; చిరంజీవివి కమ్ము. (తనలో) ఆహా ! ఇతడా చారుదత్తుడు నాబిడ్డ యౌవనము తగినతావున దాచుకొని సార్థకము చేసికొన్నది.

అధి : అయ్యా ; ఆ వేశ్యమీకు మిత్రమా ?

చారు : (సిగ్గు నటించును)

శకా : భయముచేతనైనను, సిగ్గుచేతనైనను, దన యకార్యము నీతడు కప్పిపుచ్చుచున్నాడు. ధనమున కాశపడి యీతడే యామెను జంపెను. ఈతని చరిత్రము మీరు నమ్మదగదు.

చారు : ( సిగ్గుతో ) ఆర్యులారా; వేశ్య నాకు మిత్రమని నేనెట్లు నుడువుదును. యౌవన మపరాధము చేసెను. కాని చరిత్ర కాదు.

శ్రేష్ఠి : ఆర్యా ; చారుదత్తా ; సిగ్గు వలదు. ఇది వ్యవహారముగదా ?

వ్యవహారము లందు విఘ్నము లెక్కువ. నీవు సిగ్గువిడిచి సత్యము చెప్పుము. మేము అనృతము గ్రహింప జాలకపోము.

చారు : అధికరణికా ; నా కెవ్వనితో వ్యవహారము ?

శకా : ( ఆటోపముగా ) ఓరీ, నాతోడనే వ్యవహారము.

చారు : నీతో వ్యవహారము నాకు దుస్సహము గదా ?

శకా : ఓరీ ; స్త్రీఘాతుకా, అటువంటి రత్నభూషితురాలై, యసమాన సౌందర్యరాశియైన వసంతసేనను కొట్టిచంపి, యిప్పుడిట్లు కపటము నటించి, యీలాగు దాచిన దాగునా ?

చారు : నీ వసంబద్ధ ప్రలాపివై తివి.

అధి : ఆర్య చారుదత్తా వానితోనేమి ? సత్యము చెప్పుము. ఆ వెలయాలు నీకు మిత్రమా ?

చారు : అది సత్యమే.

అధి : అయ్యా ; వసంతసేన యిప్పుడెక్కడ నున్నది ?

చారు : అయ్యా ; ఇంటికి వెళ్ళినది.

అధి : ఎప్పుడు వెళ్ళినది ? ఎట్లు వెళ్ళినది ? ఎవరితో వెళ్ళినది.

చారు : ( తనలో ) ప్రచ్ఛన్నముగా వెళ్ళినదని చెప్పుదునా ?

అధి : అయ్యా, చెప్పుము.

చారు : ఇంటికి వెళ్ళినది. ఇంక నేమని చెప్పుదును.

శకా : నా పుష్పకరండక జీర్ణోద్యానమును జొచ్చి, ధనాశచే నామె మెడను పిసికిచంపి, యిప్పుడింటి కేగినదని యబద్ధ మాడు చున్నావా ?

చారు : ఓరీ ; అసంబద్ధ ప్రలాపీ, పాలపిట్టను వానజల్లుముంచి నట్లు నిన్ను ముంచ దేమి ? అబద్ధమాడిన నీమోము హేమంతఋతువు నందలి పద్మమువలె కళాహీనమై యున్నది.

అధి : ( తనలో ) పర్వతమును గదలించుటయు, సముద్ర మును దాటుటయు, వాయువును జేతబట్టుటయు నెట్లసంభవములో యీ చారుదత్తుని యందు దోషమారోపించుటయు నట్టిదే, ( ప్రకాశ ముగ ) పూజ్యుడగు చారుదత్తు డిట్టి యకార్య మొనరించునా ? ఇట్టి సర్వలక్షణ సంపన్నుడు——

శకా : ( మాట కడ్డము వచ్చి ) వ్యవహారమున బక్షపాత మగపడుచున్నదే.

అధి : మూర్ఖా ; అవతలకు బొమ్ము. నీవు పామరుడవై వేదార్థంబు లుపన్యసించు చున్నావు నీ నాలుక చీలికలు గాకుండె. మట్టమధ్యాహ్నపు సూర్యుని జూచుచున్నావు. నీదృష్టి యేల చెడదో, మండుచున్న యగ్నిని చేతితో దాకుచుండెడి నీచే నేల దగ్ధము కాలేదో చారుదత్తుని చరిత్ర నపవిత్రముచేయు నిన్నీపుడమి దహింప లేదేమో ! చారుదత్తుడు యాచకులకు మణులన్నియు దానమిచ్చు నప్పుడు సముద్రమున జలమొక్కటియే మిగిలెను. అట్టి గుణనిధి మహాత్యాగి, శత్రువులుకూడ తలంపకూడని ధనాశచే నిట్టి యకార్య మొనర్చునా ?

వృద్ధ : ఓరీపాపాత్మా ; న్యాసముగానుంచిన సువర్ణ భాండమును రాత్రివేళ చోరు లపహరింప, చతుస్సముద్ర సారభూతమైన రత్నావళి నిచ్చెను. అట్టిమహనీయు డీపాటిదాని కాశించి, యిట్టి కూడనిపని చేయునా ? అయ్యో : నాకూతురా ; శావే, అమ్మా ; ( అని యేడ్చుచున్నది )

అధి : ఆర్యా ; చారుదత్తా ; ఆమె కాలి నడకను వెళ్ళినదా ; గూడు బండిలో నేగినదా ?

చారు : అయ్యా ; ఆమె వెళ్ళినప్పుడు నేను చూడలేదు. కాలినడకనేవెళ్ళినదో గూడుబండిలోనే వెళ్ళినదో, నాకు తెలియదు.

( వీరకుడు ప్రవేశించును )

వీర : ( కోపముతో ) నన్ను చందనకుడు కాలితో దన్నుటచే గలిగిన పరాభవముచే నాకు రాత్రి నిదుర లేకయే యెట్లో తెల్లవారె. ఈ యధికరణ మండపములోనికిఁ బోయెదను. ( ప్రవేశించి నమస్కరించి ) ఆర్యమిశ్రులకు సుఖమగుగాక.

అధికరణికు : రక్షకభటుడు వీరకుడా ; ఓయీ, నీవు వచ్చిన పనియేమి ?

వీర : చెఱసాలనుండి తప్పించుకొని పారిపోవుచున్న యార్యకుడగు గోపాలుని కొఱకు వెదకుచున్న మేమొక గూడుబండిని జూచితిమి. నేను దానిలోపల చూడగోరగా జందనకుడు తానుజూచిన జాలుననియు, నేను జూడనక్కఱ లేదనియు గద్దించి, నేను బండినెక్కి చూడబోగా, నన్ను క్రిందికిలాగి గట్టిగా తన్నినాడు. తరువాత తమచిత్తము.

అధి : నాయనా, ఆబండియెవరిదో యెఱుగుదువా ?

వీర : ఆబండి యార్య చారుదత్తుడుగారిది అందు వసంతసేన గూరుచుండి, పుష్పకరండక జీర్ణోద్యానమున విహరింప నేగుచుండె నని బండివాడు చెప్పినాడు.

శకా : అయ్యా ; మీరు మరల వినండి.

అధికర : పండు వెన్నెలగాయు చందమామను రాహువు కబళింపనున్నది. నీర మెంత స్వచ్ఛముగానున్నను ఒడ్డువిరిగి పడినప్పుడు కలుషము కాకుండునా ; వీరకా ; మీతగవు తెలువాత జాతము. ఈయధికరణమండప ద్వారముకడ గుఱ్ఱమున్నది. నీవా గుఱ్ఱమునెక్కి పుష్పకరండక జీర్ణోద్యానమునకేగి, యచట విపన్నరాలైన యాడుది యున్నదో, లేదో చూచి రమ్ము.

వీర : చిత్తము. (పోయి మరల వచ్చి) అయ్యా ; తమ యాజ్ఞాప్రకారము చూచి వచ్చితిని. అక్కడ స్త్రీ కళేబర మొకటి యున్నది. దానిని నక్కలు దొర్లించుచున్నవి.

శ్రేష్ఠి : అది స్త్రీ కళేబరమని నీ వెట్లు తెలిసికొంటివి.

వీర : నక్కలు పీకగా మిగిలిన హస్త పాద, పాణి దేశములచే గుర్తించితిని.

అధి : నిపుణముగా బరిశీలించినకొలది నింద చారుదత్తుని మీదకే వచ్చుచున్నది. ఆహా ; ఈ వ్యవహార న్యాయము మీరరానిది. బురదలో దిగబడిన గోవువలె నా బుద్ధి క్రుంగిపోయినది.

చారు : ( తనలో ) పూవు పూచినతోడనే మకరందమునకు తుమ్మెదలు మూగునట్లు మనుజులకుఁ గాలము మూడినపు డాపద లన్నియెడల సందు దొరకును.

అధి : ఆర్య చారుదత్తా ; సత్యము నెఱింగింపుము.

చారు: పాపాత్ముడు. పరగుణ మత్సరుడు, మూర్ఖుడు, దుష్ట రాగాంధుడై, జాతి దోషమున నసత్యములు సత్యమని చెప్పినంత మాత్రమున దానిని బరిశీలింపవలదా! పూలతీగను వంచి పూవుం గోయజాలని నేను తుమ్మెద రెక్కలబోలు నా యువిద కురులను బట్టుకొని, యేడ్చుచున్న యామెను జంపుదునా?

శకా: ఓహో; అధికరణ భోజులారా; మీరు వ్యవహారమున బక్షపాతమును జూపుచున్నారు. ఇప్పటికి చారుదత్త హతకుడాసనము మీాదనే యున్నాడు.

అధి: శోధనకా; ఇటు రమ్ము. (అని చెవిలో నేదియో చెప్పుచున్నాడు.)

శోధ: (అధికరణులు చెప్పినట్లు చేయుచున్నాడు.)

చారు: ఓ యధికృతులారా; విచారింపుడు. చక్కగా విచారింపుడు. (అని ఆసనమునుండి దిగి క్రింద గూరుచున్నాడు.)

శకా: సంతోషముతో (గంతులు వేయుచు తనలో) నేను చేసిన ఈ యకార్య మీాతని తలపై వైచితిని. చారుదత్తుడు గూరుచుండిన యాసనమున నేను గూరుచుండెదను. (అట్లు చేసి) చారుదత్తా; చూడు, నన్ను చూడు. ఇకనైనను జంపితినని చెప్పుము.

చారు: ఎవడో పాపాత్ముడు చేసిన యకార్యమును బాగుగా విచారణ చేయుడు. (నిట్టూర్పుతో దనలో) ఓమైత్రేయ! ఏమీా; నాకీవిపత్తు, ప్రవిమలవంశ ప్రసూతవైన బ్రాహ్మణీ ఆర్ధాంగీ, కుమారా రోహసేనా; నా యీా యాపద నీ వెఱుగవైతివే సంతోషము నే డిట్లయ్యెనే. నేను మైత్రేయుని, కుమారుని బండినిమిత్తమిచ్చిన వసంతసేన సొమ్ములను మరల నామె కిచ్చి వేయుమనియు

నామె వృత్తాంత మరసి రమ్మనియు బంపి చాలసేపై నది. ఆత డింకను రాలేదేమి ? కారణ మేమైయుండును.

( అంతట నగలమూటతో మైత్రేయుడు ప్రవేశించును. )

మైత్రే: చారుదత్తు డీనగలమూట నిచ్చి, వసంతసేనయొద్దకు వెళ్ళుమని ఇట్లు చెప్పెను. "మైత్రేయా ; బండి నిమిత్తమై వసంతసేన రోహసేనునకు నోంటినిండ నగలుపెట్టి తల్లియొద్దకుఁ బంపెనట. ఆవస్తువులు మరల వామె కిచ్చివేయుము. అవి మనము గ్రహింపరాదు." కావున నే నిప్పు డామెయొద్ద కేగెదను. ( కొంచెము నడచి ముందు చూచి ఆకాశమువంక చెవియొగ్గి ) ఏమీ ; భావా ; లేభిలుడా ; ఓయీ ; నీవిట్లు దీనముగా గాన్పించుచున్నావేమి ; ( విని ) ఏమీ ; ఏమంటివి. ప్రియ వయస్యుడు చారుదత్తు డధికరణ మండపమునకుఁ బిలువబడెననియా ( ఆలోచించి ) అది యేదో అల్పకార్యమైయుండదు. ముందుగా నధికరణ మండపమునకే బోయెదను. తరువాతనే వసంతసేనకడకు వెళ్ళెదను. ( నడచి ) ఇదిగో యధికరణ మండపము. ఇందు బ్రవేశింతును. ( ప్రవేశించి చూచి ) అధికరణభోజులకు సుఖమా ; ఏడీ నా ప్రియ వయస్యు డెక్కడ నున్నాడు ?

అధి: అదిగో నక్కడ నున్నాడు.

మైత్రే: వయస్యా, నీకు సుఖమగుగాక.

చారు: కలుగగలదు.

మైత్రే: నీకుం గుశలమా ?

చారు: అదియును గావచ్చును.

మైత్రే: వయస్యా ; నీవేల యి ట్లుద్విగ్నుడవై యున్నావు నీవీ యధికరణ మండపమునకుఁ రాగతంబేమి ?

చారు: నేను పరలోకహాని నెఱుంగని పాతకినై ధనాశచే నొకయువతిని, రతీదేవివంటిదానిని – తఱువాత వృత్తాంత మాతడు దెల్పును.

మైత్రే: ఏమేమీ?

చారు: (చెవిలో నిట్లని చెప్పును.)

మైత్రే: ఎవ్వ డిట్లు చెప్పినది?

చారు: (చేతితో శకారునిం జూపుచు) ఓయీ, యీతడు నాపాలిటి యముడై యిట్లు కల్పించినాడు.

మైత్రే: ఆమె యింటి కేగినదని యేల చెప్పరాదు?

చారు: నేనట్లు చెప్పినను, ప్రకృతావస్థనుఁబట్టి వారు నామాట విశ్వసింపరు.

మైత్రే: దేవాలయ తటాక, విహార, ఆరామకూప, యూపాదులచే నీ యుజ్జయినీ నగరము నలంకరింపఁజేసిన యీ యార్య చారుదత్తుడు కాలవశమున దరిద్రుడై నంతమాత్రమున నుభయలోకములకు దూరుడై యవినీతుడై ఈ యకార్యమును జేయునా? ఓరీ; నీచుడా; దురాత్మరుడా, రాజ్ఞశ్యాలక; సంస్థానకా; పాపాత్మా; నగలు ధరించిన మర్కటమా; ఉచ్ఛృంఖలకా; నాముందర చెప్పుము. పుష్పించిన మాధవీలతను చిగుళ్ళు తెగునను భయముచే పూవులు కోయజాలని దయార్ద్రహృదయుడగు నా ప్రియవయస్యు డిట్టి యకార్యము చేయునా? ఉండు ముండుము. నీహృదయమువలెనే కుటిలమగు నీదుడ్డుకఱ్ఱతో నీతల పగులగొట్టెదను.

శకా: (సక్రోధముతో) ఆర్యమిశ్రులారా; వినుండి, వినుండి. వివాదముగాని, వ్యవహారముగాని, నాకును చారుదత్తునకును గలదు. కాని మధ్య వీడెవడో కాకియడుగువలె నున్న తలవాడు. గంతులు

వేయుచు నాతల పగులగొట్టెద ననుచున్నాడు. వద్దు, వద్దు. ఓరీ దాసీపుత్రా దుష్ట బ్రహ్మచారీ ;

మైత్రే : (దుడ్డుకఱ్ఱపై కెత్తి వెనుకటిమాటనే యనుచున్నాడు.)

శకా : ( క్రోధముతో మైత్రేయుని కొట్టుచున్నాడు. )

మైత్రే : ( మరల వానిని గొట్టుచున్నాడు )

( ఇట్లువారు కొట్టుకొనుచుండ మైత్రేయుని చంకలోనుండి నగల మూట క్రిందపడును )

శకా : ( నగలుతీసి చూచి ) ఓయధికృతులారా ; చూడండి, చూడండి. ఇవిగో యాదీనురాలి నగలు. వీనికొఱకే చారుదత్తు డీమెను జంపినాడు.

( అధికారులు తలలు వంచుచున్నారు )

చారు : తనలో ఇట్టిగడ్డుసమయమున నీ నగలమూట యిక్కడ పడినది. నాదురదృష్టముననే నధఃపతితుడనై తిని ఇంకను కూలిపోవు చున్నాను.

మైత్రే : ఓయీ ; వయస్యా ; జరిగినవృత్తాంత మంతయు నేల చెప్పరాదు.

చారు : మిత్రమా ; మైత్రేయ ; పరిపాలకుల దృష్టిదుర్బలమై పరిశీలనలేక, నిజము గ్రహింపలేని దైనప్పుడు మనము నిజము చెప్పి యేమిప్రయోజనము ? మన దైన్యమే వెల్లడియగునుగాని న్యాయము జరుగదు. ఈ యపవాదముతోడి మరణము నాకుఁ దప్పదు.

అధికా : అయ్యో ; యెంతకష్ట మెంతకష్టము. అంగారక గ్రహాము వైరము చూపుచుండ, క్షీణదశనున్న బృహస్పతి కెదుర ధూమకేతు వుదయించినట్లే యమాయిక బ్రాహ్మణు డిక్కడ కేలవచ్చెను.

శ్రేష్ఠి : ( వసంతసేన తల్లినిజూచి ) అమ్మా ; నీవీనగలను సావకాశముగ బరిశీలించి నీకూతురు నగ లగునో, కాదో చెప్పుము.

వృద్ధ : ( చూచి ) అట్టివేకాని, అవిమాత్రము కావు.

శకా : వృద్ధకుట్టినీ ; నీకన్నులు మంత్రింప బడినవా నోరు మూగవోయెనా ?

వృద్ధ : ఓరీ ; చచ్చినాడా ; అవతలకుఁ బొమ్ము.

శ్రేష్ఠి : బాగుగ పరిశీలించి యగునో, కాదో చెప్పుము.

వృద్ధ : అయ్యా ; ఈపనితనము నాకన్నుల నాకర్షింపజేయు చున్నది. కాని యివి మాయమ్మాయివి కావు.

అధి : భద్రా ; ఈ నగలను నీవు గుర్తుపట్టలేవా ?

వృద్ధ : నే నానవాలు పట్టలేను ఆ నగలు చేసినవాడే, ఈ నగ లనుకూడ చేసి యుండవచ్చును.

అధికారి, శ్రేష్ఠి : లోకములో నొకవస్తువును బోలిన వస్తువు మఱియొకటి యుండవచ్చును. సరిగా నావస్తువే యనునట్లు వేరొక వస్తువును శిల్పులు చేయుదురు.

శ్రేష్ఠికా : ఈనగలు చారుదత్తునివా ?

చారు : కావు, కావు.

శ్రేష్ఠి : అయితే మరెవరివి ?

చారు : ఈవృద్ధురాలి కుమార్తెవి.

శ్రేష్ఠి : అయితే ఈనగలామెనుండి వియోగమేల పొందెను ?

చారు : బంగారుబండి చేయించుకొమ్మని మాపిల్లవానికి వీని నిచ్చెను. ఇది నిజమే.

శ్రేష్ఠి: అయ్యో; చారుదత్తా! ఇప్పుడు నిజము చెప్ప వలయును. చూచితివా; సత్యముపలికిన సకలపాపములునశించును సత్యమను రెండక్షరములు జగమున నిత్యమై వెలయును. సత్యము నసత్యముచే గప్పరాదు.

చారు: నగలవేమో నాకు దెలియదుకాని, యివి మాత్రము మాయింటినుండి తెచ్చినవే?

శకా: మొట్ట మొదట యుద్యాన వనమును ప్రవేశించి, యామెను జంపి, ఇప్పుడు కపటివై లేదందువా?

శ్రేష్ఠికా: ఆర్య, చారుదత్తా; నీవిప్పుడు నిజము పలుకుము. నీసుకుమార శరీరమును కశాఘాతములు నొప్పించి, నీ దేహమును మాసంతోషముతో గూడ నశింపజేయకుము.

చారు: అయ్యా: నేను పాపమెఱుంగని యింటఁ బుట్టితిని. నేనెన్నడును పాపకార్యములుచేసి యెఱుగను. మీరు నన్ను పాపిగా భావించినప్పుడు నేను పాపినిగానని పలికిన నేమి ప్రయోజనము. (తనలో) వసంతసేన లేని యీజీవితముతో బనియేమి (ప్రకాశముగా) అయ్యా; ఆర్యులారా; వేయేల ఇహపరము లెఱుంగక యొక నారీమణిని జంపితివట. ఆమాటచెప్పిన యాతడే తక్కిన విషయము గూడ చెప్పును.

శకా: నీచే జంపబడియె, ఓరీ; నీవుకూడ చంపితినని చెప్పు మురా?

చారు: నీచేత బలుకబడినదికదా?

శకా: ఆర్యమిత్రులారా; వినండి, వినండి. ఈతడే యామెను జంపెను. సంశయమీతని మాటలవలననే తీరిపోయినది. ఈ దరిద్ర చారుదత్తునకు శారీర దండనమేల విధింపరు?

అధికర : శోధనకా ; రాష్ట్రీయుడు చెప్పినట్లు చేయుము. రాజపురుషులారా ; చారుదత్తుసిం బట్టుకొనుడు.

(రాజభటులు చారుదత్తుని బట్టుకొందురు)

వృద్ధు : ఆర్యులారా ! అనుగ్రహింపుడు న్యాసముగా నుంచఁ బడిన సువర్ణ భాండమునకై చతుస్సముద్ర సారభూతమైన రత్నావళి నిచ్చిన మహాత్యాగి, యిప్పుడీ యకార్యమొనర్చునా ? పోనిండు నాకొ మరితఁ డీతడు చంపినను, నీతని చిరంజీవియగుగాక ! వ్యవహారము అర్థి ప్రత్యర్థులవల్ల కలుగును గదా ? నేనర్థిని, వదలుకొంటిని, గాన నాకై యీతని వదలుడు.

శకా : గర్భదాసీ ; ఆవలకుబొమ్ము ; రాజపురుషులారా ; దీని నావలకుం బంపుడు.

అధి : పూజ్యురాలా ; నీ వేగుము, రాజపురుషులారా యీమెను బంపివేయుడు.

వృద్ధ : అయ్యో ; పుత్రికా, వత్సా ; (అని యేడ్చుచు నిష్క్రమించును)

శకా : వీనికి దగిన శిక్ష చేయించితిని గదా ? ఇక నేబోయెదను. (నిష్క్రమించును)

అధిక : ఆర్య చారుదత్తా, మొదటి నిర్ణయము మాది. చివరది ప్రభువునాజ్ఞ.

అధికరణులు : శోధనకా ; పాలక మహారాజుతో నిట్లు విన్నవింపుము. ఆర్యా, శిక్షాపాత్రుడైనను విప్రునిఁ జంపరాదని మనువు శాసించెను. కాబట్టి వీనిని కట్టుబట్టలతో దేశమునుండి వెడల నడుచుటొప్పు.

శోధనక : చిత్తము. తమ సెలవుప్రకారమట్లే చేసెదను. (అని వెడలిపోయి తిరిగి వచ్చి కన్నీటితో) అయ్యా; తమ యాజ్ఞ మనవి జేసివచ్చితినని పాలక మహారాజుగారిట్లానతిచ్చిరి. "ఈపాటిధనమున కాశించి, వసంతసేనను జంపిన వాని మెడలో నానగలు కట్టి, డప్పులు వాయించుచు, దక్షిణస్మశానమునకుఁ గొంపోయి శూలమున గొఱుత వేయుఁడు. అట్టి యకార్య మెవడేని యెప్పుడేని యాచరించినచో వాని కిట్టి దండనమే విధింపబడునని నా శాసనము"

చారు : ఆహా; పాలకమహారాజు కడుంగడు నవిమృశ్యకారి గదా; (ఆలోచించి) అకటా; ఇటువంటి వ్యవహారాగ్నిలో మంత్రులచేత ద్రోయబడి భూవరులు క్రూరమును నీచమును నగు నవస్థకు లోనై, చెడిపోవుట సత్యముగదా: పుడమిపైఁ దెల్లని కాకులున్నవను మంత్రుల మాటలువిని నమ్ముటచే ననేకమంది నిరపరాధులు చంప బడిరి. చంపఁబడు చున్నారు. చంపఁ బడియెదరు. చెలికాడా, మైత్రేయా; ఇదే మాయమ్మకు దుది నమస్కారమని చెప్పుము. కుమారుని రోహసేనుని గాపాడుము.

మైత్రే : వేరు తెగిన చెట్టును గాపాడుట యెట్లు?

చారు : పరలోకగతులగు మనుజులకెల్ల పుత్రుడు ప్రతిబింబము గదా; నీకునాయందుగల మైత్రిని రోహసేనునియందు జూపుము.

మైత్రే : ఓయీ; నీకు నేనుమిత్రుడనై యుండి నీవు లేకుండ నేను మాత్రము ప్రాణములు నిల్పుకొన గలుగుదునా?

చారు : మిత్రమా; రోహసేను నొక పరి చూపగలవా:

మైత్రే : సరే; అట్లేచేసెదను.

అధి : శోధనకా; ఈబ్రహ్మచారి నవతలకుం బంపివేయుము.

(శోధనకు డట్లుచేయును)

అధికరణు: ఎవ రక్కడ? చండాలుర కాజ్ఞ యిదుగాక.

( చారుదత్తుడు తప్ప తక్కినవా రందరు నిష్క్రమింతురు )

శోధన: అయ్యా; ఈవైపు రండు.

చారు: ఏమీ; మైత్రేయా? నాయవస్థ; బ్రాహ్మణీ, సతీ తిలకమా; కుమారా; రోహసేనా; మీ రెరుగ రైతిరిగదా: నాస్థితిని ( సకిరుణముగా ) విసము, జలము, అగ్ని, త్రాడు, వీనితో నన్ను పరీక్షచేసి, నేరమున్న నన్ను శిక్షింప నగును. కాని, యెవడో శత్రువు చెప్పిన మాటలు నమ్మి నిరపరాధిని, బ్రాహ్మణుని నన్ను బలవన్మరణము నొందించిన వీనికులము నశింపదా! ఇదిగో వచ్చుచుంటిని.

( అందరు నిష్క్రమింతురు. )

నవమాంకము

స మా ప్త ము

# మృచ్ఛకటికము

## దశమాంకము

( ఇరువురు చండాలురు చారుదత్తునితో ప్రవేశింతురు )

చండాలురు : నేరస్థులను విఱిచికట్టి వధ్యస్థలినిజేర్చి తల దెగవేసికాని కొఱ్ఱువేసికాని క్షణములో జంపు నేర్పుగల మనకు నిత్యమదియేపని. ( ముందుజూచి ) అయ్యలారా ; తొలగుడు, తొలగుడు. ఇతడు పూజ్యుడైన చారుదత్తుడు హింసకులమగు మేమాతని మెడలో గన్నేరుపూలదండ వేచినాము. మరణమాసన్నమైన యీతడు చమురులేని దీపమువలె తేజోవిహీను డగుచున్నాడు.

చారు : కన్నీటి బిందువులచే దడిసి, స్మశానకుసుమ మాలికలచే నలంకరింపఁబడి, ధూళిధూసరితమై రక్తచందనముచే నెఱ్ఱబారిన నాశరీరమును బలిభోజనమని తలచి, నన్ను తినుటకు కాకులుమూగి కటువుగ నఱచు చున్నవి.

చండాలురుఇద్దరు : తొలగండీ, తొలగండీ, బాబూ, ఏమిచూచెదరు ? సజ్జనులను పక్షులను బోషించిన సత్పురుషుడను వృక్షము గండ్రగొడ్డలి పెట్టున కూలబోవు చున్నది. చారుదత్తా రమ్ము.

చారు : పురుషుల యదృష్టము లచింత్య ములుగదా ; కావుననే నాకిట్టి దుస్థితి సంభవించినది. మేనెల్ల రక్తచందనముతో హస్తముద్రలువేసి, యాపైని పిండి జల్లినారు. మనుష్యుడనైన నేనిప్పుడు దైవవశమున బశువుగ మారినాను. ( ఎదుటచూచి ) ఆహా ; మనుజు

లకుగల తారతమ్యజ్ఞానము! (సకరుణముగ) పౌరులు నా స్థితినిజూచి, "ఛీ; మనుజుడై పుట్ట" రాదని యనుకొనుచున్నారు. వారు కన్నుల నీరు నించుచు, నన్నేవిధమునను రక్షింపనేరక చేయునది లేక నన్ను స్వర్గమునకుఁ బొమ్మని పలుకుచు నన్నూరడించు చున్నారు.

చండా: తొలగిపొండు, ఆవలకు బోండు ఏమి చూచెదరు? ఇంద్రుని రాజ్యభ్రష్టత, చుక్కలురాలుట, గోప్రసవము. సత్పురుషవధ యను నవి నాలుగు జనులు చూడ రానివి.

చండాలురు: (రెండవ వానితో) ఒరే; అహింతా; చూడు; చూడు; ఈ యుజ్జయినీ నగరికెల్ల పేరొందిన యీ సజ్జనుని వధ సహింపనిదై మిన్ను దుఃఖించు చున్నదోయన కన్నీరు కార్చుచున్నది. మబ్బు లేకయే పిడుగు పడుచున్నది.

రెండవవాడు: ఓరీ, గోహా; మిన్ను దుఃఖించుటయునులేదు. మబ్బులేని పిడుగును కాదు. సౌధములమీదనున్న పురస్త్రీలు చారుదత్తుని స్థితికి విచారించుచు కన్నీరు కార్చుచున్నారు.

మఱియు, వధ్యుడగు నీతనిమనము గొంపోవుచుండ గుంపులు గుంపులుగా గూడుకొని గొల్లున నేడ్చు పురజనుల కన్నీళ్ళచే మార్గమంతయుఁ దడిసినట్లు దుమ్ము రేగుటలేదు.

చారుదత్తు: (నిరూపించి సకరుణముగా) అకటా, యీ స్త్రీలు మేడలమీద నుండి గవాక్షమార్గమున దైన్యముగా నన్నుజూచి "హా; చారుదత్తా" యని కన్నులనీరు గొట్టముల వెంట వచ్చు విధమున నేడ్చుచున్నారు.

చండా: ఓరీ; చారుదత్తా, రా, రా, ఇదే ఘోషణస్థానము దప్పువాయించిచాటెదను. (ప్రోగించుచు) అయ్యలారా; వినండి,

వినండి. ఈతడు సార్ధవాహుడైన వినయ దత్తుని మనుమడు, సాగర దత్తుని కుమారుడు చారుదత్తుడను పేరుగలవాడు. ఈతడు అకార్య కరణమునకుఁ జొచ్చి, జనశూన్యమగు, పుష్పకరండ జీర్ణోద్యానమున ధనమున కాశించి, వసంత సేనయను వేశ్యను మెడపిసికి చంపెను. అప హరించిన నగలతో గూడ నీతడు పట్టుపడెను. తన నేరము నొప్పు కొనెను. కాబట్టి వీనిని కొఱతవేసి చంపునట్లు పాలకమహారాజుగారు మాకాజ్ఞాపించినారు. ఇకముందెవ్వడైన మెవ్వరైన నిట్టి యకార్య మొనరించినవారి కిట్టిశిక్షయే విధింపబడునని తెలిసికొనుడు.

చారు: (నిర్విణ్ణుడై తనలో) అక్కటా! బహుక్రతువులు వేదఘోష ప్రశస్తితో జేసిన పవిత్రవంశమునబుట్టి అవసానమున నేడిట్టి పాపకార్యముచే వెట్టివారిచే జాటింపబడునవస్థనొందుచున్నాను గదా; (హృదయావేగముతో చెవులు మూసికొని) హా; ప్రేయసీ; వసంత సేనా; చంద్రికాధవళమైన పలువరుసతో పగడపుసోరును బంత మాడు కెమ్మోవితో నొప్పుచున్న నీసుందర వదనామృతమును గ్రోలిన నేనిప్పుడీ దుర్యశోవిషము నెట్లు త్రావుదును.

చండా: అయ్యా; తొలగుడు, తొలగుడు. గుణరత్నములకుఁ గనియు, సజ్జనతాపహరుడును, దయాళువును, సువర్ణముగాని యాభర ణమునైన యీయనఘుడీ యుజ్జయినీపురమునకు వెలియగుచుండెను. మఱియు, లోకమున సుఖమనుభవించు జనులనందఱును సుఖపెట్టుదురు కాని కష్టములోనున్నవారిని గన్నెత్తియైనను జూడరు.

చారు: (అంతటగలయఁజూచి) నామిత్రులందఱు వస్త్రమున మొగము చాటువేసికొని, యావల మొగమై పోవు చున్నారు. సుఖ మనుభవించునాడు శత్రువులునైతము మిత్రులగుదురు. ఆపదలో మిత్రుడు నైతము శత్రువగును.

చండా: పురజను లందఱును దొలగిపోయిరి. రాజమార్గము వివిక్తమైనది. వధ్యచిహ్నములుదాల్చిన వీనిని దోడ్కొని పోవుదము.

చారు: ఆహా; నాకీవిపత్తు రానేల ఓమైత్రేయా; ఎక్కడ నుంటివి, ఓబ్రాహ్మణీ, నీవెట్టి పవిత్రవంశమున జన్మించితివి? ఓసుతా; రోహసేనా; నీయాటలలో నాయాపద తెలియక కులుకుచున్నావా?

(తెరలో హా; తండ్రీ – హా; ప్రియవయస్యా)

చారు: (విని జాలిగా) ఓయీ; స్వజాతి మహత్తరుడా. నీవల్ల నేనొక ప్రతిగ్రహము కోరుచున్నాను.

చండా: మావల్ల నీవు ప్రతిగ్రహింప వలసినదేమి?

చారుద: పాపము శాంతించును గాక. దురాచారుడగు పాలకరాజువలె నపరీక్ష్యకారి కాడీ చండాలుడు. కాబట్టి పరలోక సుఖార్థము చరమదశలో పుత్రుని ముఖము జూపింపుమని వేడుకొందును.

చండా: అట్లేచేయుదము (తెరలో ఓ తండ్రీ; ఓనాయనా)

చండా: ఓపౌరులారా క్షణకాల మవకాశమునిండు. ఆర్య చారుదత్తుడు తన కుమారుని జూచునట (తెరవంక జూచి) అయ్యా [redacted] బాలకా, యీవైపునకురా, నాయనా.

(అంతట రోహసేనునితో మైత్రేయుడు ప్రవేశించును)

మైత్రే: రోహసేనా; త్వరగానడువుము, త్వరగానడువుము. మీతండ్రిని జంపుటకై తీసికొని పోవుచున్నారు.

రోహ: హాతండ్రీ, హా నాయనా:

మైత్రేయ: హా; ప్రియవయస్య; నిన్నెడ జూడగలను?

చారు: (పుత్రుని, మిత్రుని జూచి) హా; కుమారా: హా; మైత్రేయ; ఆహా; ఎంతకష్టము సంభవించినదోయీ, నేను పరలోక

మున కేగినపిదప దప్పిచే చాలకాలము బాధపడగలను. ఇక్కడ నాకై యొసగెడి నివాపోదక భోజనములు నాకుఁజాలవు, ఇప్పుడీ యర్భకునకు నేనేమిత్తును. (తన దేహమును జూచుకొని మెడలోని జందెమును దీసి) ఇదిగో, ఇదియొకటి యున్నదిగదా నాకు స్వర్ణ ముతోఁ జేయబడినది. ముక్తామయము కానిది, యీ యజ్ఞోపవీతము భూసురుల కలంకారము పితరులకు దేవతలకుగూడ నిదియే భాగ మర్పించును. (యజ్ఞోపవీతము నిచ్చును)

చండా: రమ్మా, చారుదత్తా; రమ్మా,

రెండవవాడు: ఓరీ; ఆర్య చారుదత్తుని గౌరవముగా బిలువక యేకవచన ప్రయోగము చేయుచున్నావేమిరా?

సంపదలయందును, నాపదలయందును సహర్నిశలు తేజోమయమై వెలుగు ప్రతిష్ఠకిశోరికి మారకదశ యెక్కడరా; అదియును గాక, అపవాదంబుధి నిమగ్నుడైనంత మాత్రమున నీతడు వందనీయుడు గాదా; రాహుగ్రస్తుడైనను. శీతకిరణుడు జనులకు వందనీయుడుగదా?

రోహ: ఓరీ; చండాలా, మానాయనగారి నెక్కడకు దీసి కొని పోయెదవు?

చారు: నాయనా; రోహసేనా; మెడలోగన్నెర పూలదండయును. హృదయమున చింతాభరణమును, భుజమున శూలమును దాల్చి, యజ్ఞపశువువలె వధ్యస్థానమునకు మరణించుటకుఁ బోవు చున్నాను.

చండా: పిల్లవాడా; జాతిమాత్రముచేత మేము చండాలురము కాము సాధుజనులను హింసించుదుర్మార్గులే చండాలురు.

రోహ: అయినచో మాతండ్రి నేలజంపుచున్నారు.

చండా: చిరంజీవి; ఇది రాజాజ్ఞగాని, మాతప్పుకాదు.

రోహ: అట్లయినచో మాతండ్రిని విడిచిపెట్టి నన్ను చంపుడు

చండా: చిరంజీవీ; అట్లనకుము. నీవు దీర్ఘాయు వగుదువుగాక.

చారు: (కన్నీరు రాల్చుచు పుత్రుని నెత్తుకొని) ఇదియే ప్రేమ సర్వస్వము. ఈప్రేమ ధనికులకును దరిద్రులకును సమానమైనది. ఈపుత్రగాత్రస్పర్శ మంచిగంధమును వట్టివేళ్ళను మించిన చల్లని హృదయాను లేపనముగదా; అయ్యో; నామిత్రులుత్తరీయపు చెఱగు మోమున కడ్డము వైచుకొని వాపోవు చున్నారు.

మైత్రే: చండాలులారా; మీరు చాల మంచివారుగ నున్నారు. నాప్రియమిత్రమును విడిచిపెట్టి నన్ను చంపుడు.

చారు: (చూచి) పాపము శాంతించునుగాక. (తనలో) శుభ సమస్థితిని శత్రువు మిత్రుడగును. విపద్దశయందు మిత్రులును శత్రులగుదురు. మిత్రులు మొగము చాటు చేసికొని పోవుచున్నారు. ఇదిగో స్త్రీలు కూడ వాపోవుచున్నారు.

చండా: దారి తొలగుడు. అయ్యలారా; దారితొలగుడు. అపవాదుచే మ్మేను వాయు నీయనఘుని నేలచూచెదరు? పదుగురకుంబ నిష్కళంకమై పడికడవ నేడు త్రాడు తెగి నూతమునిగెడి గతి యయ్యెను.

చారు: (జాలిగ) వసంతసేనా; పండు వెన్నెల బోలెడి దంతపంక్తి పగడపుజిగి కెమ్మోవితోడినీ వదనారవిందామృతమును గ్రోలిన నేనీ దుర్యశోవిషము నెట్లు త్రావుదును.

చండా: ఓరీ; మరల డప్పు వాయించి చాటింపుము.

రెండవవాడు: (డప్పువాయించి) అయ్యలారా వినుండి, వినుండి, (పూర్వము చెప్పినట్లు చారుదత్తుని నేరమును, రాజు శిక్షయు జెప్పుచున్నాడు)

ఛారు: వ్యసన కృశము, అనార్యమును నైన దశనాకుఁ బ్రాప్తించినది. దానికి ఫలముగా దుర్మరణము నొందు చున్నాను. కాని యొక యబలను, నేను జంపితినన్న వార్తవినుటకు చాల చింతించుచున్నాను.

( సౌధమునందు బంధింపఁబడిన స్థావరకుడు ప్రవేశించు )

స్థావర : ( చాటింపువిని ) ఏమిది? నిరపరాధియైన చారుదత్తుని జంపుచున్నారు. అయ్యో, నన్ను మా యజమానుడీ సౌధమునందు బంధించినాడు. కానీ, యిక్కడ నుండియే గట్టిగా నఱచెదను. అయ్యా; వినండి, వినండి. పాపాత్ముడనగు నేను బండి మార్పిడి వలన నావసంత సేనను బుష్ప కరండక జీర్ణోద్యానమునకుఁ దెచ్చితిని. అనంతరము మా యజమానుడు తన్నామె ప్రేమింపని కారణమున, నామెను బల వంతముగ మెడపిసిగి కొట్టి చంపెను. కాని యీ మహాత్ముఁ డేమియు నెఱుఁగడు. అక్కటా, మిగుల దూరమగుటచే నామాట లెవరికిని విన బడకున్నవి. ఏమి చేయుదును? ( ఆలోచించి ) క్రిందికి దుమికెదను. ఇందువలన చారుదత్తుని చావు దప్పును. కాబట్టి యీ ప్రాసాదాగ్ర ప్రతోళికనుండి, యీ జీర్ణ గవాక్షద్వారమున, క్రిందికి దుమికెదను. నేను చచ్చినను లోపములేదు. కులపుత్ర విహంగములకు నివాస వృక్షమైన యీ చారుదత్తుడు బ్రదికిన జాలును ఒక వేళ నేను చచ్చినను బరలోకము బ్రాప్తించును. ( క్రిందికిదుమికి ) ఆశ్చర్యము నేను చావ లేదు. సరిక దా! నాకాలి సంకెలలుకూడ తెగిపోయినవి. కానిమ్ము, ఆ చండాలుర చాటింపు వినబడుచోటికిఁ బోవలెను (అట్లుచేసి) ఓరీ, ఓరీ, చండాలులారా; దారియిండు, దారియిండు.

చండా: అరే; ఎవడురా దారి యిమ్మను చున్నాడు?

స్థావరకు: వినుడు. వినుడు పాపాత్ముడనైన నేను బండి మార్పిడి వలన వసంతసేనను బుష్పకరండ జీర్ణోద్యానమునకు దెచ్చితిని. అనం

తరము మా యజమానుడు తన్నా మె ప్రేమింపని కారణమున నామెను బలవంతముగ మెడపిసిగి, కొట్టి చంపెను. కాని యీ మహాత్ము డేమియు నెఱుగడు.

చారు: ఆహా! కాలపాశముచే కంఠముబిగిసి, మరణమునకు సిద్ధముగానున్న నాకు నెండినపైరుపై ద్రోణమేఘము దిగినట్లు యెవరోపుణ్యాత్ముడు నాయందు దయచేనిటు వచ్చుచున్నాడు. ఆర్యులారా; నేను మరణమునకుఁ భయపడను. కాని, యపకీర్తికి వెఱతును. సత్పురుషులకు పవిత్రమైన చావు పుత్రజననముకంటెను సౌఖ్యకరమైనది. అదియునుగాక, యథార్థముగా దాను దోషినై యిట్టి నీచకార్యమున కొడిగట్టియేమియు నెఱుగని నన్ను దోషిగానెంచుటవలన నేను స్త్రీహత్యా పాతకినను నపవాదముచే దైవోపహతుడనై విచారించుచున్నాము. స్థావరకా నీవు నిజమేపలుకుచుంటివా?

స్థావర: సత్యము, ఎవరికైనను నీసంగతి చెప్పవలెనని, ప్రాసారబాలాగ్ర ప్రతోళిక యందుండి దుమికి పరుగెత్తుకొని వచ్చితిని.

(శకారుడు ప్రవేశించి సంతోషముతో) నేడు నాయింట్లో మాంసముతో వండిన షడ్రసములతో సిద్ధముచేసిన కూరలు గుడోదనము మొదలగు వానిని సుఖముగా భుజించితిని గదా; (చెవియిచ్చి) ఏమీ; పగిలిన కంచువలె ఘనఘనలాడు యీచండాలుర స్వరసంయోగము! వధ్యప్రదేశమున డప్పులు గట్టిగా వాయించు చున్నారు. ఇది యేమైయుండును? దరిద్ర చారుదత్తుని వధ్యస్థానమునకుఁగొనిపోవుచున్నట్లున్నది. నేబోయి చూచెదగాక. శత్రునాశనము నామదికి మిగుల నానందమును గూర్చుచున్నది. ఇదిగాక పగతునివధ కన్నులార గాంచనోచినవారికి మఱియొక జన్మమునఁ గంటి రోగము రాదని పెద్దలవలన వినియున్నాను. విషపు కంతిలో బ్రవేశించిన పురుగు

బయటకు వచ్చుటకు దారి వెదకుచున్నట్లు, దరిద్రచారుదత్తుని నాశనమునకు నేటికి నాకీవెలవు దొరకినది. కనుక నాప్రాసాద బాలాగ్రప్రతోళిక యందు సుఖాసీనుడనై యానందించెను. (పైకిబోయి) ఏమీ; యీదరిద్ర చారుదత్తుని వధ్యస్థానమునకుం గొనిపోవునపుడే యింత మందిజనులు గుంపులుగూడినారే, ఇంక మావంటి ప్రవరులు, వరమనుష్యులు దలగొట్టి వధింపబడుటకుగొంపోవునపు డెట్లుండునో (బాగుగాచూచి) ఇదుగో వీనిని క్రొత్తగిత్తవలె సింగారించి, దక్షిణపు దిక్కునకు దీసికొని పోవుచున్నారు. (మరల చూచి) ఈచాటింపు మాసమీపముననే యాగినది. ఆపఁబడినది కూడ. ఏమీ; స్థావరక చేటుడుకూడ యిక్కడ కనబడుటలేదు. వీడుపోయి నా రహస్యమును బయట పెట్టలేదుగదా; (చూచి) ముందుగా వీనిని వెదకెదను. అదుగో; అక్కడ నున్నాడు. జన సమ్మర్దములో నున్నాడు. (సౌధమునుండి దిగి వానిని జేరబోవును)

స్థావర : (చూచి) అయ్యలారా : ఇతడే. ఆయనయే వచ్చినాడు.

చండాలు : అయ్యలారా; మీరవతలకు బొండు. మాకు దారి యిండు,మీతలుపులు మూసుకొనుడు, అవినయమును కొమ్ములుగల యెద్దిదె వచ్చుచున్నది.

శకా : ఓరీ,ఓరీ; నాకు తెరువీయండి. (సమీపించి) పుత్రకా; స్థావరకా; చేటా; మనము పోదమురా;

చేటు : ఛీ ఛీ, పాపాత్మా; వసంతసేనను జంపి ప్రణయజన కల్పకమైన చారుదత్తుని గూడ జంపనెంచితివా?

శకా : రతనాల కడవవంటి యబలను జంపుదునా? ఇట్లుచెప్పిన దెవరు? అందఱు (చేటునుజూపి) ఈమహాత్ముడు చెప్పినాడు.

శకా: (భయముతో, దనలో) ఏమీ; నాచేటుడు స్థావరకు డేనా; నేను వీనినిగట్టిగా కట్టిపెట్టలేదు కాబోలును, వీడే నా చేసిన యకార్యమునకు సాక్షి, అయిన నిట్లనియెదను. (ప్రకాశముగా) అయ్యలారా, వినుడు, వీనిమాట యబద్ధము, వీడునాబంగారము నప హరించుటచే వీనినిఁ గొట్టిబంధించితిని. ఈతని వీపు చూడుడు. ఆకోప ముచే వీడిట్టి మాటలాడుచున్నాడు. (చాటుగా స్థావరకునకు మురుగు నిచ్చి రహస్యముగా) స్థావరకా నీవు దీనిని దీసికొని యింకొక విధ ముగ చెప్పుమురా.

చేటు: (మురుగును దీసికొని) అయ్యలారా; చూడుడు, ఇతడు నాకీసువర్ణమును జూపి యాసగొల్పి, యసత్యమును జెప్పుమను చున్నాడు.

శకా: (చేటుని చేతిలో వస్తువును లాగుకొని) ఇదియే వీడు దొంగిలించిన బంగారము, ఓరీ చండాలులారా వీనిని సొమ్ముపెట్టెకుఁ, గాపుపెట్టగా వీడాసొమ్మును దొంగిలించెను. కాబట్టి వీనిని, జావగొట్టి బంధించితిని నామాటయందు మీకునమ్మకము లేకున్న వీని వీపును జూడుడు.

చండా: (చూచి) చెప్పినది నిజమే. అంతగాశరీరము నొచ్చి నపు డితడేమైనం జెప్పును.

చేటు: ఆహా; సేవకత్వ మింతేగదా; సేవకులనెవరు నమ్ము దురు. (జాలిగ చారుదత్తునితో) అయ్యా - చారుదత్తా నావిభవ మింతటిదేగదా (కాళ్ళమీదపడును)

చారుద: నాయనా; నీవునాకు నిష్కారణ బంధువవైతివి. నీవు సాధుబాధ సహింపని వాడవైనందున నన్ను మరణమునుండి తప్పింప గట్టి ప్రయత్నమే చేసితివి కాని, నాకర్మమునకు నీవేమిచేయగలవు.

చండా: చేటునిగొట్టి యీావల కీడ్వుము.

శకా: ఓరీ; నీవుపొమ్ము. (వానిని వెళ్ళగొట్టును) ఓరీ; చండాలులారా, యెందుకీ యాలస్యము. చారుదత్తుని వెంటనేచంపుడు.

చండా: ఇంకను వేగముగా కావలయునేని మీారే చంపుడు.

రోహసే: చండాలులారా! మానాయనగారినివదలి నన్ను జంపుడు.

శకా: కొడుకుతో గూడ వీనినిజంపండిరా.

చారు: నాయనా; వీడేపని నైన జేయింపఁగలడు. నీవు మీాయమ్మ యొద్దకు బొమ్ము.

రోహ: తండ్రీ, నేను బోయి చేయునది యేమి!

చారు: నాయనా? నీవిప్పుడే నీతల్లితోగూడ నేయాశ్రమమున కో బోయి మునివై బ్రతుకుము నేచేసిన పాపము నీకు బాధింప కుండునుగాక.

వయస్యా: మైత్రేయా; నీవు వీనిందోడ్కొని పొమ్ము.

మైత్రే: నీవు గతించిన వెనుక నేను జీవించియుందునను కొంటివా?

చారు: నీప్రాణములు నీ చేతిలో నున్నప్పుడు ప్రాణత్యాగ మున కవసర మేమున్నది?

మైత్రే: ఔను నిజమే కాని నాప్రియమిత్రుని నెడబాసి. నేను జీవింపలేను. ఇప్పుడీ బాలకుని తల్లిదగ్గర జేర్చి, నేను నాయనుంగు చెలి కాని ననుసరించెదను. (చారుదత్తుని కంఠము కౌగలించుకొని కాళ్ళపై బడును.)

శకా: ఓరీ; చండాలులారా; పుత్రునితో గూడ చారు దత్తునిం జంపుడు.

చండా: చారుదత్తుని సపుత్రకముగా జంపుమని మాకు రాజాజ్ఞలేదు. కావున వీనిని మేము జంపము, బాలకా; నీవుపొమ్ము నీవుపొమ్ము (బాలుని పంపివేతురు) ఇదిగో; ఇది మూడవ ఘోషణ స్థానము, డప్పువాయింపుమురా, వాయింపుము. (మరియొకసారి చాటింతురు.)

శకా: (తనలో) పురజనులిప్పటికీ నమ్మకున్నారు. (ప్రకాశముగ) ఓరీ; చారుదత్త హతకా, పురజను లింకను నమ్మకున్నారు. నీనోటితో నీవే "వసంతసేనను చంపితి" నని చెప్పుము.

చారు: (ఊరకుండును)

శకా: ఓరీ; చండాల మనుష్యులారా; ఈచారుదత్తహతకుడు చెప్పడు, వీనిని వెదురుబద్దలతో గొట్టి చంపుడు.

చండా: ఓరీ చారుదత్తా; చెప్పుము.

చారు: (సకరుణముగా) నేనింత ఘోరమైన శోకసముద్రమున నుండియు, వెఱచుట లేదు. నామదికి చింతలేదు. కాని నాప్రియురాలైన వసంతసేనను నేను చంపితినన్న జనాపవాదాగ్ని నన్ను మాడ్చుచున్నది. నేను చేయనిపనిని చేసితినని యొప్పుకొనుటయెట్లు?

శకా: ఓరీ; చారుదత్తా! నీనాలుకతోనే నీవే వసంతసేనను జంపితినని చెప్పుమురా, యీపురజనులు నమ్ముదురు.

చారు: ఓ, పౌరులాలా; నేను హంతకుడనై పరలోకమును గుర్తింపక ఆడుదాని నొక సుందరాంగిని, ధనాశచే- మిగిలిన దాతడే చెప్పును.

శకా: చంపబడెనా?

చారు: అవుగాక.

చండా: (మరియొకనితో) ఈదిన మీాతనిని జంపుట నీవంతు.

రెండవవా: నీవంతేరా.

ఒకటవవా: చీట్లు వేసి చూచుకొందమురా. (అనేకలెక్కలు వేసి చూచుకొనుచున్నారు.)

రెండవ: వంతు నాదేయైనచో నొక్కముహూర్తమాగుదము.

ఒకటవ: ఎందువలన?

రెండవ: మా తండ్రి స్వర్గమునకుఁ బోవునపుడు నన్నుఁ బిలిచి, "వీరకా వధ్యపాలిక నీవంతు వచ్చినపుడు వెంటనే చంపక కొంచెముసేపాగు" మని చెప్పెను.

మొదటి: నీతండ్రి యిట్లు చెప్పుటకు గారణమేమి?

రెండవ: ఎప్పుడైన సజ్జనులైనవారు ధనమిచ్చి శిక్షితుని విడిపింతురు. రాజునకుఁ గుమారుడు పుట్టినను, ఆ పుత్రోత్సవసమయమున వధ్యులందఱను విడుదల చేయుదురు. ఏనుగు కట్లు త్రెంపుకొని పారిపోయినను, విడుపుగలుగును. ఒకవేళ రాజులే మారినను, అందఱను విడుదల చేయుదురు.

శకా: ఏమేమీా; రాజులే మారుదురా?

చండా: వధ్యపాలికకు లేఖ వ్రాసికొందమురా?

శకా: ఓరీ; చారుదత్తునిఁ ద్వరగా జంపుడు. (చేటుని చేత బట్టుకొని యేకాంతమున నిలుచును)

చండా: ఇది రాజనియోగము, కాని మా యపరాధముకాదు. కావున నీవు తలచుకోదగిన దేవుడైననుండిన దలచుకొనుము.

చారు: అధికారుల వాక్యములవలన దైవవశమున దోషిగా బరిగణింపఁబడిన నేను స్వర్గమునకుబోయినను, మఱెచ్చటకుఁ బోయినను

విచారింపను. కాని, యాతరుణియే వచ్చి నాయపకీర్తిని బాపునుగాక, ఓచండాలులారా! నేనిలువవలసిన స్థలమెక్కడ ?

చండా: (ఎదుట చూచి) ఓరీ; ఇదుగో దక్షిణస్మశానము. దీనిని జూడగనే వధ్యులు ప్రాణములను వదలెదరు, అదుగో చూడుము సగము శరీరమును నక్కలు లాగుచున్నవి. తక్కిన సగము శరీరము శూలమున గ్రుచ్చబడి పండ్లికలించుచు భీకరముగా గాన్పించు చున్నది.

చారు: హా; ఎంత మందభాగ్యుడనైతిని (కొట్టుపై గూరు చుండును.)

శకా: నేను చారుదత్తుని చావుఁ జూచివెళ్ళెదను. అతడట్లు గూర్చుండెనే.

చండా: చారుదత్తా; భయపడుచున్నావా?

చారు: (తొందరగాలేచి) నేను మరణమునకు భయపడు వాడనుగాను. దుష్కీర్తికి మాత్రమే భయపడుచున్నాను. పవిత్రమైన చావు సజ్జనులకు బుత్ర లాభము వంటిదే.

చండా: ఆర్య చారుదత్తా; గగనసంచారకులైన సూర్యచంద్రులకే విపత్తుగలుగునపుడు ఈలోకమున మానవ మాత్రుల మాట చెప్పనేల? ఒకొక్కప్పుడు త్తముడు పతితుడగును. ఒక్కొక్కవేళ నీచుడుచ్చస్థితి నుండును. ప్రాతవస్త్రమును వదలి నూతనవస్త్రమును ధరించునట్లే యీయాత్మ ప్రాతదేహమును వదలి నూతన దేహమును స్వీకరించును. దీని నెఱిగిన ధీరులు మరణమునకు విచారింపరు. ఇదిగో నాల్గవ ఘోషణ స్థానము. బిగ్గరగా చాటింపుము. (వెనుకటి వలెనే చాటింతురు)

చారు : హా ; ప్రేయసీ, వసంతసేనా ; పండువెన్నెలవలె నున్న దంతపంక్తి, పగడపుజిగిబోలు కెమ్మోవిగల నీవదన సుధారసమును గ్రోలిన యీనోట దుష్కీర్తి యను విసమునెట్లు గ్రోలగలను.

(అంతట తొందరగా వసంతసేనయు భిక్షువును ప్రవేశించు చున్నారు)

భిక్షు : ఔరా, ఆశ్చర్యము? అస్థాన పరిశ్రాంతయైన యీ వసంతసేనం గాపాడుటకు నాయీ యాశ్రమ మెంత యనుకూలించెను.

బుద్ధోపాసికా ; నేను నిన్నిప్పు డెచ్చటకు గొనిపోవలెను ?

వసంత : ఆర్య చారుదత్తుని యింటికే. మృగలాంఛనుని జూచి కలువకన్నె వికసించినట్లాయన సందర్శనము నన్నానందింప చేయును.

భిక్షు : (విని సంతోషముతోఁ దనలో) ఇప్పుడు మన మేమార్గ మునఁ బోదము. ఏ మార్గమున నేమి ? రాజమార్గముననె బోవుదము (విని) ఏమిా ! రాజమార్గమున జనులసందడి మిక్కుటముగా వినబడు చున్నది.

వసంత : (ముందుచూచి) అదిగో అది ఏమి ? ఎంత జనసమూ హము ! భూమికి బరువగున ట్లుజ్జయినీనగర మంతయు నొక ప్రక్కకే యొదిగినది.

చండా : ఇదుగో, పశ్చిమ ఘోషణస్థానము. ఇక్కడ బిగ్గరగా చాటింపుము. (డప్పులు వాయించి చాటింతురు)

చారు : సావధానుడవుకమ్ము. వెఱవకుము. శీఘ్రము గానే కడతేర్తుము.

చారు : ఓ పూజ్యులగు దేవతలారా ?

భిక్షు : ( విని త్వరతో ) బుద్ధోపాసికా; నిన్ను చారుద త్తుడు చంపినాడను నేరమున నాతనిని వధ్య స్థానముకు గొనిపోవు చున్నారు.

వసంత : అయ్యో, మందభాగ్యురాలనైన నాకొఱకా చారు దత్తుని జంపుచున్నారా ? ఎంతకష్టము. త్వరగా నాకు దారిచూపుము, దారిచూపుము.

భిక్షు : అమ్మా, త్వరపడుము. ఆర్యచారుదత్తుడు చిరంజీవియై యుండగనే వారిని దర్శింతము. అయ్యలారా; దారియిండు, దారి యిండు.

చండా : చారుదత్తా; ఇది రాజాజ్ఞ, ఇది యొనరించి తీరవల యును. నీవు తలచుకోవలసిన దేదైన నున్నచో దలచుకొనుము.

చారు : వేయేల. అధికారుల మాటలచే దోషినైన నే నెచ్చ టికి బోయినను నాకు చింతలేదు. కాని నాయపకీర్తి యీ సౌభాగ్య వతియే వచ్చి పోగొట్టును.

చండా : ఆర్య : చారుదత్తా; సమముగా నిలువబడవయ్యా, ఒక్క దెబ్బతో నీతల నఱికి స్వర్గమునకుఁ బంపెదను.

చారు : ( చండాలురు చెప్పినట్లు చేయుచున్నాడు )

చండా : ( నరకబోయి చేతినుండి కత్తి క్రిందబడిపోవుట నభిన యించి ) హా; ఎంత కష్టము ; నేను రోషముతో పిడికిటఁ బిడిని గట్టిగా పట్టుకొనినను , గత్తి పిడుగువలె క్రిందపడినది. ఇది చూడ చారుదత్తు నకు జావు దప్పునట్లున్నది. అమ్మా, సహ్యావాసినీ యనుగ్రహింపుము. అనుగ్రహింపుము. నీవు మా చారుదత్తునకు మోక్షమొసగినచో మా వెలివాడ కులమున నుద్ధరించినట్లే.

మఱియొకడు : మనము ప్రభునాజ్ఞ నిర్వర్తింతము.

రెండవవాడు : కానిమ్మట్లే కావింతము.

(ఇద్దఱు చండాలురు చారుదత్తుని శూలమున నారోపింప జూచుచున్నారు)

చారు : ఈ దోషారోపణ యా తరుణియేవచ్చి తీర్చవలయును.

(భిక్షుకుడు, వసంతసేన ప్రవేశించి చూచి) ఆర్యులారా; వలదు, వలదు. ఎవతె కారణమున నీ మహానుభావుడు వధింపఁబడు చున్నాడో యా మంద భాగ్యురాలను నేనే, నేనే.

చండా : పెన్నెఱి వేణిమూపున విడివడ సుకుమారమైన కుడి చేతిని మీదికెత్తి చంపవలదని యఱచు నీమె యెవ్వతెయో గదా?

వసంత : ఆర్యపుత్రా; చారుదత్తా; ఇదియంతయు నేమి? (యురమున వ్రాలును)

భిక్షు : ఇదేమి? (పాదములపై బడును)

చండా : (భయముతో) ఈమె వసంతసేనయా? మనమీ సజ్జనుని జంపకుండుట మేలైనది.

భిక్షు : (లేచి) ఓరీ చండాలా! చారుదత్తుడు బ్రతికియున్నాడా?

చండా : నూరేండ్లు జీవించును.

వసంత : అమ్మయ్యా; నేను బ్రదికితిని.

చండా : ఈవార్తను యజ్ఞశాలలోనున్న రాజునకెరిగింతమురా (చండాలురు నిష్క్రమింపనుండగా)

శకా : (వసంతసేనం జూచి) అమ్మయ్యో, యీఘట్టు దరిద్రు రాలికిఁ బ్రాణములెట్లు వచ్చినవి? నాకు బైప్రాణములు పైన బోవు చున్నవి. కానీ, పారిపోయెదను. (పారిపోబోవును)

చండా: (శకారుని చేరబోయి) ఓరీ; వసంతసేనం జంపిన వానిని జంపుమని మనకు రాజాజ్ఞ; ఇదుగో యీ రాజశ్యాలకుని బట్టుకొందమురా (శకారుని వెంబడింతురు)

చారు: (ఆశ్చర్యముతో) మెడమీద కత్తియు, మృత్యువు నోట నేను నున్న సమయమున నెండిసపైరుపై ద్రోణమేఘము వలె యిట్టువచ్చిన యీయామె ఎవ్వరోగదా (చూచి) ఆహా; యీయామె వసంతసేనయా; ఈమె రెండవ వసంతసేనయా, లేక దివినుండి భూమి కవతరించెనా? నాకు భ్రాంతియా; కాకున్న మరణించిన యీయామె జీవించుటెట్లు? ఒకవేళ నీమెమరణవార్త యసత్యమా? నాప్రాణము గాపాడ స్వర్గమునుండి దిగివచ్చిన వసంతసేనయా! లేక ప్రయత్న పూర్వకముగ నామె రూపము ధరించి వచ్చిన వేరొక యువతియా?

వసంత: (కన్నులనుండి బాష్పములు రాల కాళ్ళపై బడి) ఆర్య చారుదత్తా, నేను వసంతసేననే. నామూలమున నేగదా; నీ కిట్టి దురవస్థ గలిగినది.

(తెరలో) చిత్రము, చిత్రము. వసంతసేన బ్రతికియేయున్నది.

చారు: (విని వేగముగ మేను నిమిరి స్పర్శసుఖ మనుభవించి కనులుమూసికొని, సంతోషముతోడి గద్గదస్వరమున) ప్రేయసీ, వసంతసేనవా నీవు.

వసంత: అవును నేనే యీ యభాగ్యురాలను.

చారు: (నిరూపించి చూచి సంతోషముతో) వసంతసేనయే. నేను మృత్యుదేవత నోటి కెరయగుచున్న సమయమున గన్నీళ్ళతో నురముదడియ, నన్ను బ్రతికించుటకు మంత్రవిద్యవలె నెటనుండి యేతెంచితివి? సఖీ, వసంతసేనా, నీకొరకై చావనున్న నాకు నీవే వచ్చి ప్రాణములనిచ్చి పుణ్యము గట్టికొంటివి. చనిపోయితి ననుకున్న నిరాశా

సమయమున ప్రియ సమాగమ ప్రభావమునగాక యీ సమావేశము నేమనవలెను. ప్రియురాలా; ఇటు చూడుము. మరణమునకై నా కలంకరించిన ఈయెఱ్ఱని వస్త్రములు యెఱ్ఱని యీ పూలదండలు నాకు పెండ్లికుమారుని వేషములైనవి. మరణమును సూచించి నీ డప్పులు, వాద్యములు మంగళ తూర్యా రావములైనవి.

వసం: కరుణార్ద్రహృదయులైన మీకీ యుపద్రవము రా నిమిత్తమేమి?

చారు: వసంతసేనా, నిన్ను నేనుజంపితినని ప్రాతపగ మనమునం బెట్టుకొని పాపాత్ముడైన రాజ్ఞశ్యాలకుడు నాపై నీనేరమునుమోపెను. తదనంతర మధికారులు విచారణచేసి శిక్ష విధించిరి.

వసంత: (చెవులు మూసికొని) పాపము శమించును గాక. నేను రాజ్ఞశ్యాలకునిచేతనే జంపబడితినే.

చారు: (భిక్షుకునిజూచి) రమణీ, ఈతడెవరు?

వసంత: ఆ పాపాత్ముడు నన్ను జంపగా నీపుణ్యాత్ముడు నన్ను బ్రదికించెను.

చారు: (భిక్షుకునితో) అకారణ బంధువైన నీవెవ్వరవు?

భిక్షు: అయ్యా, తమరు నన్ను గుర్తింపలేరు. నేను తమకు కాళ్ళు పిసికి, తలయంటి జీవించుసేవకుడను. సంవాహకుడను. జూద ములో నోడిపోయి, యప్పుపడి జూదగాండ్రచే గాసి నొందుచున్న నన్ను మీవానిగా నెఱిగి యీబుద్ధోపాసిక తనయాభరణము నొకటి యిచ్చి నన్ను ఋణవిముక్తునిగా జేసెను. అనంతరము జూదపు నిర్వేద మున శాక్యశ్రమణకుడనైతిని. ఈమె గూడుబండి ప్రమాదమున బుష్పకరండక జీర్ణోద్యానమున బ్రవేశించి, రాజ్ఞశ్యాలకుని పొత్తు

నొల్లనికతన నాతనిచే బాహుపాశ బలాత్కారమున జంపఁబడెను. అప్పుడీమె నాకంటబడెను.

( తెరలోఁ గలకలము )

దక్షయజ్ఞధ్వంసము కావించిన వృషభకేతనునకు జయమగుగాక. క్రౌంచపర్వతమును భేదించిన కుమారస్వామికి జయమగుగాక. విక్రమశాలియు, శత్రుజేతయునైన నార్యక భూపాలుడు సువిశాలమైన యీమహామండలము నేలుగావుత.

( శర్విలకుడు తొందరగా ప్రవేశించి )

పాపాత్ముడైన పాలకుని వధించి, యీభూమిని పాలించుటకు సత్పురుడైన నార్యకుని గద్దెపైనుంచితిమి. దుర్మార్గులవలన ఘోరమైన విపద్దశ ననుభవించు చారుదత్తుని యాపదనుండి తప్పింప వలయును. ( ముందుచూచి ) అదుగో జనసమూహము. చారుదత్తుడక్కడ నుండవచ్చును. ఆర్యుని ప్రభుత్వము చారుదత్తుడు జీవించుటచే సఫలమగును. ( త్వరగా సమీపించి ) పొండు. జాల్ములారా; అవతలకు బొండు. ( చూచి సంతోషముతో ) అదుగో చారుదత్తుడు. వసంతసేనతో గూడ జీవించియేయున్నాడు. మాస్వామికోరిక లీడేరినవి. అహా; ఎంతటి భాగ్యము. వ్యసనమహార్ణవమున మునిగి తనగుణశీలములను ధైర్యస్థైర్యముల చేతను నారీరత్నమనదగు వసంతసేనయను తెప్పవలన బ్రదికి చారుదత్తుడు రాహుముక్తసుధాకరుడు వెన్నెలచే బ్రకాశించునట్లు విరాజిల్లుచున్నాడు. నేనీతని యింట దొంగనైన పాతకిని. నే నెట్టీమనను జేరబోవుదును. ఆర్జన మెల్లప్పుడును శోభించును. ( సమీపించి, అంజలిపట్టి ) ఆర్యా, చారుదత్త.

చారు: అయ్యా యెవరు రెవరు?

శర్వి: అయ్యా, తమయింట కన్నము చేసి, న్యాసాపహారణ మును గావించిన మహాపాపాత్ముడను. నేను మిమ్ము శరణు జొచ్చితిని నన్ను రక్షింపవలయును.

చారు: మిత్రుడా; అట్లుగాదు. నీవునా కుపకారమే చేసితివి. (కౌగలించు కొనును)

శర్వి: కులమును గౌరవమును గాపాడు కొనుచు, నార్యుల వర్తనము నభిలషించు నార్యకుడు యజ్ఞవాటము నందున్న పాలకుని బశువును వధించినట్లు సంహరించెను.

చారు: ఏమీ?

శర్వి: నీబండి యెక్కి బెదరుచుఁ బారిపోయిన వాడే యీయార్యకుడు. నేడతడభాగ్యుడైన పాలకునియూ బపసరిమట్లు యజ్ఞములో జంపెను.

చారు: శర్విలకా; పాలకుడు గొల్లపల్లె నుండి రప్పించి, నిష్కారణముగా కారాగారమున బెట్టింప, నీచే విడుదలగాంచిన యీ గొల్లపిల్లవాడా యీ యార్యకుఁడు?

శర్వి: చిత్తము. తమరు సెలవిచ్చినట్లే.

చారు: మంచిది. మనకిది ప్రియమైన విషయము.

శర్వి: మీమిత్రు డార్యకు డుజ్జయినీనగరమున బ్రతిష్ఠింపబడిన వెంటనె యీరాజ్యమున వేణానదీ తీరముననున్న కుశావతీ, రాజ్యమును మీకు ధారాదత్తము జేసినాడు. మీరుదానిని 'ప్రథమ సుహృత్ప్రణయముగ మన్నింతురుగాక (వెనుకదిరిగి) ఓరీ ఈరాష్ట్రియ శ్యాలకుని శకారునిఁ దోడ్కొనిరండు. (తెరలో)

శర్విలకు డొసగెడి యాజ్ఞలన్నియు జెల్లుగాక.

శర్వి: అయ్యా, ఆర్యక మహారాజుగారిట్లు మనవి చేయుమనినారు.

"ఇది యంతయును యుష్మద్గుణోపార్జితమైన రాజ్యము, దీనిని మీరందఱు స్వేచ్ఛగా ననుభవింతురుగాక"

చారు: ఈరాజ్యము నాగుణోపార్జిత మెట్లగును?

[తెరలో] ఓరీ; రాష్ట్రియశ్యాలకా నీవు చేసిన పాపమునకు ఫల మనుభవింప రమ్ము.

[రాజభటులు రెక్కలు విఱిచి కట్టబడిన శకారునితో ప్రవేశింతురు]

శకా: ఆశ్చర్య మాశ్చర్యము; నేను గాడిదవలె పరుగెత్తినను వీరు నన్ను కుక్కనీడ్చుకొని వచ్చినట్లు నన్నీడ్చుకొని వచ్చినాడు [దిశలుచూచి] ఏవైపుజూచినను రాజభటులేకనబడుచున్నారు ఇకనాకు దిక్కెవరు? కానిమ్ము ఆశరణాగతులను రక్షించు నాచారుదత్తునే వేడుకొందును. అయ్యా చారుదత్తా రక్షింపుము. రక్షింపుము. [కాళ్ళపైఁబడును]

[తెరలో] అయ్యా, చారుదత్తా వీనిని వదలుడు, వదలుడు.

శకా: [చారుదత్తునితో] అయ్యా, శరణు శరణు. నన్ను గాపాడుము.

చారు: [దయతో] ఈశరణాగతునకు నభయ మిచ్చితిని.

శర్వి: [వేగముగా] ఛీ, ఛీ వీనిని చారుదత్తుని యొద్ద నుండి యావలకుఁ దీసికొనిపొండు. [చారుదత్తునితో] అయ్యా, యీ పాపాత్మున కేమిశిక్ష విధింపుమని మీ యాజ్ఞ? కుక్కలచే గరిపింతమా? లేక శూలములచేతఁ బొడిపించుటా; రంపముచే గోయించుటా?

శకా: భట్టారకా; చారుదత్తా, నేను నిన్ను శరణుజొచ్చితిని నన్ను రక్షింపుము. మీవంటి వారికిఁ దగినట్లు చేయుము ఇకమీాద నేనెన్నడు నిట్టి దుష్కార్యము జేయను.

(తెరలో పౌరులు)

చంపుడు, చంపుడు. వీని నేల బ్రతుకనిత్తురు.

వసంత: (చారుదత్తుని మెడలోని వధ్యమాలనుతీసి శకారుని మెడలో వేయును.)

శకా: పుట్టు దాసీ: నన్ను రక్షింపుమమ్మా నేను నిన్నెన్నటికిని జంపను. నన్ననుగ్రహింపుము, నన్ను మన్నింపుము.

శర్వి: ఓరీ; వీరిని దూరముగా గొంపొండు. అయ్యా: చారుదత్తా, వీని కేమిశిక్ష విధింపమనియెదరో సెలవిండు.

చారు: చెప్పెదను. నేను చెప్పినట్లు చేయుదురా.

శర్వి: సందేహామేమి?

చారు: నిజముగానా?

చారు: అట్లైనచో శీఘ్రముగా వీనిని...

శర్వి: ఏమీా, చంపమందురా;

చారు: కాదు, కాదు, విడిచిపెట్టుడు.

శర్వి: కారణ మేమి?

చారు: అపరాధముచేసిన శత్రువునైనను శరణని కాళ్ళపై బడినవానిని శస్త్రముచే నెట్లు జంపవచ్చును?

శర్వి: అట్లైన కుక్కలచే గరిపింతమా?

చారు: వలదు, వలదు. వీని కేదైన యుపకారము చేసి, ప్రాణములతో విడిచిపుచ్చుటయే వీనికి తగిన శిక్ష.

శర్వి : ఏమీ ; ఆశ్చర్యము. చారుదత్తు డిట్లనుచున్నాడు. ఏమిచేయుదును ?

చారు : నీ వేమియు చేయవలదు. వీనిని విడిపింపుము.

శర్వి : అట్లే, విడిపించెదను.

శకా : ఏమీ ; యీావింత. నేను బ్రతుకుదునని యెన్న డనుకొనలేదు.

( ఇరువురు రాజభటులతో శకారుడు నిష్క్రమించును ).

( తెరలో గలకలము )

( మరల తెరలో )

ఆర్య చారుదత్తుని భార్య ధూతాంబ కాళ్ళ కడ్డువచ్చిన పిల్లవాని నావలకుఁ ద్రోసి జనులు కన్నీళ్ళతో వారించినను మానక మండుచున్న యగ్నిలో ప్రవేశించుచున్నది.

శర్వి : ( విని తెరవంక జూచి ) ఏమీ ; చందనకా, ఏమిది ?

చంద : శర్విలకా ; నీవు చూడలేదా ; మహారాజసౌధమునకు దక్షిణమున జనులు గుంపు కూడియున్నారు. నేను "అమ్మా ! సాహసము చేయకుము. ఆర్య చారుదత్తుడు జీవించును" అని మనవి చేసితిని. దుఃఖసముద్రమున మునిగియున్న యామెకు నా మాటలు వినబడవు. ఒకవేళ వినబడినను నామెకు నా మాటలయందు విశ్వాసముగూడ నుండదు.

చారు : ( ఉద్వేగముతో ) ప్రేయసీ, నేను జీవించియుండ నీకీ సాహస మేల ? ( పైకి జూచి నిట్టూర్పు విడిచి ) ఓసాధ్వీ, నీ విమల చారిత్రము యిహలోకమున నుండరానిదై నను నీ వతని బాసి యెట్లు స్వర్గమున కేగుచున్నావు ? ( వివశుడగుచున్నాడు )

శర్వి : ఓహాహో ; ప్రమాదము వాటిల్లుచున్నదే, ఆర్య చారు దత్తుడు మూర్ఛాగతుడైనాడు. కార్యము మించిన మన యత్నము లెల్ల విఫలమగును.

చందన : అయ్యా, తెప్పిఱిలుడు. అక్కడ కేగి యా సాధ్విని బ్రతికింపుడు. లేనిచో ప్రమాదము సంభవించును.

చారు : ( తెప్పిరిల్లి ) హా ; ప్రేయసీ ; ఎక్కడ నున్నావు ! బదులు పలుక వేమి ?

చంద : అయ్యా ; ఇటురం డిటురండు.

( అందరు నడచుచున్నారు )

( అంతట ధూతాంబ చెఱగు పట్టుకొని బాలుడు, బాలు ననుసరించు విదూషక, రదనికలు ప్రవేశింతురు )

రోహ : అమ్మా ; అమ్మా ; నన్ను గాపాడవా ? నిన్ను విడిచి నేను బ్రతుకగలనా ? ( చీర చెఱగు మరల పట్టుకొనును )

విదూ : అమ్మా ; సాధ్వీమణి ; బ్రాహ్మణస్త్రీ లొంటరిగా జితాధిరోహణము సేయుట పాపమని ఋషులు చెప్పియున్నారమ్మా.

ధూతాంబ : అయ్యా ; ఆర్యపుత్రుని యమంగళవార్త వినుట కంటె ఏ పాపకార్యమునైన నాచరించుటయును మంచిదే.

శర్వి : ( ఎదుట చూచి ) అయ్యో ; ఆమె చితిని సమీపించు చున్నదే.

చారు : ( తొందరగా నడచుచున్నాడు )

ధూతాంబ : రదనికా : బాలకునిఁ బట్టుకొనుము. నా మనో రథము నీడేర్చుకొందును.

రదన: (దైన్యముతో) అమ్మా? మీ సెలవు ప్రకారమే చేసెదను.

ధూతాంబ: అయ్యా, మైత్రేయా; ఈపిల్లవానిం బట్టుకొనుము.

మైత్రే: అమ్మా; కార్యసిద్ధికి యత్నించువారొక యుత్తమ బ్రాహ్మణుని ముందుంచుకొని పోవలెను. కావున నేను మీకంటె ముందుగా నగ్నిలో బ్రవేశింతును.

ధూతాంబ: ఏమీ; ఈ యిరువురు నా కడ్డమే వచ్చిరి. (పిల్లవానిని కౌగలించుకొని) నాయనా, నిన్ను నీవే కాపాడుకొనుము. లేకున్న మాకుఁ దిలోదకము లిచ్చువా రెవరు? అతిక్రాంత మనోరథములుగల మాకు దిక్కెవరు? మీ తండ్రిగారు వచ్చి నిన్ను గాపాడుట యసంభవముగదా.

చారు: (తొందరగా బ్రవేశించి) నేనే నా కుమారుని రక్షించుకొందును. (బాలకు నెత్తుకొని కౌగలించుకొనుచున్నాడు)

ధూతాంబ: (చూచి) ఏమీ; యార్యపుత్రుని కంఠస్వరము వలె వినబడుచున్నదే. (నిపుణముగా చూచి సంతోషముతో) ఏమీ నా భాగ్యము. ఆర్యపుత్రుడే! మా కెంతటి ప్రియము!

రోహ: (తండ్రిని జూచి సంతోషముతో) ఆశ్చర్యము. మా తండ్రియే నన్ను కౌగలించుకొన్నాడు. అమ్మా; నీవును బ్రదికితివి. నన్ను మా తండ్రియే పట్టుకొన్నాడు. (కౌగలించుకొనుచున్నాడు)

చారు: (భార్యతో) ప్రేయసీ; నీభర్తనైన నేను జీవించియుండ నీవిట్టి సాహసకార్యము లొనరింపనేల? భాను డస్తమింపకుండ పద్మిని కనుదమ్ములు మొగుడ్చునా?

ధూతాంబ: ఆర్యపుత్రా; కావుననే యదియు చేతనమై చుంబింపబడుచున్నది.

మైత్రే: (చూచి సంతోషముతో) ఆహా: ఆశ్చర్యము. ఈ నాకన్నులతోనే నాప్రియమిత్రుని జూచుచున్నాను. ఆహా, సతీ ప్రభావము! అగ్నిప్రవేశ ప్రయత్నముచేతనే ప్రియసమాగమము ప్రాప్తించినది. (చారుదత్తుని జూచి) ప్రియ వయస్యునకు జయము. జయము.

చారు: మిత్రమా, మైత్రేయా ఇటు రమ్ము (కౌగలించు కొనును.)

రదనిక: ఆహా; ఏమీ; యీ సంఘటన. ఆర్యా, నమస్కారము.

(చారుదత్తునకు నమస్కరించును)

చారు: (వీపుపై చేయివైచి) రదనికా లెమ్ము (లేవదీయును)

ధూతాం: (వసంతసేనం జూచి) చెల్లెలా; మా యదృష్ట వశమున బ్రదికి కుశలముగ నుంటివిగదా?

వసంత: అప్పుడుగా దిప్పుడు బ్రతికితి నమ్మా. (ఇరువురు కౌగిలించు కొందురు)

శర్విలకు: దైవానుగ్రహమున నార్యుని సుహృద్వర్గ మెల్ల బ్రదుకు గాంచినది.

చారు: మీ యనుగ్రహము చేతనేగదా?

శర్వి: ఆర్యురాలా! వసంతసేనా? ప్రభువు సంతోషించి, నిన్ను వధూశబ్దముచే సత్కరించుచున్నారు.

వసంత: ఆర్యా; కృతార్థురాలనైతిని.

శర్వి: (వసంతసేన మేలి ముసుగు దలమీఁదుగా రానిచ్చి చారుదత్తునితో) ఆర్యా; యీభిక్షువున కేమి చేయదగును.

చారు: ఓ భిక్షూ; నీ యభిమత మేమి ?

భిక్షు: ఈ శరీరములును యీ కనబడున దంతయు ననిత్యమని దోఁచుచున్నది. నాకీ సన్యాసాశ్రమమందే యెక్కువ ప్రీతికలదు.

చారు: మిత్రమా; ఇది నిశ్చయము కనుక వీనిని బౌద్ధ విహారముల కన్నిటికిని గులపతిగా నియమింపఁ దగును.

శర్వి: ఆర్యుని యాజ్ఞాప్రకార మట్లే యగును.

భిక్షు: నాకది యిష్టము. మనకందఱకును బ్రియమైనది.

వసం: ఇప్పుడు నా ప్రాణములు కుదుటబడినవి.

శర్వి: స్థావరకున కేమి చేయవలయును.

చారు: వానిని దాస్యవిముక్తుని జేయుఁడు. ఆ చండాలురు సర్వ చండాలురకును బ్రభువు లగుదురు గాక. చందనకుఁడు పృథ్వీ దండపాలకుఁ డగునుగాక. రాష్ట్రియశ్యాలకుఁడు బూర్వపు పదవిలోనే యుండునుగాక.

శర్వి: ఆర్యా, అంతయు బాగుగనే యున్నది. కాని యీ శకారుని జంపుదుము. వదలుఁడు.

చారు: శరణాగతున కభయము. అపరాధియైన శత్రువు శరణుజొచ్చి, పాదముల మీఁద బండినపుడు వానిని శస్త్రమున దునుమాడరాదు.

శర్విలకుఁడు: ఆర్యా; తమ కింకేమి ప్రియము కావలయును ?

చారు: ఇంతకన్న నాకు వేరేమి ప్రియము కావలయును ? నాచరిత్రము పవిత్రమైనది శత్రువు శరణుజొచ్చి విడుదల పొందెను.

బలగర్వితుడైన పాలకునిజంపి మన మిత్రుఁ డార్యకుడు రాజయ్యెను. పూర్వమునకంటె సిరి యధికమయ్యెను. నారీమణియగు యీ నా ప్రేయసిని, నా ప్రియమిత్రుని మరల కలిసికొంటిని. అన్నియు నిట్లు సమకూడినపిదప నిక నేగోరదగిన దేమున్నది?

కొందఱను గ్రిందు పరచుచు, కొందఱ నున్నతస్థితికిఁ దెచ్చుచు, గొందఱను గూల్చుచు, కొందఱను దేల్చుచు, గొందఱను పీడించుచు గొందఱను సుఖపెట్టుచు, జిందరవందరజేయు నీలోకపునడక యేతపుఁ గుండవలె నుండును.

భ ర త వా క్య ము.

తే. గీ. కుంభవృష్టిగ వానలు కురియుగాక,
వసుధసస్య సమృద్ధయై వరలుగాక,
వర్ధిలునుగాక గోవులు పాడిగలిగి
యేలుదురుగాక భువిలెస్స పృథివిపతులు.

ఇది ఉభయభాషాప్రవీణ,
రాపూరి వెంకట సుబ్బమ్మాంబ
రచించిన మృచ్ఛకటికము
ఆంధ్రము, సర్వము
స ం పూ ర్ణ ము.

---

# ఈ కవయిత్రి యితర గ్రంథములు

కర్పూరమంజరి : ఇది రాజశేఖరకవి ప్రాకృతరూపకమున కనువాదము.

దీనిని మదరాసు విశ్వవిద్యాలయమువారు 1938 వ సం॥ బి. ఏ. కు పఠనీయగ్రంథముగా నియమించిరి.

వెల 1—0—0

ఉదారపాండవము : వచనగ్రంథము.

ఇది 1939 వ సంవత్సరమున హయ్యరు గ్రేడు ట్రెయినింగుకు నాన్ డిటైల్డు టెక్స్టుగా నియమింపబడినది.

వెల 1—0—0

ఆంధ్ర హర్ష చరిత్రము :

( అచ్చునకు సిద్ధముగా నున్నది. )

